

# ఆంధ్రకవితరంగిణి

## పదునాల్గవ సంపుటము

" Published with the Financial Assistance from Ministry of Education, Government of India."

శ్రీ చాగంటి శేషయ్యగారు

శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

## పదునాల్గవ సంపుటము

రచయిత :

శ్రీ చాగంటి శేషయ్యగారు

ప్రకాశకులు :

హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయము,

కపిలేశ్వరపురము, తూర్పుగోదావరిజిల్లా.

## SRI C. RAMALINGA REDDY Kt.

M.A. (CANTAB), HON. D.LITT.

Vice-Chancellor, Andhra University.

"I have read with much pleasure and appreciation Chaganty Seshayya's "Andhra Kavi Tarangini". It is a remarkably fine contribution to the History of our literature and our country. He taken trouble to study the latest archæological material available and make his treatment of the different Poets as scientifically accurate as possible.

– – Sri Seshayya seems to be fitted both by his knowledge of the subject and his scientific spirit to present the Andhra world with an authoritative Lives of Andhra poets.

He does not mix up Puranas with history and legend with truth and that is a rare and refreshing feature.

*(Sd.) C. R. Reddy*

## THE HINDU

Research into the records of the past brings forth continually new facts on the history of literature and the present book is the first of many volumes which the author proposes to bring out in an attempt to write a new history of Telugu poets. According to earlier historians of Telugu literature, the maximum number of Telugu poets worth the name did not exceed three hundred and fifty. But the author includes many more whose names have hitheato laid hidden in the unfathomed caves of time. The author has unearthed considerable interesting material by an intensive study of inscriptions ... "

( True Copy )

## శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు

(ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రధానపండితులు)

"మీ గ్రంథము, మీరు చేసిన కూలంకష పరిశ్రమకు ఫలము కవిజీవిత కవిచరిత్రకారులు అడుగుపెట్టలేని గహనములలో మీరు రాచబాటలు వైచితిరి."

## శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు

(ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రధానపండితులు)

"...మీ కవితరంగిణి కల్హణుని రాజతరంగిణివలె సారస్వతములో ముఖతిలకంగా ప్రకాశింపకలదు...... ఆధారవస్తువివేచనలో మీ సమగ్రవిజ్ఞానమును పరిమాణీకరణదృష్టియు ద్యోతమగుచున్నది"

**ఆంధ్రపత్రిక** "......శేషయ్యగారు నిష్పక్షపాత బుద్ధితో యదార్థమెంతయో గ్రహించడానికి అత్యధికంగా శ్రమపడ్డారు. అనుమాన ప్రమాణంతో కూడుకొన్న చరిత్రకు యిదమిద్ధమన్న నిర్ణయాలు మొండిగాచేసి చరిత్రకు అపకారం చేయకుండా చారిత్రక వస్తువుల నందించి సూచనమాత్రం తన ఊహను చెప్పి పాఠకులకు నిర్ణయాలకు సదవకాశమిచ్చారు. వీరిప్రయత్నం ప్రశంసనీయమే"

**ఆంధ్రప్రభ :** "ఆంధ్రులకు సమగ్రమైన కవులచరిత్ర గ్రంథములేని లోటుదీనితో తీరినట్లయినది. తక్కిన సంపుటములనుకూడ త్వరలో వెలువరించడానికి తగినప్రోత్సాహం యివ్వవలసిన భారం ఆంధ్రుల పైనున్నది."

## శ్రీ వేలూరి వెంకటరమణయ్యగారు

(మదరాసు విశ్వవిద్యాలయము రిటైర్డు పండితులు)

"...... తమగ్రంథమువలన పూర్వవిమర్శకుల రచనలకు వెదకి చూడవలసిన యావశ్యకత లేకపోయినది. ఆంధ్రకవితరంగిణి యందు తామవలంబించిన పద్ధతి యధునాతన చరిత్ర రచనాపద్ధతి వంటిది మీయత్నము కడుప్రశంసనీయము."

శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు

"ఆంధ్రకవితరంగిణిని చాలభాగము చదివితిని. స్థూలదృష్టు లకు మీపరిశ్రమము గోచరింపదేమోగాని తక్కిన యావదాంధ్ర కవులే గాదు పండితులే కాదు పామరులే కాదు వీరలెల్లరును కన్నుల నద్దుకొందురనియే నాయాశయము. ప్రప్రథమమున మార్గదర్శి మహర్షి : అనుచొప్పున శ్రీగురుజాడవారియుద్యమమునకుపూనిరి. కొంతవరకే కృతకృత్యులైరి. వారిని నేను ప్రత్యక్షముగా నెఱుఁగుదును. మాకంటె సర్వదా కొంతపెద్దలైనను సమకాలీనులమే పిమ్మట వీరేశలింగంపంతుల వారారంభించి చాలవరకు కృతకృత్యులైరి. తరువాత మీరు దీనికి నుపక్రమించిరి. ఇప్పటికి వారిద్దరిని సూత్రకారులుగను, వృత్తికారులుగను భావించుచో మీకు భాష్యకార స్థానం లభించుననుకొంటిని...... భవతు, ఇప్పటికి భాష్యకారస్థానముమీదే. మీయుద్దేశము సర్వదాజయప్రదమగుఁగాక! విద్యాశాఖాధికారులు మీవరిశ్రమను గమనింతురుగాక—ఇంతే స్వస్తి.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, మద్రాసు.

"...మీకవితరంగిణి చాలవరకు చదివితిని. అందు మీరు తీసికొనినశ్రమ అపారము. దానిప్రయోజనమపరిమితము. పెను కటి విషయములనేగాక ఆయా కవులనుగూర్చి యిటీవలి విమర్శనల మూలముగాను శాసనాదిపరిశోధనల మూలముగాను బయలువడిన యనేక విషయములనుగూడ పొందుపరచి యాకవుల చరిత్రను సమగ్రము గావించితిరి. ఏవిషయమునను తీవ్రవాదములకు లోనుగాక నిష్పాక్షికమగు చారిత్రికదృష్టిని నెలకొల్పుటకు మీరుచేసిన ప్రయత్నము మిగుల ప్రశంసనీయము. తక్కిన భాగములుగూడ త్వరలో ప్రకటితము లగునని యాశించుచున్నాఁడను..."

దు ర్గే శ న ం ది ని :: రచయిత :— శ్రీ చాగంటి శేషయ్యగారు

ఇందు పఠానులకును రసపుత్రులకును జరిగిన కలహము - రాజా మాన్‌సింహుని పుత్రుఁడగు జగత్సింహుని మహావీరత్వము - చక్కని శైలితో తెనుఁగుభాషలో మేటినవలా రత్నమనుటకు సందియము లేదు. ఇదిద్వితీయముద్రణము. (టెక్స్టుబుక్ కమిటీవారిచే లైబ్రరీలు ఉపయోగించుటకు అప్రూవుకాబడినది)

న వా బు న ం ది ని :: రచయిత :— శ్రీ చాగంటి శేషయ్యగారు

దుర్గేశనందని యందలి మిగిలిన కథా విశేషములన్నియు "నవాబు నందిని" యందు చదువవలయును.

రా ధా రా ణి :: రచయిత:— శ్రీ చాగంటి శేషయ్యగారు

నిరుపేదబాలిక "రాధారాణి" — గొప్పధనవంతుడు దేవేంద్ర నారాయణరాయ్ దైవికసమావేశము — వీరిరువురి పరిణయగాథ.

శ్రీ : రచయిత :— శ్రీ చాగంటి శేషయ్యగారు

చక్కని చారిత్రాత్మకమైన నవల

మహమ్మదుపురము శత్రువుల హస్తగతమైన పిదప అద్వితీయ ప్రతిభాశాలియు, మహారాజునగు సీతారామరాయ లెట్లు ప్రవర్తించెనో ఏరూపముతో నెట్టియవస్థయందెట్టికార్యము లాచరించుటలో బ్రవృత్తుడయ్యెనో యిందు మనోహరమైనశైలిలో హృదయరంజకముగా వర్ణింపబడినది. ప్రకృతియొక్కరీతి, నీతులిందు వివరింపబడినవి. చక్కనిఅచ్చు మంచిగ్లేజుకాగితం.

వి శ్వ ప్ర య త్న ము :: రచయిత:— శ్రీ చాగంటి శేషయ్యగారు.

ఇందలిరంగములును పాత్రములును నాంధ్రదేశమునకు సంబంధించినవి. కథాకల్పనము పాత్రగుణపోషణము, మొదలగునవి యిందు చక్కఁగాఁ బ్రదర్శింపబడినవి. ఇది సాంఘిక నవలయైనను, నపరాధ పరిశోధక నవలాలక్షణములచే నతి మనోహరముగ నలరారుచున్నది. మంచి గ్లేజుకాగితము, చక్కని అచ్చు!

హిందూ ధర్మ శాస్త్ర గ్రంథ నిలయము,
క పి లే శ్వ ర పు ర ము, తూర్పుగోదావరిజిల్లా.

## విజ్ఞప్తి

ఈ ఆంధ్రకవితరంగిణి ప్రచురణకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక సంఘమువారు ఆర్థికసహాయము నందజేసి యుండిరి. వారిని మేమెంతయు అభినందించుచున్నాము.

పదునైదవ సంపుటముకూడ ప్రారంభించి యుంటిమని తెలుపుటకు సంతసించుచున్నాము.

కపిలేశ్వరపురం
1-8-1971.

ప్రకాశకులు.

విమర్శకాగ్రేసర

## శ్రీ చాగంటి శేషయ్యగారి యితర రచనలు:

| | |
|---|---|
| దుర్గేశనందిని | నవల |
| నవాబునందిని | ,, |
| విశ్వప్రయత్నము | ,, |
| శ్రీ | ,, |
| రాధారాణి | ,, |
| చంద్రసేనుడు | ,, |

హిందూలా (సమిష్టికుటుంబము)

మదరాసు లోకలుబోర్డు ఆక్టు (రెండుసంపుటములు)

మదరాసు సహకార సంఘముల ఆక్టు

ఆంధ్రకవితరంగిణి (సంపుటములు)

# విషయసూచిక

శ్రీరామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి

## పదునాల్గవ సంపుటము



## 356 కొటిరాయరఘునాధ తొండమాన్ మహీపాలుఁడు

ఇతఁడు మదరాసు రాష్ట్రమందలి పుదుక్కోటసంస్థానమును హూణశకము 1767 మొదలు 1789 సం॥వఱకును బరిపాలించిన విద్వత్ప్రభువు. ఈపుదుక్కోటసంస్థానము దక్షిణమున తిరుచునాపల్లి మండలసామీప్యమున నున్నది. సూర్య చంద్ర వంశములకు సూర్య చంద్రులు వంశకర్తలయినట్లే పుదుక్కోట సంస్థానాధిపతుల వంశమునకు దేవేంద్రుఁడు వంశకర్త. దేవేంద్రుఁ డొకనాఁడొక మానవవనితను గామించి, వరించి యామె యందుఁ గుమారులను గనియె నఁట. ఆవంశములోనివాఁడైన యీకవి. సుదురుపాటి వెంకనార్యునిచే నాంధ్రభాషార్ణవమును రచియింపఁ జేసి మాతృభూతేశ్వరస్వామికిఁ గృతిచేయించెను. అందువర్ణింపఁబడిన యంశములను బట్టి యీ కవి వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.




ఈ వంశము వారికి తొండమాన్ అను బిరుదము కలదు. సౌలభ్యము కొఱకీకవిని రఘునాథభూపాలుఁడని యనుచుందురు. కాని తంజావూరు రాజ్యపరిపాలకుఁడగు రఘునాథభూపాలుఁ డింకొకఁడు కలఁడు అతఁడును కవియే. నామసామ్యమునుబట్టి యొకప్పుడు పాఠకులు భ్రమపడుచుందురు. అతఁడు రామాయణగ్రంథకర్త ఈతఁడు పార్వతీపరిణయగ్రంథకర్త.

ఈ కవిని గూర్చి నుదురుపాటి వెంకనార్యుఁడు తన యాంధ్రభాషార్ణవమున నీక్రిందిపద్యములు వ్రాసియున్నాఁడు.

ఉ. శ్రీరఘునాథ రాయనృప శేఖర! నీదుకరాసి భీమ కా
ళోరగ తుల్యమాటను రణోర్విని దుర్మద మత్తచిత్తులౌ
వీరుల ప్రాణవాయువులు వీఁడ్చుట యుక్తమి దెంత వింత య
య్యారె సముద్రమయ్యును రవంతయు భంగముఁ గాంచ
దెప్పుడున్

చ. కడెములు బాహుపుర్లు పతకంబులు పోగుల జోడులుంగ రా
లడుగఁగవచ్చు భూమణములౌటఁ దదంగములిమ్మటంచుఁ గో
రెడి భవదీయ సాయక మరిప్రతతిన్ ఘనమార్గణాళి కీ
నడతలు యుక్తమౌనె రఘునాథ దిలీపవిక్రమా

ఉ. శ్రీరమణీమణీచరణ శింజసమంజస రత్నపుంజ మం
జీర నినాదవద్గృహావిశేషుఁడవౌచు సపుత్ర పౌత్రితన్
ధారుణి నేలు సౌభరివిధమ్మున సర్వమహీపతుల్నినున్
సారెకుఁ గొల్చులీల రఘునాథనృపాల విశాలవైభవా!

ఈవంశమువారు శూరులును బలపరాక్రమములు గలవారై యుండిరి. ఈరఘునాథభూపాలునకుఁ బ్రపితామహుఁడైన రఘునాథ రాయల సామర్థ్యమునువిని అప్పటికిఁ దంజావూరుపరిపాలకుఁడుగా నున్న విజయరాఘవభూపతి యతనిని దనయొద్ద సైన్యాధిపతిగా నుండుమని కోరినట్లును నతఁడట్లు కొంతకాలమాతనికొలువు నందున్న ట్లును. వెంకనార్యుఁడు రచించిన తొండమాన్ వంశావళిలోని యీక్రింది సీసమాలికాభాగమునుబట్టి తెలియుచున్నది.

సీ. పూర్ణ శౌర్యాకృతి స్ఫురితత్వమున నుండ
నతని గుణంబుల నాలకించి

తంజాపురీధరాధ్యక్షుఁడై తగునట్టి
విజయరాఘవమహీవిభుడు మెచ్చి
ప్రియమునఁ బిలిపించి బిగి కౌఁగిటఁ గదించి
సరిజేటి గావించి గరిమనుంచి
కొలువుండు మంచని పలుకరించిన యంత
నేమనునోయని హెచ్చరికగ
ననువైన దళమును నలదళంబునకును
దగునట్టి సరదారు దనకు లేమిఁ
దెలియఁ జేసిన యంతఁ గలగల యని నవ్వి
తద్భావమెల్లఁ జిత్తమునఁ దెలిసి
పదివేల యాళ్లున్న బంట్రౌతు బంట్రౌతె
పదిపల్లెలున్నను ప్రభువు ప్రభువె
యడిదంబు పట్టికొల్చెడి వారమే గాని
కొలుచుట వలనఁ దక్కువలు లేవు
కొలుచు వారలకుఁ దక్కువయేమి యనిలోనఁ
దనదోర విడిచి పాఱునది యొకటె
మమ్ము మాప్రాఁజను మర్యాదల నెఱింగి
కొలిపింపఁగలరేని కొలుతు మనిన
నాలాగె నడిపింప నచ్చుటఁ గొలువుండి
స్వామికార్యమనిన విశ్వాసమొప్పు

... ... ...

శ్రీరామమాడను జేర్చిన పదకంబుఁ
బెదరామబాణ మస్వేరికత్తి
దివ్యాంబరంబులు దివ్యభూషణములు
జవనహయంబులు సమదకరులు

పట్టాధికారి యైనట్టిపుత్రునిచేత
బహుమతిగా నిచ్చి పంపఁదీసి
యారీతిఁ గొన్నినాళ్లచట వాసము చేసి
వైష్ణవ స్వీకార వార్తఁ జేసి
యతని కొల్వును ద్రోసి యవల పాళెముదీసి
తనసీమ దొరతనంబున నె చేయఁ

తంజాపురప్రభువగు విజయరాఘవుని వీరవైష్ణవమతాసక్తియుఁ బరమతాసహిష్ణుతయు నిట్టిశూరవరుని ప్రాపుఁగోల్పోవుటకుఁ గారణమయ్యెను. పిమ్మట నారఘునాథరాయలు పెద్దసేతుపతి యొద్దను, నటుతరువాత మధురప్రభువగు ముద్దువీరనరపతియొద్దను, నాతని తనయుఁడగు చొక్కనాయకునియొద్దను దండనాయకుఁడుగ నుండి వారలకు గొప్పసాహాయ్య మొనర్చియుండెను కృతిభర్తృపితామహుఁడైన తిరుమలప్రభువు ప్రతాపవంతుఁడై రాజ్యమేలినవాఁడు. కృతిపతితండ్రియైన విజయరఘునాథరాయలు ఛందఖానుని జయించినట్లును తుక్కోజీపత్తేసింగులతో స్నేహమును గడించి, మధురప్రభువులతో మైత్రికలిగియున్నట్లును తొండమాను వంశావళిలో చెప్పఁబడియున్నది. మహాశూరులగు వారికీర్తిగానమును చేసిన వెంకనార్యుని వాక్యముల నిటనుదాహరింపవలయునని యెంత యుత్సాహమున్నను, గ్రంథవిస్తరభీతి లేఖనిని ముందునకు సాగనిచ్చినది కాదు.

మనకవి క్రీ.శ. 1767–1789 వఱకును పుదుకోట సంస్థానమును బాలించినవాఁడు. పరస్పరజయకాంక్షతో రాజులు యుద్ధము చేయుచుండుటచే దేశమల్లకల్లోలముగనున్న యాకాలమునఁ దమ

దేశరత్నములోఁ గాలముగడపుచు నిట్టి గ్రంథరచన మొనర్చియు; కవులను బ్రోత్సహించుచు గృతి పతియయ్యు నాంధ్రభాషకు వే విధంబుల సేవచేసిన యీకవిభూపాలుఁడు ప్రశంసనీయుఁడు. ఇతఁడు పార్వతీపరిణయమను నాలాశ్వాసముల ప్రబంధమును రచించి గోకర్ణమండలి గోకర్ణేశ్వరున కంకితము చేసెను.

ఈతని కవిత్వమునుగూర్చి నాయభిప్రాయమును దెలుపుట కంటెఁ బార్వతీపరిణయగ్రంథప్రకాశకులును సరస్వతీపత్రికాధిపతులు నగు శ్రీకొచ్చర్లకోట రామచంద్రవెంకట కృష్ణరాయభూపాలుఁడే తద్గ్రంథపీఠికలో వ్రాసినవాక్యముల నుదాహరించుట మంచిదని యట్లు చేయుచున్నాఁడను.

"ఈకవి యుద్దండకవియని బిరుదువహించిన నుదురుపాటి సీతారామార్యుని శిష్యుఁడు "ఉద్దండకవివిధేయ" యని యితఁడు చెప్పుకొనుటవలనను, వెంకన్న యుద్దండకవి కుమారుఁడగుటను వెంకన్నయు నీరాజును సమవయస్కులు సహాధ్యాయులు ననితోఁచుచున్నది. అల్లసాని పెద్దన మనుచరిత్రములోని తనవంశవర్ణనపద్యములను తనయాముక్తమాల్యదలో వేసికొనినట్లే రాజకవియు వెంకన్న చెప్పిన యాంధ్రభాషార్ణవములోని వంశావళిపద్యముల నింపు వేసికొనినాఁడు. ... వేంకనార్యుఁడు ఆంధ్రభాషార్ణవగద్యలో రాజునకు వేసినవిశేషణములే రాజు పార్వతీపరిణయగద్యలో దానుపయోగించుకొన్నాఁడు. ఈప్రబంధములో సంస్కృతపదములందెచ్చుటను స్ఖాలిత్యము కనఁబడలేదు. తెలుఁగుపదములలో "ప్రథమకబళే మక్షికాపాతః" అనినట్లు "శ్రీమత్పర్వత రాజకన్యను వరించే వేళ" అనియున్నది. ఇట్టి దుష్ప్రయోగము లిందుఁ జాలకలవు. దీని

వలన నీకవికి సంస్కృతభాషయే గాని యఱవదేశస్థుఁడగుటచేఁ దెనుఁగు బాగుగ రానట్లును దోఁచుచున్నది ఈపార్వతీపరిణయము నకు నాముక్తమాల్యదకువలెనే యొక యపఖ్యాతికలదు. అది నిజమైయె యాంధ్రభాషార్ణవమను నిఘంటువును వ్రాసిన వేంకనా ర్యుఁడే దీనిని రచించినచోఁ దెనుఁగున నిట్టి దోషములుండఁ గూడదు వేంకన చేసిన ప్రబంధమే దేని మఱియొకటి దొరకి యందుఁగూడ నిట్టిదోషములు కనఁబడిన నీపార్వతీప ణయమును వేంకనార్యుఁడే రచించెనని చెప్పవచ్చును గాని యాంధ్రభాషార్ణవములోని కొన్ని పద్యములచే నద్దాని నిర్ణయింప వీలులేదు. ...

ఏదియెట్లయినను గ్రంథము మాత్రము లోకోత్తరములగు వర్ణనలతో నిండియున్నది. ఆలంకారికులు చెప్పిన ద్రాక్షేక్షుకదళీ నారికేళాదిపాకము లీరుచికిసమానమని చెప్పవలనులేదు. శయ్య యద్భుతమైనది. అనేకాంధ్రగంథములు పుట్టినపిమ్మటఁగూడ నిట్టి క్రొత్తకల్పనలం జేర్చినవాఁడీతఁడొక్కఁడే కొన్నితావులను మహాకవి కాళిదాసుని కుమారసంభవములోని శ్లోకములననుసరించెను. ఇతనికిఁ దెలిసినంతయౌచిత్య మితరులకుఁ దెలియదనుట సాహసము కాదు"

ఈ కవి కవిత్వశైలి తెలియుటకై పార్వతీపరిణయమునుండి కొన్ని పద్యముల నుదాహరించుచున్నాఁడను

మ. తలిరుంబ్రాయపు నాలుగంట్లు తమచెంతన్నిల్వ వక్రాండకో
యులు మిన్నాకను మీను వేఁటలకు డాయన్వాలు నేత్రించు లా
సలిలంబందునఁ దోఁప వాలుగలుగా శంకించి గల్లంచుఁ బూ
సలు ప్రోయాయ స్వాలసైచి యాడ్చియుఁ దదాశ న్వోదుతంత
ర్గతిన్ ౧౮

శా. అంగజ్ఞాన పరీక్షకై చరణనాసాస్యాదు లేదేదియుం
చూం గందోయి క్రమంబుగా నడుగుచో సూర్యేందులం
జూప యు
త్సంగాలంకృతయైన యాశిశువు యాథార్థ్యోక్తి కాదంచు దాఁ
గెం గేల్దట్టుక నవ్వ మేనక తదర్థజ్ఞాజ్ఞయై ప్రౌఢిమన్ 2 ఆ

ఉ. పూగము నాగవల్లికను బొంది సుఖంచుచు నుండ మల్లెలేఁ
దీఁగె యొకింత యేని యటు దృష్టినిఁ బెట్టక దాలనున్న పు
న్నాగముఁ జేరె నౌను సరి నవ్య సుఖోన్నతిఁ జెందు దానికి
న్వాగను శాసి యాసవతి వ్రాలును వ్రాయఁడుగా యొకప్పు
డున్ 3 ఆ

చ. కడపటిబిడ్డయంచు ననుగారవమొప్పఁగఁ బెంచి చంక నె
ంగాడుకొని లేనివస్తువులనిమ్మని పోరినఁ దెచ్చి యిచ్చు నే
నడుగుల నేలఁ బెట్టుకొన వా యవి పాక్షనటన్న తల్లికిన్
గడను ఋణంబు దీర్చుకొనఁగా నయితిం జెలులార యేనిఁకన్

మ. గురువర్యోదిత మంత్రపూర్వకముగా క్షోణీధరేంద్రుండుకూఁ
తుకు కెంగేలున మేనకాకయథవద్యోవాహినీతోయ శీ
కరయుక్తిన్ బరమేశు చేతనిడఁ దత్కాయాత్త రోమాంచతన్
స్థిరమైనోఁ చెడిమారు వస్యపరివర్ధ్యయాన్యవాచ్యంబుగన్

సీ. తానుగన్నులు మూసి నేనందుఁ దెల్పుమం
చవలఁబోసీక కొంగంటఁ బట్టి
పలికినఁ గొంతులోఁ జిలుక యున్నది దాని
బట్టి యిమ్మనుచుఁ గేల్వట్టితిగిచి

అమ్మయేమే యేల యదరదవఁ గను
జీమను జూచి బూచి యనిపల్కి
గణపతిపొట్టనుగాంచి భక్షణ మెల్ల
నన్నకా యిచ్చితివనుచుఁ గోరి

యాడవెలిఁబోయి తాళ్లుకాళ్లంటి పడినఁ
జన్నతాతలుద్రొచ్చిరే నన్ను వారి
గొట్టవలె నంచుఁ బిలిచి పక్కవ నగించి
తల్లి కానంద మొదలించె నల్లగుహుఁడు.

ఈ కవి భూపాలుఁడు తనయాస్థానకవియగు వెంకనార్యుని కఠినసమస్యలనడిగి వానిని తాను పూరించుచుండు వాఁడఁట. తాను పూరించిన సమస్యాపదములను వినినవారందరు కృతికర్హ మనుటచే రఘునాథరాయులు కవిజనోజ్జీవని యను పేరిట గావ్యముగా తన యిష్టదైవతమగు బృహదంబకంకిత మొసంగెనని కవియే యీక్రింది పద్యములలో చెప్పియున్నాఁడు

గీ. వెంకనకవీంద్రుఁడుద్దండ బిరుదశాలి
మమ్ముగొలిచియు కఠినసమస్యలొసఁగ
నొప్పకొని యేము పద్యముల్ సెప్పినంత
నందరునివిని కృతికివి యర్హమనిన

గీ. కవిజనోజ్జీవని యటంచు గావ్యమొకటి
దుర్ఘటసమస్యలకునెల్లఁ ద్రోవదెలియ
కవిజనంబులకును నుపకారముగఁ
జేతు దయచేత బృహదంబ చిత్తగింపు

ఈరఘునాథరాయభూపాలుఁడును తండ్రితాతలవలె మిగుల పరాక్రమవంతుఁడైనట్లీక్రింది తురంగపంచకమువలనఁ దెలియు చున్నది. ఈపంచకమును రచియించినవారెవ్వరో తెలియదు. ఈతని యాస్థానకవియగు వెంకనార్యుఁడేమో !

సీ. ఆస్కందితాశు ప్రహసితాశుగోద్వృత్త
రంగమంబగు నీతురంగమంబు
ధౌరితికత్వరోద్ధతి ధుతస్థావర
జంగమంబగు నీతురంగమంబు
రేచితోద్వేగగాధరీకృత హరిభృద్వి
హంగమంబగు నీతురంగమంబు
వల్గితస్యదవినిర్భగ్న ఫణాద్యభు
జంగమంబగు నీతురంగమంబు

గీ. ప్లుతజవవినిర్జితసురాశ్వ వితతగమన
చంగమంబగునీదు తురంగమంబు
కవితగుణపేటి కవికోటి కల్పవాటి
రాయరఘునాథ పంచణప్రభుకిరీటి !

సీ. పుటములు ద్రొక్కు నాకుటిలారి రాజన్య
కోట కోటీరముల్ కుదియఁబడును
జోడనల్ చూపినా శూరవీరకఠోర
గంధాంధసింధురఘటలు చదియు
చౌదాఁట్లుదాటినా సామంతభూపాల
జవనకంఖాణముల్ స్రగ్గిమొగ్గు

వేడిముల్ తిరిగెనా విమతులపురములు
గాలిచక్రమ్ముల కరణిఁ దిరుగు

గీ. బళిరరవగాలు ఘటియింప భండనమున
వెడఁద యుతములు బతులును విఱిగివిఱిగి
దొరఁగు రిపుకోటి నీదెరా బిరుదుకోటి
రాయరఘునాథపంచణ ప్రభుకిరీటి

సీ. కదలిక చూపెనా కక్కసంపదు నేల
గుండెలుకలఁగు గర్గలుగాను
దులదులనడచెనా దుర్దాంతసామంత
బలములగముల గర్భములుగలఁగు
పరువులువాతెనా పరిపంథి నరపాల
చిత్తముల్ మొత్తనై తత్తరించు
కరికరి నదిరెనా గర్వితారాతిరాట్
ప్రాణంబులటునిటు పఱచి వెఱచు

గీ. దూటిరణమున హాదలికల్ మీఱఁగాను
ఖురపుటోద్ధతులదరంగఁ గొట్టిమెట్టఁ
దొరఁగె రిపుకోటి నీదెరా బిరుదుకోటి
రాయరఘునాథ పంచణప్రభుకిరీటి

సీ సమరాన క్షాత్రవసమితి శిరోజముల్
గసఱ సఘాసమ్ముకరణి నమలి
కథనాన విమతుల కండలు గుండెలు
ఝుళిఝుళికబళమ్ము సరణి మెసఁగి

ప్రధనానమార్తుల ప్రక్కలు డొక్కలు
కరకరఖాణంబు వరుసకొక్కి
బవరానఁ బరరాజవరుల రక్తంబులు
గళగళజలములగతిని గ్రోలి

గీ. మొట్టిమర్దించి చుట్టుక మెదలనీక
గొట్టి గోరింప రణమున గుండెలవిసి
తొఁగెరిపుకోటి నీదెరా బిరుదుకోటి
రాయరఘునాథ పంచనప్రభుకిరీటి

సీ. గర్వాంధ పరిపంథి గంధసింధురముల
కొమ్ముకత్తుల మొనల్ కొట్టికొట్టి
చెవఁటిదు నేదార్ల శిరములగొగ్గేల
గొలుసులుఫీడంగఁ గూల్చికూల్చి
మార్ఖారివీరులా ముసలిమానుల మోము
ముక్కుదూలములూడ మోఁదిమోఁది
ఘోరవజీమోటు జీరాలయుగరాల్
చెదరిర్ఘుల్లన రాలఁజెండిచెండి

గీ. చలితూఱుచు ఖురములఁ జించి చించి
పేరములువార బారువ పెంటలగుచుఁ
దొరఁగెరిపుకోటి నీదెరాబిరుదుకోటి
రాయరఘునాథ పంచనప్రభుకిరీటి.



## 357 దర్భా కవిగిరి అనే వెంకటగిరికవి.

(విచిత్ర రాయావతంస బిరుదాంకితుఁడు)

ఈకవి నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; లోహిత గోత్రుఁడు; ఔబళన్న జానకమ్మలకుఁ బుత్త్రుఁడు; గోపాల మంత్రి చెంగమాంబికలకుఁ బౌత్రుఁడు; గోపన్న గిరిరాజకవి వెంగ నార్యులీతని కగ్రజులు.

ఇతఁడు రుక్మాంగదచరిత్రమును మూఁడాశ్వాసములపద్య కావ్యముగా రచియించి ఖండోజిరాయప్రభువు ప్రేరణమున శ్రీమహా విష్ణువ కంకితము చేసెను. రుక్మాంగద చరిత్రకథ సుప్రసిద్ధమగు టచే నిట వ్రాయలేదు ఇతఁడు తనను గూర్చి యీక్రింది ద్విపదల లోఁ జెప్పుకొని యున్నాఁడు.

"అస్మత్కుల క్రమం బదియెట్టులనిన
నిర్భరలోక వర్ణిత దయాశాలి
దర్భవంశాంభోధి తారాకిబుండు
సుగుణుఁ డాపస్తంబ సూత్రోఁ డుత్తముఁడు
నిగమాంత సుజ్ఞాన నిరత మానసుఁడు.
లోహిత గోత్రుఁడు లోల వర్తనుఁడు.
గోహీర సమకీర్తి గోపాల మంత్రి
మంగళ దేవతా మహిమ దీపించు
చెంగమాంబిక యందు శ్రీమించగాంచె
సర్వంసహా సమక్షమ గలవాని

విదిత శాస్త్రపురాణ విదు నౌభళన్న
నామహామహునకు ననఘ శీలునకు
భామాశిరోమణి పుస్తూయమాన.
జానకాంబకు నిత్య సంతోస మొదవ
సుతులుద్భవించిరి సుజనత మెఱయ
అతులితగుణశాలి యందగ్రజుండు
సలలితకీర్తి యజాతశత్రుండు
కులదీపనుండైన గోపనాహ్వయుఁడు
మార్తాండకుల శాహమహీపాలుసభను
కీర్తి కెక్కినవాడు గిరిరాజసుకవి
సంగీతకళరహస్యము గన్నవాఁడు
వెంగనార్యుండు వివేకధనుఁడు
ముప్వురిప్రేమకు మూలమై వేడ్క
నివ్వటిల్లంగ నన్నిక కెక్కువాఁడ
కమలాంబికాలబ్ధ కవితావితాన
కవిగిరి యను పేరు కలిగినవాఁడ
నవని నాచంద్రతారార్కమై వెలయ
నేనొర్పుఁగ బూను నీకథాసంవి
ధాన మెట్లన్న నంతయు విన్నవింతు

గద్య:- అని లోకవినుత దర్భాన్వయజలధి
జనితుఁ డౌభళమంత్రి జానకాంబికయు
క్రమమున మన్నింప కడకదీవింప
కమలాంబికాదేవి కరుణపోషింప
పంకజాక్షుని పాదభక్తియుక్తుండు

వెంకటగిరికవి విష్ణుసిపేర
శ్రీసతీపతిజిష్ణుని వేర...

ప్రేరకుఁడైన ఖండోజీరాయనిఁ గూర్చిన ద్విపదలివి:-

శ్రీరాజగోపాల సేవాధురీణుఁ
డారూఢ హాంహారాగనీహార
... ... ...
ఆయత హాళి వంశాబ్జ విచిత్ర
రాయపుత్త్రుఁడు శత్రురాజభీకరుఁడు
... ... ...
నయిన ఖండోజిరా యా ఖండలుండు
దయదలిర్పఁగ వేడ్క తానొక్క నాఁడు
... ... ...
సదయరుక్మాంగద క్ష్మాపాలచరిత
మది బుధానందనం బది పుణ్యహార
విస్మయంబు ఘటింప విరచింతు వేడ్క

కృతిప్రేరకుఁడైన యీఖండోజీరాయలునుగూర్చిన విశేషము లేమియుఁ దెలియలేదు. ఈఖండోజీరాయలకే విచిత్రరాయావతంసకవి అభినయదర్పణమను పద్యకావ్యమును గృతియొసంగియున్నాఁడు ఆతఁడు గిరిరాజకవికి తమ్ముఁడనని యాగ్రంథమున వ్రాసికొనియున్నాఁడు. గిరిరాజకవి యీకవిగిరికి సోదరుఁడే యయినట్లు పైద్విపదలలోఁ జెప్పబడియున్నది. ఖండోజీరాయలప్రేరణముపై విష్ణున కంకితమైన రుక్మాంగదచరిత్రకర్త యగు యీ కవిగిరి

లేక వెంకటగిరికవియు, ఖండోజీరాయల కంకితమైన అభినయదర్పణకృతికర్తయగు విచిత్రరాయావతంసుఁడును, భిన్నవ్యక్తులా లేక ఏకవ్యక్తియా యని సందేహముకలుగుచున్నది. భిన్నులైనచో అభినయదర్పణకృతికర్తయగు విచిత్రరాయావతంసుఁడు యీగిరి కవిని గూర్చి యభినయదర్పణమున నేల చెప్పలేదో తెలియకున్నది. విచిత్రరాయావతంసునిగూర్చి యీగిరికవియుకూడ చెప్పలేదు.

పైన చెప్పినద్విపదలలో నీకవికి వెంగనార్యుఁడను సంగీతకళారహస్య విదుఁడొక సోదరుఁడున్నాఁడని చెప్పియున్నాఁడు ఈవెంగయార్యునకు విచిత్రరాయావతంసుఁడని నామాంతరమో బిరుదునామమోయుండి యుండును. అతఁడు రచించిన దభినయశాస్త్రమగుటచే నీయూహ సరియైనదిగనే తోచును.

అయినను అభినయదర్పణకావ్యకర్తయగు విచిత్రరాయావతంసుఁడును, ఈ వేంకటగిరియు నొకేవ్యక్తియని యూహపొడము చున్నది. ఖండోజీరాయని ప్రేరణమున వెంకటగిరి విరచితమైన తెనాలిరామకృష్ణుని ఘటికాచలమాహాత్మ్యమందలి కృత్యాదిని పరికించిన నీవిషయము స్పష్టమగును.

మ. పద సందర్భవిశుద్ధి ప్రౌఢతరశబ్దప్రక్రియాబుద్ధి సా
రద గంభీర చతుర్విధ ప్రథిత ధారాసిద్ధి ప్రాపంచి సం
సదభిద్య ద్గిరిరాజసోదరత మెచ్చన్ మించు "పుంభావశా
రద వవేగద వన్న వేంకటగిరీంద్రా" సాంద్ర మేధానిధీ !

క. విదిత ప్రబంధములు వే
డ్కఁదనరఁగ మదంకితముగఁ గావించి ననున్

మొదల బవిత్రము చేసితి
సదయాత్మా విచిత్రరాయ చంద్రవతంసా
చూడుము ఆంధ్రకవితరంగిణి 8 సం. పే 11-12

కృత్యాదియందలి మొదటిపద్యము వేంకటగిరిని సంబోధించుచు వ్రాయబడినది. తరువాయిపద్యమునందు విచిత్రరాయచంద్రవతంసా యనిసంబోధనము గలదు ఇది వెంకటగిరికి బిరుదనామమై యుండునని తలంపవలసియున్నది.

అభినయదర్పణకావ్యమున కృతిపతి తనను బిలిపించి చెప్పిన మాటలను కవి యీక్రింది గద్యపద్యములలోఁ దెలిపియున్నాఁడు.

ఉ. ఓజదలిర్ప ప్రేమమున నోలగముండి హితాళితోడ ఖం
డోజివిచిత్రరాయఁడు మనోధృతి నన్నటు పిల్వఁబంచి భా
మాజనమానచోర మధుమాస రసాల మరంద సాంద్ర ధా
రాజయ చుంచు వాక్యముల రమ్మని బల్కుచు కూర్మిగుల్కుచున్.

వ. తనయర్ధాసనంబున నుండనియమించి అంతరంగంబున దయారస తరంగబులు పొంగిపొరలు తెఱంగుగ ముఖపుండరీకంబు కొండింప నను నిజనామాంకితుం జూచి యిట్లను "అభినయదర్పణం"బను మహాగ్రంథంబు తెనుఁగున నొఱుంగిడి మదీయ కీర్తి ముఖాలంకారంబు సేయు మన్న వల్లెయని యేను దదారంభ ముదావహమానసుండనై యిట్లంటి.

గ్రంథాంతగద్య:- "ఇది శ్రీకమలాంబికా విమల కృపాలబ్ధ సాహిత్య కళావతంస లోహితగోత్ర హేబశార్యపుత్ర దర్భకులపావన

గిరిరాజకవివరానుజ విచిత్రరాయావతంస ప్రణీతంబయిన అభినయదర్పణాంబను మహాగ్రంథంబు"

అభినయదర్పణమున కృతిభర్తనుద్దేశించి చెప్పిన పద్యమిట నుదహరించుచున్నాను.

సీ. కౌశికగోత్ర రాకాచంద్రుఁడై మించి
  పరిబలఖండేరాయ భక్తి కలిగి
పొంగుచు కృష్ణాజి గంగాజి యనఁగాంచె
  గురుజాయి నాథుని నరసవిభుని
అతనికిఁబుత్రుఁడై యలరు విచిత్రరా
  యతమాసర్వమి భాగాంబయందు
నగవైరిశచియందు నలజయంతునిబోలె
  రమయందు హరి రతీరమణుబోలె

తే. నినుఁగాంచె నలసమాన నిరుపమాన
దానధారా... శాంభోనిధీంద్ర
శ్రీయకార్తేయ మండితధీర జేయ
రాజితసుకీర్తిగేయ ఖండోజిరాయ!

అభినయదర్పణము ఖండోజివిచిత్రరాయుని కంకితమీయ బడినది. వెంకటగిరికృతమైన రుక్మాంగద చరిత్రము విచిత్ర రాయునిపుత్రుఁడైన ఖండోజీప్రేరణమున విష్ణున కంకితమొనర్ప బడినది. ఈకావ్యద్వయమునందు పేర్కొనబడిన వ్యక్తియొక్కఁడే. కవి. అభినయదర్పణమును పద్యకావ్యముగ రచించిఖండోజీవిచిత్ర రాయుని కంకితమొనర్చెను.

అతఁడే అభినయదర్పణమున ఖండోజీవిచిత్రరాయఁడనియు రుక్మాంగదచరిత్రమున విచిత్రరాయుని పుత్రుఁడగు ఖండోజీయనియు పేర్కొనబడినాఁడు. మొదటిదానియందు తండ్రిపేరుతోఁగలిపి పేర్కొనియెనని తలంపవలసియున్నది.

భట్టుమూర్తికి రామరాయభూషణుఁడని బిరుదునామముండినట్లే ఖండోజీవిచిత్రరాయుని ఆస్థానకవియగు నీవేంకటగిరికవికి గూడ విచిత్రరాయవతంస యనుబిరుదనామ ముండియుండును. ఈబిరుదమునే అభినయదర్పణమునందు వాడియుండును.

ఈ రెండుగ్రంథములయందలి గద్యలను బరిశీలించిన వాటి శైలిని బట్టియు ఏతద్గ్రంథరచయిత లొక్కరేయని గోచరించును. రెండుగ్రంథములయందును కవి తనయిష్టదైవమగు కమలాంబికాదేవిని నుతించియున్నాఁడు.

వెంకటగిరి రుక్మాంగదచరిత్రయందు తననుగూర్చి చెప్పుకొనునవసరమున 'కవిగిరియనుపేరుగలిగినవాఁడ' అని యుదాహరించియున్నాఁడు. కవిగిరియనునదీతనికి కవిత జెప్పనేర్చిన తరువాత వచ్చినపేరై యుండును. అందుచేతనే యాతఁడు తనతలిదండ్రులు నామకరణ మొనర్చినట్లుగ వెంకటగిరి యని తద్గ్రంథాంత గద్యయందు నుడివియున్నాఁడు. ఇతఁడువిచిత్రరాయలురొుద్దను తరువాతి నతని కుమారుఁడైన ఖండోజీయొద్ద నాస్థానకవిగ నుండియుండును. ఈ ఖండోజీరాయనిప్రేరణముననె కవిగిరి రుక్మాంగదచరిత్ర రచియించి విష్ణునకంకితమొనర్చిన తరువాత నీతనికి విచిత్రరాయావతంసుఁడని బిరుదనామము వచ్చియుండును ఆబిరుదనామముతోఁడనే యీగిరి

రుక్మాంగదచరిత్రయందు కవిగిరి తనయగ్రజులైన గోపన గిరిరాజు వెంగనలను నుతియించియున్నాడు. ఆతనికి మరియొక సోదరుఁడున్నచో నతనిని గూడ చెప్పియుండును. అభినయదర్పణమున గిరిరాజకవివరానుజు డనని చెప్పుకొనెను. ఘుటికాచల మాహాత్మ్యకృత్యాదిరచనాసందర్భమున గూడ 'గిరిరాజసోదరత హెచ్చున్' యని చెప్పి యున్నాడు. ఈతని సోదరులలో గోపన సలలితకీర్తిశాలి అజాతశత్రుఁడు కులదీపనుఁడు; గిరిరాజు సుకవి, శాహామహీపాలుసభను గీర్తికెక్కినవాఁడు; వెంకనార్యుఁడు వివేకధనుడు, సంగీతకౌశలభాస్యముగన్నవాడు. వెంగనను కవియని పేర్కొనలేదు. కవియైనచో నతని తప్పక గవియని చెప్పియుండును.

అభినయదర్పణకృతిభర్త విచిత్రరాయకుమారుడైన ఖండోజి. దక్షిణదేశమున తండ్రిపేరును జేర్చికుమారుల నామములజెప్పుట యాచారము కలదు ఆపక్షమున విచిత్రరాయఖండోజియని చెప్పవలయును. అయితే 'ఖండోజివిచిత్రరాయ' అని చెప్పియున్నాడు. దీనినిబట్టివిచిత్రరాయని తండ్రిఖండోజియనియు 'ననునిజనామాంకితు' అని కవి చెప్పుటచేతను విచిత్రరాయలే యేతత్కృతిభర్త యని చెప్పవలయును. పైసీసపద్యములో ఖండోజీయే కృతిభర్తయని చెప్పుటచేతను, విచిత్రరాయలుతండ్రి నరసవిభుడని చెప్పుటచేతను ఖండోజి విచిత్రరాయ యనినను విచిత్రరాయఖండోజీయనినను కృతిభర్తయనియు నతనితండ్రి నామముతో జేర్చి కృతికర్తయని చెప్పియున్నాడనియు గ్రహింపవలయును. విచిత్రరాయుని కుమారుడును, కృతిభర్తయు అయిన ఖండోజికి 'ఖండోజివిచిత్రరాయ' అనిపేరు వచ్చినట్లే విచిత్రరాయుని యాస్థానకవియు కృతికర్తయు నగుకవిగిరికి

విచిత్రరాయావతంస' యనుబిరుదనామమువచ్చెను. ఈవిధముగా కృతిభర్త కృతికర్తలకు నామసామ్యము కలుగుటచేతనే 'ననునిజ నామాంకితు' అనివాక్రుచ్చియుండును. కావున గిరికవియనినను విచిత్రరాయావతంసుడనినను, గిరిరాజకవివరానుజుడయిన వెంకటగిరియేయగును.

ఈకవి కగ్రజుండైన గిరిరాజకవి తంజావూరు రాజ్యమును క్రీ శ ౧౬౮౪ మొదలు ౧౭౧౨ వఱకును బరిపాలించిన మహారాష్ట్ర ప్రభువగు శాహాజీమహారాజు నాస్థానమునందుండి యనేక యక్షగానములను రచియించినవాఁడు కావున నీకవియు నాకాలము నందుండినవాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. కృతిపతి యైన ఖండోజీరాయని గురించి ఇంతవఱకు నాకేమియు దెలియరాలేదు. శ్రీభావరాజు వెంకటకృష్ణారావుపంతులుగారు వ్యయసంవత్సరాది సంచికలో వ్రాసియున్నారు. అతడీతడేమోయని యనుకొంటిని కాని యాతఁడీతఁడు కాఁడు. శిలాశాసనకర్త ఆత్రేయసగోత్రుఁడు. ఇతఁడు కౌశికగోత్రుఁడు. ఖండోజిరాయని తండ్రి విచిత్రరాయలు, తల్లి భాగాంబ—పితామహుఁడు గంగాజయను నరసవిభుఁడు, పితామహి గురుజాయి—ప్రపితామహుఁడు కృష్ణాజి.



తంజావూరునందలి సరస్వతీపుస్తకభాండాగారమున అభినయదర్పణముయొక్క యసమగ్రమైన ప్రతియొకటి యున్నది. అందు రెండుబింబములు పూర్తిగను మూడవబింబమున గొంతవఱకును గలవు. గ్రంథమెన్నిబింబములు గలదో తెలియదు. అభినయశాస్త్ర విషయము లిందు దెలిపి యున్నాఁడు. యీ కవివతంసుని యిష్టదేవమయిన శ్రీకమలాంబికాదేవి యేగ్రామముననో నెలకొనియున్న యొక దేవత నామమని యూహింపదగియున్నది. ఆగ్రామమేదియో తెలిసికొనవలసి యున్నది.



## 358 ముద్దుపళని

ఈమె వేశ్యాంగన; తండ్రి ముత్యాలు; తల్లి పోటి; ఈ పళని తంజావూరును బరిపాలించిన మహారాష్ట్రరాజగు ప్రతాపసింహుని యుంపుడుకత్తె; తిరుమలతాతాచార్యుని వంశములోని వాఁడగు వీరరాఘవదేశికుఁడీమెకు గురువు.

ఈమె రాధికాసాంత్వనమను నాల్గాశ్వాసముల శృంగార ప్రబంధమును రచియించి ముద్దుకృష్ణున కంకితము చేసెను. ఈ వధూమణి తనకాశ్రయుఁడగు ప్రతాపసింహమహారాజు నిక్రింది రెండు పద్యములలో వర్ణించినది ఇతఁడు తంజావూరు రాష్ట్రపాలకులగు మహారాష్ట్రరాజుల వంశములోని వాఁడు.

సీ. ఏరాజు కువలయంబెల్ల రంజిలఁ జేసి
 జైవాతృకాఖ్య నిచ్చలుఁ దలిర్చు
నేలోకబాంధవుం డిలఁ దమంబు లడంచ
 చక్రప్రమోదంబు సంఘటించు
నేఘనుండు శరంబు లేవేళఁ గురియించి
 పరవాహినుల నెల్ల భంగపఱచు
నేయాశుఁ డార్యావ నాయత్తమతిఁ గాంచి
 కీర్తింప సర్వజ్ఞ మూర్తి యౌను

తే. వాఁడు నృపమాత్రుఁడే రఘూద్వహ దయాప్ర
వాహ వర్ధిత భోసలాన్వయ పయోధి

సోమ తోళజేంద్ర వరతనూజుండు శ్రీప్ర
తాపసింహక్షమాపాల తల్లజుండు

సీ. తనయార్యనుత మహౌదార్య విస్ఫురణంబు
శేఖద్రుఁబండ్లిగిలింపఁ జేయఁ
దనరామభక్తి ప్రధానమానసశుద్ధి
నారదు వెలవెలఁ బాఱఁజేయఁ
దనసర్వవిద్యావధాన మేధాస్ఫూర్తి
పన్నగేంద్రుని తలల్ వంపఁ జెయఁ
దనయధైర్య గంభీరతా నారతఖ్యాతి
యంబోధి భంగపాటందఁ జేయు

తే.గీ. నమర శీతాద్రిసేతు మధ్యావనీ త
లాంతర నిరంతర యశో విలాస భాస
మాన భోసల తోళజ రాణ్మణిసుతప్ర
తాపసింహేంద్ర మౌళి ప్రతాపహేళి

గ్రంథాంతగద్యలోఁగూడ నీమె ప్రతాపసింహునిచే బహుమతుల నందినట్లీక్రిందివిధమునఁ జెప్పుకొని యున్నది.

"గద్య:- ఇది శ్రీచిన్నికృష్ణ కరుణాకటాక్షవీక్షణ క్షణ ప్రవర్ధమానానూన శృంగార రసప్రధాన సంగీత సాహిత్య భరతశాస్త్రాదివిద్యాపారంగత శ్రీమత్తిరుమల తాతయాచార్య పాదారవింద మిళిందాయమాన మానస చోళసింహాసనాధ్యక్ష ప్రతాపసింహ మహారాజ బహూకృతానేక చామీకరాంబరాభరణ ముక్తాలు గర్భ శుక్తి ముక్తాయమాన ముద్దుపళని ప్రణీతంబైన రాధికాసాంత్వనంబను శృంగార ప్రబంధంబు"

గద్యయందలి "ముత్యాలు గర్భ శుక్తిముక్తాయమాన" యనుమాటలను బట్టి బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారీకవితల్లిని ముత్యాలుగా భావించి యాంధ్ర కవులచారిత్రమున "దీనితల్లి పేరు" ముత్యాలు అని వ్రాసియున్నారు. సామాన్యముగా కవులు తల్లి గర్భమును శుక్తితోఁ బోల్చుచుందురు. అందుచే వార ట్లనుకొని యుందురు. కాని యీ క్రిందిపద్యమువలన ముత్యాలు తండ్రియనియు 'పోటి' తల్లియనియు స్పష్టమగుచున్నది.

సీ. సాహిత్య విద్యా విశారద శారద
 యై ముద్దుపళని నా నమరు నిన్ను
గురుతరంబై తగుగుణగణప్రౌఢి వే
 లాయుతుండైన వేలాయుధాఖ్య
భరత భావాభావ భావజగురుఁడు నా
 గొమరుఁ జెందెడు ముద్దుకొమరు వరుని
రూపవిభ్రమకళా రూఢి నెంతయు రతీ
 దేవియౌ ముద్దులక్ష్మీ వధూటి

తే.గీ. బుద్ధి నల్లారు ముద్దైన ముద్దయాధ్యుఁ
డీటులేనట్టి పద్మావతీ లలాముఁ
దెలివిమీఱు రామస్వామి నెలమిఁ గాంచె
మేటిముత్యాలు, పోటి వధూటి వలన

ఈ రాధికాసాంత్వనమును రచియించి తనకంకితమిమ్మని శ్రీకృష్ణుఁడు తనను గోరినట్లును, అందుపైని తాతయాచార్య వంశోద్భవుండైన వీరరాఘవు దేశికునొద్దకేఁగి స్వప్న వృత్తాంతమును

దెలుపఁగా తత్సన్నిధినున్న విద్వజ్జనంబులు తనవంశమును వర్ణించి తను నీగ్రంథరచనకుఁ బ్రోత్సహించరనియు నీకవయిత్రి యాక్రింది పద్యగద్యములలోఁ జెప్పుకొనినది:

తే. గీ. చిన్నికృష్ణుండ నేనాదు చిత్తమునకు
సమ్మతంబైన రాధికాసాంత్వనంబు
తగనొనర్పు మదీయాంకితముగ నీవు
లలితగుణపేటి శ్రీముద్దుపళనిబోటి

అని యానతిచ్చి యంతర్ధానుండగుటయు నేను నిదుర మేల్కాంచి యీ శుభస్వప్నం బెవ్వరితోడ విన్నవించెదనని యూహించి యుభయవేదాంత ప్రతిష్ఠాపనాచార్యుండును నిరుపమౌదార్య గాంభీర్య ధుర్యుండును బామండమండగరితండమహాఖండలుండును, బాలితభక్తమండలుండును దిరుమల తాతాచార్యవర్యకుల కలశ పారావార తారాధారుండును, మదీయ పూర్వజన్మతపఃఫలసారుండును, సుగుణాభిరాముండును, నగు వీరరాఘవదేశిక సార్వభౌముని సన్నిధానంబున కరిగి సాష్టాంగదండప్రణామంబు లర్పించి తత్కటాక్షంబునుం గాంచి యీ శుభస్వప్నంబువిన్నవించినఁ దత్సన్నిధానంబునంగల సకలకళావల్లభులగు విద్వజ్జనంబులు నన్నవలోకించి సాక్షాచ్ఛ్రీమన్నారాయణాపరావతారుండగు వీరరాఘవ ధీరు చరణారవిందంబు లాశ్రయించిన దానవగుటం జేసి; దేవదేవుండగు శ్రీకృష్ణదేవుండు సాక్షాత్కరించెదిన నీకు నధికశ్రేయః ప్రాప్తియగు "నదియునుంగాక" గ్రంథాంత గద్యలో తిరుమలతాతయాచార్యుని శిష్యురాలయినట్లు చెప్పియున్నది. పైవచనములో తిరుమల తాతాచార్యవంశములోనివాఁడైన వీరరాఘవదేశికుని

శిష్యురాలైనట్లు చెప్పినది. తాతాచార్యునకును వీరరాఘవదేశికునకు గల సంబంధమేమియుఁ జెప్పలేదు.

సీ. ఘటియింపనేర్తువు కవన జాతు లెఱింగి
పలుకుల కల్కి వ్రేల్వోలనఁబాఱ
నీయఁగా నేరుతు విలఁ గోరిన వరాలు
నగరాజు సుకుమారి సగముగాఁగ
చెల్లింపనేర్తువు చెప్పినరీతిగాఁ
గని ద్రౌపదిసతి కాన కేఁగ
నటియింపనేర్తువు నవరసంబుల నంటి
తగురంభ యనిమిషత్వము వహింప

తే. గీ. నీదె మఱియుక్తి పరికింప నీదె శక్తి
నీదె నెరపద్దు నరయఁగా నీదె ముద్దు
సరసముగఁ జేసి రాధికాసాంత్వనమ్ము
భక్తి హారికిమ్ము శ్రీముద్దుపళని బోటి

ఈ కులమునకుఁ జెందిన బెంగుళూరునాగరత్న మీరాధికా సాంత్వనమును ముద్రింపించి పీఠికలో 'పళని' యనునొక సుబ్రహ్మణ్యేశ్వర పుణ్యక్షేత్రము గలదనియు దక్షిణదేశమున పుణ్యక్షేత్రముల నామముల నుంచుకొను నాచారముండుటచే నాపుణ్యక్షేత్ర నామమే యీ గ్రంథకర్త్రి కుంచిరనియు, 'ముద్దు' అనునది యుపనామమనియు వ్రాసియున్నది. అదిసత్యమే కావచ్చును.

ఈ కవయిత్రి తనవంశము నిరువదిపద్యములలో వర్ణించినది అందిమె మేనత్తయగు తంజ నాయకిని "నాప్రేమను గొనికనిన"

ర్గామామణివధూటిని వర్ణించిన రెండుపద్యముల నీక్రింద నుదాహరించు చున్నాఁడను.

సీ. ఈవి చేతనె కాదు కీవి చేతను గూడ
        శశిరేఖ నెంతయుఁ జక్కడంచుఁ
చూపుచేతనె కాదు రూపు చేతను గూడ
        హరిణీవిలాసంబు నాఘళించు
గోరుచేతనె కాదు సౌరుచేతను కూడ
        దారా వినోదంబు నాఅడించుఁ
దళుకుచేతనె కాదు కులుకు చేతను గూడ
        హేమాతిశయమును హీనపెంచు

తే.గీ. నని కవుల్ మెచ్చఁ దనరె నొయ్యారమెచ్చ
నన్నిటను జాణ సకలవిద్యాప్రవీణ
మేటిమరుదంతి యింతులమేలుబంతి
హారి గుణముద్దు తంజనాయకి మిటారి

సీ. ఏ రామ కట్టించి యిడె నగ్రహారంబు
        పుడమి రామాంబాఖ్య పురమనంగ
నమర నేధన్య దివ్యాలయం బొనరించి
        తిరముగాఁగ శివప్రతిష్ఠఁ జేసె
నెంచి యేపుణ్య పెట్టించె నంకవవని
        కొఱలేని వితలెత్తి కొమరు మిగుల
నేమాన్య జీవనంబై సఁగఁ దటాకంబు
        ఘటియించె సేతు మార్గంబు నందు

తే. మేటి యవ్వాతె గండరకోటలోన
మఱియు నిత్యాన్న దానాది మహిమ లంది
పార్వతీశుల నిత్యోత్సవము లొనర్చి
నట్టి రామామణివధూటి నలవి పొగడ!

ఈ రాధికాసాంత్వనమును వీరరాఘవదేశికుఁడే రచియించె నని కొందఱందురు. గాని యది విశ్వాసార్హముగాఁ గన్పట్టదు. కాని యతఁడామె గ్రంథరచనమునఁ గొంత సాహాయ్యము చేసి యుండవచ్చును. తంజావూరు నాయకుల ప్రభువుల యాస్థానకవయిత్రులగు రంగాజమ్మ రామభద్రాంబ మొదలగు వారి యంతటి పాండిత్య మీమెకడ లేకపోయినను, శృంగారరసాధిదేవత నారాధించిన స్త్రీలలో నీమె యొక్కతె యని చెప్పవచ్చును. సంగీత సాహిత్యములయందీమె ప్రవీణురాలు. రాధికాసాంత్వనమున శృంగారవర్ణనము చాలపచ్చిగానున్నదనుటకు సందియము లేదు. కొన్ని తావుల స్త్రీనోటినుండి రాఁదగనంత పచ్చిగానున్నది. అందుచే నిది యువతీయువకులకుఁ బఠనయోగ్యముకాదని చెప్పఁదగియున్నది. కాని అట్లు చెప్పునెడల నీతరగతిలోఁ జేరిన కావ్యముల నేకములుండుటచే వానినన్నింటిని గూర్చికూడ నట్లే చెప్పవలసి వచ్చును. అట్టివానిని నిర్ణయించుట యసాధ్యకార్యము.

శ్రీకృష్ణుని మేనత్తయైన రాధ కుంభకుని తనయయగు "ఇళ" యను నొకకన్యను పెంచి పెద్దదానిని జేసి శ్రీకృష్ణునకిచ్చి పరిణయము చేయుటయు, శ్రీకృష్ణుఁ డిళతోఁ గలసియుండ రాధ
జెంది శ్రీకృష్ణునిపై యలుకఁగొనుటయు రాధావిరహార్తినొందిన శ్రీకృష్ణుఁడు రాధకడకు వచ్చి

సుముఖం జేయుటయు నీగ్రంథమందలి ప్రధానకథ. ఇందు మొదటి నుండి తుదవఱకును శృంగారరసము వెల్లువయై యుప్పొంగినది. రాధ పరకీయ యైనను వారి యనురాగము భక్తి ప్రాభవముచే పవిత్రతను దాల్చినది. కవయిత్రి యగుపళని యీగ్రంథమున భక్తి ప్రేమ శృంగారములను మేళవించి యాకాలమునందలి ప్రభువులకు సరసులకు, గురువులకు, పండితులకు, హృదయానంద దాయకమగు నట్టిగ్రంథమును రచించికృతకృత్యయైనది. ఎవరీ గ్రథమునందలి పవిత్రతను గుర్తించ లేరో, ఎవరీగ్రంథమునందలి మాధుర్యమును గ్రహింపఁ జాలరో, ఎవరిందలి బాహ్యచిహ్నములను మాత్రమే పరికించి గర్హనీయమని భావింతురో యట్టిదుర్మూఖలహృదయములీ గ్రంథమును విసర్జించిన విసర్జింతురు గాక !

ఈమె కవిత్వము సందచ్చటచ్చట స్వల్పలోపములున్నను మృదుపదసంయుతమై లోకోక్తులతోను, జాతీయములతోడను ద్రాక్షాపాకమున విరాజిల్లుచున్నది. కవిత్వశైలి దెలియుటకు నాల్గాశ్వాసములనుండియు నాల్గుపద్యము లుదాహరించుచున్నాఁడను

చ. జలరుహపత్రనేత్రి ! విను చందనగంధి విరాళియెంతో హై
నిలఁగల సొమ్ములంగళని యింగలమందుఁగరంగి పూదెవై
మిలమిల డొల్లి రాఁజెలుఁలు మిణ్గురు బూచులటంచుఁ బట్టి చే
తులు సెగలంటి పొక్క వెతతో విదలింతురుమిట్ట మీనులై ౦త

ఉ. వచ్చినకార్యమేమనుచుఁ బల్కనినాతఁడు కూతునల్లునిన్
మచ్చికఁబంపగావలయు మాసదనంబునకన్న రాధతోఁ

నెచ్చెర నచ్చరించి యటుచేయుతునంచని నందుఁడాడఁగా
వచ్చెలి యింటికింజన నిళాబ్జదళాక్షినిఁ గన్నతండ్రియున్ ౨ ఆ

ఉ. ఎవ్వరికూటముల్ చెఱిచి యెవ్వరిమున్నడఁ బాపినామె నేఁ
డివ్వగ రవ్వలందియిపుడిద్దరమిద్దరమై విదేశత
న్నొవ్వగనొచ్చి మోహమును మాతము నింగిసుఖంబు లేక హా
జవ్వనమెల్ల బోగడపి బానట నేనిటఁ దల్లడిల్లఁగన్ 3 ఆ

చ. కపటులు క్రూరచిత్తులు స్వకార్యపరుల్ కరుణావివర్జితుల్
చపలుల సత్యభామణులిలన్మగవారలు వారిలోనఁ గొం
చపు నరతుంట వింటివ గసామివి దేవర నీకు నాపయిం
గృపమటియేటుకిన్గలుగుఁ గృష్ణహరీనవనీత చోరకా ! ౪ ఆ

ఈగ్రంథమునందు లోకోక్తులును జాతీయములును జాలగాఁ గలవు. మచ్చునకట్టి లోకోక్తులుకల కొన్ని పద్యముల నిటనుదాహరించుచున్నాఁడను.

గీ. తనదుమట్టెంత తానెంత తానెయింత
చేయఁజూచిన నే నెంత చేయరాదు
వేలువాచిన రోలంత విరివియైన
రోలువాచిన నద్దియెంత మేలుగనునో

గీ. కుట్టదేలుకుట్టకున్నఁ గుమ్మరబూచి
తోసిరాజటంచుఁ దోఁచెఁ జెలియ
దానివేలుదీసి దానికన్ను పొడిచి
నటులు చేయకున్ననగునె చిలుక !

గీ. తగరుకొండమీదఁ దాకఁ గోరినదారి
నదిరిఁదన్నుఁ దెలియుకింతపలికె
నెంతమీనువచ్చి యెంతమీనుమ్రింగె
గానఁద్రుళ్లి సద్దిగంత మోచు

గీ. తానిపదరకుమిఁక మీఁద దాని మొగము
కనఁగవలదని శౌరికిఁగట్టుపెట్టి
బింకములుకూల నఱకాలబెట్టినేల
రాయకున్నను నాపేరు రాధ కాదు.

గీ. తేనిపట్టింపులెల్లను బూనిచాన
నేన యెదురైనఁగాని యింతైనఁజూడ
దల్పునకుఁ గల్మివచ్చిన నర్థరాత్రి
గొడుగు తెమ్మన్నకతగాను గోమలాంగి

అంగనాస్వభావ మీపద్యములయందుఁ జక్కగాఁ జిత్రింపఁ బడి యిది స్త్రీకవిత్వమని వ్యక్తము చేయుచున్నది. సముఖము వెంకటకృష్ణప్పనాయకుఁడుకూడ రాధికాసాంత్వనమును రచించెనని చెప్పుచు నాతనిపేరుతోఁ గొన్నిపద్యములను జేర్చి ప్రకటించు చున్నారు. అందలిపద్యములలోఁ జాలాభాగ మీపళనిరాధికా సాంత్వనములోనివే. ఈవిషయమునుగూర్చి వెంకటకృష్ణప్పనాయ కుని చారిత్రమున వ్రాసి యున్నాఁడను. వానినిట మరలవ్రాయుట పునరుక్తి యగును.

ద్రావిడకవయిత్రియైన గోదాదేవి ద్రావిడభాషలో శ్రీకృష్ణుని లీలావిలాసములను పాశురములను ముప్పది గేయములను 'తిరుప్పావై'

యను గ్రంథమున రచించినది వానిని 'ముద్దుపళని' ఆంధ్రభాషలో సప్తపదులను పేర మృదుమధురగేయములుగా రచించినదని చెప్పు చున్నారు. భావమునకుఁ దగినభాషలో నీగేయములు మనోహర ములుగా నున్నవి. మచ్చున కందొక గేయ మీక్రింద నుదాహరించు చున్నాఁడను.

"వాఁడెవచ్చి పిలువ లేచివత్తుమనుచుఁ బండుకొన్న
చేడెనిదుర లేపగాను జెలులువచ్చిరి.
మణివిచిత్ర సౌధమందు మంగళార్థమైనదీప
కణికలుల్ల సిల్లఁబొంగలు గమ్ముమనఁగ నూ
కులుకుతళుకు శయ్యనిద్రఁ గూరినట్టి మేనమామ
కూర్మిబిడ్డ ! గడియతలుపు గొలుసుమలుపవే
అత్త ! పూలగుత్తి నీదుముత్తియంపు బిడ్డమెల్ల
నొత్తిగించి నిదుర లేవ నత్తరాదటో !
మూఁగచెవుడు గలదొ లేక రాఁగనీక మత్తుగదుర
సాఁగితూఁగ నెవరు మందుచల్లి నారలో
మాధవుండు మాయలాఁడు వేధకైన బోధ లేని
గాధ వానివెయివిధాల గణనచేతుమా
అమ్మ ! తోడిబొమ్మలిరుగొ లెమ్మనంగ దమ్మముద్దు
గుమ్మ నిదుతళుకుఁ గులుకుబొమ్మనిప్పుడూ !

ఈ ముద్దుపళని కాశ్రయ మొసంగిన ప్రతాపసింహుఁడు క్రీ.శ 1749 మొదలు 1765 వఱకును తంజావూరున రాజ్యపాలనము చేసినవాఁడు. కావున నీకవయిత్రియు నాకాలమునందు, తంజావూరు నందుండుట నిశ్చయము.

సప్తపదులను రచించినది ముద్దుపళని కాదనియు, శ్రీనివాస దేశికులా గ్రంథమునకు కర్తయనియు. శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు, భారతి పత్రికలో వ్రాసియున్నారు. అది సత్యమనుటకు సందియము లేదు. ఇందునుగూర్చి శ్రీనివాసదేశికుల చారిత్రమున వ్రాసెదను.

ఈమె మహారాష్ట్రయువతియని బ్రౌను పండితుఁడు సంశయమును జూపినాఁడు, కానియందుల కాధారములు లేవు.



## 359 కస్తూరి రంగకవి

ఇతఁడాఱువేల ధర్మవెచ్చకమ్మ నియోగి బ్రాహ్మణుఁడు శ్రీవత్స గోత్రుఁడు; వేంకటకృష్ణార్య కామాక్షమ్మలకుఁ బుత్రుఁడు.

ఈ కవి ఆనందరంగరాట్ఛందమను నొకలక్షణ గ్రంథమును, శ్రీకృష్ణార్జునసంవాదమను నైదాశ్వాసముల పద్యకావ్యమును, సాంబనిఘంటు వను పేర నొక చిన్నయాంధ్రపదపద్య నిఘంటువును రచించి యుండెను ఇతఁడు క్రీ శ. 1750 ప్రాంతమున ననఁగా నిప్పటికి రెండువందల సంవత్సరములకు ముందుండినవాఁడు. తంజావూరున మహారాష్ట్రరాజుగా నున్న తుళజమహారాజుచే నాంధ్రకాళిదాసు బిరుదమును సంపాదించి, శంకరవిజయము నాంధ్రమున రచించిన యాలూరి కుప్పనకవి యీరంగకవికి శిష్యుఁడు. కుప్పనకవి యాతనిని గూర్చి తన శంకరవిజయము నందిట్లు వ్రాసి యున్నాఁడు

సీ. భారతి కేవిప్రవర్యుని జిహ్వా ని
త్యముగ వసించు నాస్థానవాటి
వాణీవధూటి కెవ్వాని నుచ్చలుకులు
ధరియించినట్టి ముత్యముల చాలు
శారద కేసుధీస్వామి చేతోవీధి
యమరిన రత్నసింహాసనంబు
పలుకులవెలఁది కేభావజ్ఞుని గృహాంబు
నెట్టుగా వసియించు పుట్టినిల్లు

నలువ చెలువకు నివ్వఁ జెన్నఁదగు పుత్త్రుఁ
డట్టి కస్తూరి రంగార్యు నచల ధైర్యు
నార్యనుత చర్యు మద్గురు వర్యుఁగ నెంచి
ప్రణుతిఁ గావింతుఁ బలుమాఱుఁ బ్రస్తుతింతు.

ఈ కుప్పనకవికిఁ గాళిదాసని బిరుదమొసంగిన తుళజమహా రాజు క్రీ.శ. 1765 మొదలు 1788 వఱకు తంజావూరు రాజ్యమును బరిపాలించినవాఁడు.

ఈతఁడు రచించిన సాంబనిఘంటువు పైడిపాటి లక్ష్మణకవి రచించిన ఆంధ్రనామ సంగ్రహము వంటిది 95 సీసపద్యములలో నీనిఘంటువును రచించి గ్రంథాంతమున దననామము నిట్లుదాహరించెను.

క. నిస్తుల లక్షణకవియగు
కస్తూరీ రంగ సుకవి ఘటియించన యీ
సిస్తగు నాంధ్రనిఘంటు ప్ర
శస్తంబై వెలయుఁ గాత జగతిని సాంబా!

ఈ నిఘంటు రచనాధోరణి తెలియుటకై రెండుపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. తలఁపుచూలి మరుండు వలరేడు చిలుక కా
ఱామని చెలి గాడ్పుటరదపు దొర
జాబిల్లియల్లుఁడు చెఱకువిల్తుఁడు తూపుల
నెఱదంట కలువములగరితబిడ్డ

కన్నులవిల్తుఁడు కమ్మవిల్తుఁడు పచ్చ
విలుకాఁడు చక్కెరవింటిజోదు
వెడవిలుతుఁడు తియ్యవిల్తుఁడు చిలుకాగు
విలుకాఁడు తుంట విల్గలదు నీఁడు

తే. తలిరువిల్తుఁడు ననవిల్తుఁ డలరువిల్తుఁ
డించువిల్కాఁడు రాచిల్క నెక్కు రాతు
మీను మొసలిసిడెంబుల మేటి తేఁటి
యెల్లెవాఁడన మదనాఖ్య లమరు సాంబ

సీ. కరువలి మేఁతరి కంటివిన్కరి పాము
పుట్టకాఁపరి త్రాఁచుచుట్టుపురుఁగు
విసముతాలుపు చిల్వ బుసపుర్వు నాభోగ
వెలయుఁజిలువతేఁడు వెన్నుపాన్పు
తడపులనిడుపఁడు తరిగట్టుత్రాఁడన
నహిపతికగు నజ్జయలుఁగు పులుఁగు
కోడిపుంజన నొప్పుఁ గుక్కుటనామముల్
గుడ్లగూబ పగటిగ్రుడ్డి గూబ

తే. యనఁగఘూకాభిధానంబులగు లకుముకి
మీనవల్లంకి పొదలిక మీలగొంగ
యనిఁగఁ జనువర్తకుఁ బేరులమరు దివ్వె
యార్పు మిడుతన శలభాఖ్య లమరు సాంబ

ప్రతిపద్యముతుదను 'సాంబ' యను సంబోధముండుటచే దీనికి సాంబ నిఘంటు వని పేరువచ్చినది. ఈతఁడు రచించిన చంధో

గ్రంథమును పదునెనిమిదవ శతాబ్దిఁ బరార్ధమున ఫ్రెంచియధికారుల యొద్ద ద్విభాషిగానున్న ఆ "ఆనందరంగపిళ్లే" యను నాతనికిఁ గృతియిచ్చి యాగ్రంథమునకు "ఆనందరంగరాట్ఛంధ" మని పేరిడి యెను. ఈ యానందరంగపిళ్లెవంశమునకు, ఆర్వీటి బుక్కరాజుల లోని వంశము వాఁడును, శ్రీకృష్ణదేవరాయల యల్లుఁడునైన అళియ రామరాజు కుమారుఁడగు కళాధరుఁడనువాఁడు మూల పురుషుఁడైనట్లు చెప్పియున్నాఁడు. ఈ రాఘుదేవరాయల పూర్వులను గూడ నిందువర్ణించి యుండెను. గాని వీరినామములు మొదలగునవి చారిత్రముతో నేకీభవించుట లేదు కావున నాభాగ ముపేక్షింపఁ దగినది.

కృతిపతియైన ఆనందరంగఘనుని తండ్రియగు తిరువేంగళయ్య కూడ, ఫ్రెంచివారియొద్దను, నింగ్లీషువారి యొద్దను, డచ్చివార యొద్దను ద్విభాషిగానుండి యపారైశ్వర్యమును సంపాదించి యుండెను. ఆనందరంగరాట్ఛందమున నీకవి లక్షణములను రచించి యందులకనేక గ్రంథములనుండి లక్ష్యముల నుదాహరించియున్నాఁడు. ఈతఁడుదాహరించిన కొన్ని గ్రంథములును దత్కర్తలును యిదివరకు లోకమునకపరిచితములును నపరిచితులై యున్నారు. ఆ గ్రంథము లిప్పుడు లభించుట లేదు. ఆ గ్రంథములను గూర్చియు నాకవులను గూర్చియు నింకను బరిశోధింప వలసియున్నది.



# 360 నుదురుపాటి వెంకనార్యుఁడు.

ఈతనిని కోటి వెంకనార్యుఁడని కవులచరిత్రలో వ్రాసి యున్నారు. ఇతఁడు గద్యలో రఘునాథరాయల గృహనామమును "కోటి సమాఖ్య" అని చెప్పియుండుటను గాంచి యది కవిగృహ నామమని తలంచి యట్లు వ్రాసియుందురు. ఈతని యింటిపేరు నుదురుకోటి వారని కవిబంధువులొకరు వ్రాసియున్నారని యీకవి కాశ్రయుఁడగు కోటి తొండమాన్ రఘునాథ భూపాలుఁడు రచించిన పార్వతీపరిణయ పీఠికలో నాగ్రంథముద్రాపకులు వ్రాసియున్నారు. మఱికొందరీకవి గృహనామము నుదురుమాటివారని యనుచున్నారు. ముద్రితాముద్రితప్రతులలో నుదురుపాటి వారని యుండుట చేతను, వెలనాటి బ్రాహ్మణులలో నుదురుపాటివారుండుటచేతను నుదురు పాటి వెంకనార్యుఁడనియే యిందుఁ బేర్కొన్నాఁడను. రఘునాథ భూపాలుఁడు పార్వతీపరిణయము లోని యీక్రిందిపద్యమువలన నీతఁడు వెలనాటిబ్రాహ్మణుఁడైనట్లు తెలియుచున్నది.

గీ. ముందు వెలనాఁడు దివ్యమానందు లోన
నుదురుపాటి కులంబున నెదురు గాన
నచట నుద్దండకవి నుతుండైన వెనుక
శంకరుని మించుఁ ద్వచ్ఛౌర్య వెంకనార్య

ఈ వెంకనార్యకవి వెలనాఁటి బ్రాహ్మణుఁడు మహోద్దండ కవిబిరుద ప్రశస్తుఁడగు సీతారామార్యుని తనయుఁడు ఫుదుకోట సంస్థాన ప్రభువగు కోటి తొండమాన్ రఘునాథభూపాలుని యాస్థానకవి. ఇతఁడు ఆంధ్రభాషార్ణవము దేవమల్లచరిత్రము

అను రెండు గ్రంథములను జేసెను. మఱియుఁ దొండమాన్ వంశావళి యను పేర నొక సీసమాలికను పుదుక్కోట సంస్థానాధిపతుల వంశమును వర్ణించుచు రచించెను. ఆంధ్రభాషార్ణవము మూఁడు కాండలుఁగల యచ్చతెనుఁగు నిఘంటువు పద్యరూపమున రచింపఁబడిన యాంధ్రభాషానిఘంటువులలో నీతని యాంధ్రభాషార్ణవ ముత్తమమైనదియుఁ బెద్దదియు నై యున్నది. ఈ యాంధ్రభాషార్ణవమును పుదుక్కోట సంస్థానాధిపతి యగు రఘుభూపాలుని ప్రోత్సాహమున రచియించి తిరుచునాపల్లి యందలి మాతృభూతేశ్వరస్వామి కంకితము చేసెను. ఈతని నీకృతి రచింపుమని పుదుక్కోట ప్రభువు ప్రోత్సహించి నట్లీక్రిందిపద్యములలో గవి చెప్పియున్నాఁడు

క. ఖచరీ కచకుచ విచల
ద్విచికిల హారస్రవన్నవీ నమరంద
ప్రచుర రుచిఁ బెనఁగొనుఁ గచా
కచిగా నీకవిత లెన్నఁ గవివెంకన్నా !

తే. ఆంధ్రగీర్వాణ కవనంబు లందు నీకుఁ
గలుగు జ్ఞానం బదేరికిఁ గలుగ నేర్చు
నాశ్రితుఁడ వంచు నుతియించు నట్టి గాదు
గాని యవి యిపుడేల వెంకన కవీంద్ర

తే. దేవతల భాష గావునఁ దెలుఁగు కన్న
సంస్కృతము మిన్న యాయుక్తి సరియె తెలిసి
రసికుఁడగువాఁడు తనదు జాఱుసికలోనఁ
దులసి నే యిడుకొనునొ జాదులనె యిడునొ

తే. కాన యీ యాంధ్రకృతులందుఁ గలుగునట్టి
పదములకు నెల్ల నర్థమేర్పడెడు రీతి
నద్భుతంబుగఁ గృతిని జేయంగ వలయు
నర్థమైన రస స్ఫూర్తి యగుట యరుదె

తే. కృతికి నాయకు మాతృభూతేశుఁ జేయ
వలయు నన నేను నట్లకాఁదలఁచితి ననఁ
బసిఁడిసొమ్ములు సేయించి వంటరాళ్లఁ
జెక్కినను మేలెరత్నముల్ చెక్కకున్న!

రఘునాథభూపాలుఁడు పండితుఁడు కవి అట్టివానిని మెప్పించిన వెంకనార్యుఁడు సామాన్యుఁడగునా! ఈతని తండ్రియైన మహోద్దండకవికి రఘునాథభూపాలుఁడు శిష్యుఁడు అతఁడుద్దండ కవి యనుటయేకాని యాతఁడు రచించిన గ్రంథముల నెవ్వరును దెలుప లేదు. సంస్కృతమున నేమయిన రచించెనేమో! ఆంధ్రనామ సంగ్రహమువలెనే యాంధ్రభాషార్ణవమునందు వర్గవిభాగము కలదు. కాని యందులో వలె నైదువర్గములే గాక యమరమువలె మూఁడుకాండలను గలిగి యన్నివర్గములను గలిగియున్నది. ఇందు కందగీతపద్యములు కొలఁదిగా నున్నవి తక్కినవన్నియు సీసపద్యములు. నిఘంటువైనను మృదువైనభాషలో సులభగ్రాహ్యమగు నట్లు వ్యర్థపదరహితముగఁ బద్యములను రచించియున్నాఁడు. శైలి చూపుటకై మూఁడుపద్యముల నిట వ్రాయుచున్నాడను.

ఆ. ప్రోలు వీడు నాఁగఁ బుర సంజ్ఞలై యొప్పుఁ
గంచి నాఁగ నోరుఁగల్లు నాఁగఁ

దిరిచనాపలియనఁ బరవిశేషములగు
వాడ యనఁగ వాటి పటలునభవ

సీ. కాంచనాభిధలు బంగారు బంగరు హొన్ను
పసఁడి పసిండి ఘౌన్ పైఁడి పయిఁడి
పుత్తడి యంచనఁ బొలుపారు నతిశుద్ధ
చామీకరాఖ్యలు చనుఁగ దాని
మేలిమి యపరంజి జాళువా కుందనం
బుదిరినా రజతాఖ్య యొప్పు వెండి
మడికా సంగను మను నారకూటంబు
పిత్తడి యంచవ నిత్తడి యనఁ

గాంస్య నామంబు విలసిల్లు గంచనంగ
రాగి యంచన వెలయుఁ దామ్రాభిధాన
మయుము విలసిల్లు నినుమన నలరుఁ దద్వి
శేషముక్కని చెప్పఁగ శేషభూష

క. వినిపించె ననెడి మాటకు
వినిచె ననం జెల్లు చుండు పేఁగె నవంగా
దనదును గర్వించె నటం
చని త్రిశిరః పురనివాస యాదృతదాసా!

గ్రంథాంతమందలి గద్యయిది :—

"ఇది శ్రీమత్పరమేశ్వరకటాక్ష సంప్రాప్త సర్వజ్ఞత్వాది కతిపయ గుణస్వసామ్య, తదితర సకలగుణ నిర్వాప మ్యాసేతు

హిమాచలఖ్యాత మహోద్దండకవి బిరుదప్రశస్త సీతారామార్య వర్య తనూజాత శౌర్య ధైర్య స్థైర్యాది సకలగుణ చిరత్న రత్న రత్నాకర శ్రితజన శ్రీకర కోటిసమాఖ్య వంశసుధాపయోధి రాకాశశాంక ఘంటికా తురగ నీలాతపత్త్రి హనుమద్ధ్వజ మకర కేతన దివాదీప నవవిధభేరికాది నిఖిలబిరుదాంక బృహాదంచికా కటాక్షసంజాత సామ్రాజ్య ధురంధర విమల యశోబంధుర కర్ణాట చోళ పాండ్య మహీపాలాది సంస్తూయమాన శ్రీరాయ రఘునాథ మహీనాథ సభాంకణ బిరుదాయమాన నార్యనుతచర్య వేంకనార్య ప్రణీతంబైన యాంధ్రభాషార్ణవంబు"

ఆంధ్రదేశమునుండి ద్రావిడదేశమునకు వలసపోయి యచ్చటి ప్రభువులకాంధ్రభాషయం దాసక్తి కలుగఁజేసి, వారిచే గ్రంథము లను రచింపఁజేసి వారివలన బహూకరింపఁబడిన యాంధ్రులలో నీనుదురుపాటివారొకరు. ఆకాలమున నాంధ్రదేశమునుండి దక్షిణ దేశమునకేఁగి యచ్చట నివాసమేర్పఱచుకొనిన వారనేకులున్నారు.

ఈ వెంకనార్యుఁడు దేవమల్లచరిత్ర మనునాల్గాశ్వాసముల పద్యకావ్యమును రచించి, బిరుదు కుప్పాల్లుడను వానికిఁ గృతి యొసంగెను. ఈగ్రంథమునఁ గృతిపతివంశీయులగు మల్లులచరిత్ర వర్ణితమైనది. కృతిపతి యీగ్రంథమును రచింపుమని కవిని ప్రోత్స హించిన పద్యములివి :—

క. "బలవైరి గంధ సింధుర
గళబంధుర ఘటిత ఘంటికా రావనిర
ర్గళ ధాటీ పటిమ మనీ
షిలలామా నుదురుపాటి సీతారామా"

క. అని వినుతిఁగన్న యతనికిఁ
దనయుఁడ వగు నిన్ను మాకుఁదరమా పొగడం
గను నభినవసర్వజ్ఞుఁడ
వనఁ దగు నికెల్లుపాటి యన్యకవీంద్రుల్

క. ఆ వాత్స్యాయన తంత్రం
బా వేదాంతముగఁ దెలిసినట్టి కవీంద్రుం
డీ వొక్కండె ధరాస్థలిఁ
గావున నీకవిత మిన్న కవి వెంకన్నా!

ఉ. కొండలవంటి జెట్టి కులగోత్రము లేమనఁ దెల్ప లేక యే
యుండుదు రందఱుం దెలియ నొక్క కృతిన్ రచియింపు మీవు బ్ర
హ్మాండపురాణమందుఁ గల మల్లకులక్రమ మంధ్రభాష భూ
మండలిఁ బండితోత్తములు మానసవీథిఁ దలంచి మెచ్చఁగన్

ఈ పద్యమును బట్టిచూడఁగా మల్లులనునొక ప్రత్యేక కులమునకు జెందిన యొక తెగ కలదనియు, వారి కులవిద్య మల్లవిద్యయనియు వారు క్రమక్రమముగాఁ దమ కులగోత్రములను మఱచి మల్లులని పిలువఁబడుచుండిరనియు నట్టివారి పూర్వచరిత్రను వివరించుటకై యీగ్రంథ ముద్దేశింపఁబడిన దనియుఁ దెలియుచున్నది. ఇట్టి కథలకు సామాన్యముగా స్కందపురాణమో, భవిష్యత్పురాణమో, బ్రహ్మాండపురాణమో మూలమని చెప్పుచుందురు. ఈకథకు బ్రహ్మాండ పురాణము మూలమని చెప్పఁబడినది. కృతిపతిని కవి యీక్రింది పద్యములలో వర్ణించి యున్నాఁడు.

మ. కరినిం గన్గొని గుప్పునం దుముకు సింగంబో యనం జెన్ని
బ్బరపుం శౌర్యముఁ జూపుచున్ బిరుదుకుప్పాశెట్టిపై దాఁకి యా
బిరుదు ల్గాంచితి వీర నిన్నుఁ గని హంవీరు ల్నుతింపగ మేల్
పరమండూక ఘటీ ఫణీ బిరుదుకుప్పాల్మల్ల వీరాగ్రణీ!

తే. ఇంత ఘనుఁడవు గావున నెంచి చూచి
మల్లకుల చక్రవర్తియై మనుచు నుండు
పెద్దకుప్పన మల్లాఁడు ప్రీతితోడ
సకల జనములు మెచ్చఁ గన్యక నొసంగె

సీ. శ్రీకరుణా రసార్ద్రీకృత భవనుండు
విద్వత్కవిచ్ఛటా వినుతకీర్తి
మల్లవంశాంబుధి హల్లకి సీపతి
గార్గ్యసగోత్ర విఖ్యాతమౌళి
సురుచిరాపస్తంబ సూత్ర క్రియా వేది
యభ్యాసి గండ గేహాభిమాని
వేంకటేశ్వర మల్లవీరపుత్రాగ్రణి
లక్ష్మమాంబాగర్భ రత్నభూష

సకల రాజాధి రాజ ప్రశస్త ముద్దు
వడుక నాథేంద్ర దత్త ప్రవర్ధమాన
సకల నిరవధికైశ్వర్య శాలి పుషిత
బాంధవ జనుండు బిరుదుకుప్పాల్ఘనుండు

కృతిపతికిఁ బోషకుఁడగు నీ ముద్దువడుకప్రభు వెవ్వరో తెలియలేదు. ఆకాలమునఁ బుదుక్కోట రాజ్యమునకుఁ జుట్టు ప్రక్కలఁ జిన్నజిన్నసంస్థానములు (ప్రాళ్యములు) చాలగా నుండెడివి. ఈముద్దువడుకప్రభువు నేదేనియొక సంస్థానమునకుఁ బ్రభువై యుండును. కృతిపతి యాపస్తంబ సూత్రుఁడనియు గార్గ్యసగోత్రుఁడనియుఁ జెప్పఁబడినది. మన వెంకనార్యుని కాలమున బుదుక్కోటకు సమీపముననున్న శివగంగ సంస్థానమునకు ముద్దువడుకనాథదేవారు జమీందారుగ నున్నాఁడు. అతఁడు శా. శ. ౧౬౮౧ (౧౭౫౯ క్రీ. శ) లోను, శా. శ. ౧౭౦౬ (క్రీ. శ. ౧౭౮౪) లోను చేసినదానములను దెలుపు రెండుతామ్రశాసనములు గన్పడుచున్నవి. ఈముద్దువడుకనాథదేవారే దేవమల్లచరిత్రకృతిపతికి పోషకుఁడని నిశ్చయింపవచ్చును.

బ్ర శ్రీ. వీరేశలింగముపంతులుగా రీకవికాలమును నిర్ణయించుటలో "ఈ కవి యీ పుస్తకమును శ్రీవిజయరఘునాథుని పుత్రుఁడైన రఘునాథరాజు ప్రేరణముచేతఁ జేసి యాతని కంకితము చేసెను. ఈ రఘునాథరాజు రామనాథసేతుపతియయిన విజయరఘునాథ రాజుకుమారుఁడని తోఁచుచున్నది. అటయినపక్షమున రఘునాథరాజు ౧౭౩౪ వ సంవత్సరము మొదలు ౧౭౪౭ వ సంవత్సరము వఱకును రాజ్యము చేసినందునఁ గవియు నాకాలమునందుండియుండవలెను" అని వ్రాసియున్నారు. కాని సత్యమిందులకు భిన్నముగా నున్నది. ఆంధ్రభాషార్ణవము మాతృభూతేశ్వరస్వామి కంకితము సేయఁబడినది. కృతిప్రేరకుఁడు పుదుక్కోట సంస్థానాధిపతి కాని రామనాథసేతుపతి కాఁడు. పుదుక్కోట సంస్థానాధిపతియు,

విజయరఘునాథతొండమానుతనయుఁడునగు రాయరఘునాథతొండమానుఁడు క్రీ. శ. ౧౭౬౭ మొదలు ౧౭౮౯ వఱకును రాజ్యమును చేసినవాఁడు. కావున వెంకనార్యకవి యాకాలమునం దున్నవాఁడనుటస్పష్టము.

ఈతని కవిత్వశైలి తెలియుటకై దేవమల్ల చరిత్రమునుండి యైదు పద్యముల నుదాహరించుచున్నాఁడను.

చ. దినకర బింబకోటి సమదేహు దయాపరివాహు సారసా
సన వినిబద్ధపాదు సుఖసాగర ఖేలన మోదు యోగమా
ర్గనిహితచిత్తవీధిని తురంగశిరోధిని గాంచి భక్తితో
వినతి యొనర్చి సాంజలిగ వేమరు సన్నుతిఁ జేయ నిట్లనున్
౧. ఆ.

ఉ. కన్నులు మూయఁ జీకటగుఁ గాదని ధ్యానము సేయఁబోవ లో
నున్నది యొక్కటుండ మఱియొక్కటి తోఁచును తోఁచఁద్రోసి తా
నన్నిన వస్తువే నిలుప నీశ్వరుఁడా! మనసేమి చేతిదా ?
తిన్నఁగఁ దిద్దుకోవలె నదేకద పూర్వపు పుణ్య మెన్నఁగన్
౨. ఆ.

చ. కచమని పేరుగాని యది కన్గొను షట్పదు తేఁటు లందులో
న చపలవృత్తి పిల్లలయినట్టివి కొన్నిముఖాబ్జ గంధ మె
న్నుచుడిగి వచ్చి నాసను గనుంగొని సంపెఁగఁగా భ్రమించి వి
చ్చిచనఁగ ప్రక్కలందుఁగని చెల్వకు కన్బొమలంద్రు పాము
దుల్. 3 ఆ.

ఉ. చుక్కలుమాసె తామరల ఝుమ్మని తేటులుకూసె చీకటుల్
దిక్కులఁబాసె లోకమునఁ దెమ్మెరచల్లనఁ జేసె కల్వపూల్
స్రుక్కుచు నోరుమూసె తమసుందరు లేరి యటంచు జక్కవల్
గ్రక్కునఁ డాసె జార నివహంబునకున్ మదిరోసె సంతటన్
౭ ఆ.

ఉ. చూడక మున్నుఁ జూచుటకుఁ జూచినఁ బల్కఁగఁ బల్కులాడి
నన్
కూడఁగఁ గూడినంతటను గూరిమిచేతను మేనులొక్కటై
వీడని మోహసాగరపు వెల్లిని దేలుచు నుండఁ గోరునా
వ్వాఁడును స్త్రీల విన్నను వివాహముసాగిన జెప్పనేటికిన్
౮ ఆ.



# ౩౬౧ తక్కెళ్లపాటి లింగన్న

ఈతఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; హారితసగోత్రుఁడు; వెంకటపతి సూరమ్మలకుఁదనయుఁడు; చిట్టయ లింగమాంబలకుఁబౌత్రుడు; గుర్వన వీరమలకుఁ బ్రపౌత్రుఁడు ధేనువుకొండ నాగయామాత్యునకు దౌహిత్రుఁడు.

ఈకవి యౌవనమునందు మోహినీవిలాసమును బ్రౌఢవయసున సూర్యతనయా పరిణయమును అఱువదేండ్ల ప్రాయమున నుత్తరహరిశ్చంద్రకథయు రచియించినట్లు తనవృత్తాంతము నీక్రింది పద్యములలోఁ జెప్పుకొని యున్నాఁడు.

ఉ. శ్రీరమణీయ వైఖరులఁ జెన్నగు తక్కెడపాటివంశవి
స్తారుడు గుర్వనార్యు డురుధర్మయుతో మహితుండు భార్యయౌ
వీరమ యందుఁ గాంచె సువివేకులఁ జిట్టయ వేంకటాద్రులన్
వారలలోనఁ జిట్టసచివప్రభుఁడొప్పె ముకుందభక్తుఁడై

క. అంగర కులాబ్ధి లక్ష్మిన్
లింగమ యను సాధ్వి నతఁడు లీలన్ బెండ్లై
సంగతి వేంకటపతియన
నంగజ నిభు సుతుని గాంచె నాసతియందున్

గీ. పరమ సుకృతి యావెంకటపతియు సుజన
మానితాంబుజ మార్తాండ ధేనుకొండ
నాగయామాత్య సత్పుత్రి నవ్యతరసు
వర్ణగాత్రి సూరమను వివాహమయ్యె

ఉ. సార పతివ్రతామహిత సద్గుణ-శోభితచిత్తయైన యా
సూరమ యందుఁ గాంచె మధుసూదన పాదసరోజసేవనా
చారుఁడు బంధువర్గవనచైత్రుఁడు వేంకటమంత్రి నన్ను శృం
గార కవిత్వసారపరికల్పకతన్ దగు నట్టిసత్కవిన్

సీ. తగ రచించితిని మదనమోహినీ విలా
సంబు మెప్పుగ యౌవనంబునందు
భక్తి సూర్యతనయాపరిణయంబ నెడు
ప్రబంధంబు జెప్పితి ప్రౌఢిమమున
నావెన్క విద్యుత్ప్రభావిలాసము వేడ్క
ఘటియించితిని యక్షగాన రీతి
నఱువది యేండ్ల ప్రాయమున నుత్తరహరి
శ్చంద్ర కథ నొనర్చు సారమతిని

వేంకటేశ్వర శ్రీరామ విభుల కెలమి
నంకితంబుగ మును జెప్పినట్టి కృతుల
రీతి నిది గృష్ణునకు సమర్పించి యిపుడు
యిలను ధన్యుడ నైతినార్యులు నుతింప

కవితంద్రియైన వెంకటపతి వెల్గోటి కొండలరాయనృపతిచే మన్ననలందినట్లు సూర్యతనయాపరిణయమునం దీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. సకల విద్యారూఢ చతుర వచస్సభా
పాండిత్యమున బృహస్పతి యనంగ

సతతాన్నదానాది వితరణంబుల నర్థి
జనబంధు కల్పభూజం బనంగఁ
బరతంత్ర భేదనోపాయ సంగర శౌర్య
విధి కార్యఖడ్గ ప్రవీణుఁ డనఁగఁ
గమనీయ రూపరేఖా విలాసంబుల
గణుతింప మాతనాంగజుఁ డనంగ

ప్రబలె వెల్గోటి కొండలరాయ నృపతి
మన్నన జెలంగి యమిత సంపన్నుఁ డగుచు
మహిత సత్కీర్తి చిట్టయామాత్య సుతుడు
ఘనుడు తక్కెళ్లపాటి వేంకటవిభుండు

వెంకటగిరి సంస్థానాధిపతుల వంశములో కొండ పినకొండ పెదకొండ నామ ధారు లనేకులు గాన వచ్చుచుండుటచేఁ గవి తండ్రి నాదరించిన కొండలరాయనృపతి యెవ్వరో తెలిసికొన శక్య మైనది కాదు. ఈకవికాలనిర్ణయము చేయుటకుఁ దగిన యాధా రములు గ్రంథములలోఁ గాన్పింప లేదు. ఊహఁడించుమించుగా మూఁడు, నూటయేబది సంవత్సరముల క్రిందట నుండినట్లూహింప వచ్చునని బ్ర. శ్రీ. వీరేశలింగంపంతులుగా రాంధ్రకవుల చరిత్ర మున వ్రాసియున్నారు. అది నిజమైనచో నీతనిని పదునెనిమిదవ శతాబ్దివాఁడని యనవచ్చును. ఇతని నివాసము స్పష్టముగాఁ దెలియదు. కాని తండ్రిని వెల్గోటి కొండలరాయనృపతిచే సమ్మా నితుఁడని చెప్పుటచే నీతనిని నెల్లూరి మండలము వాఁడని యూహింప నగును. నెల్లూరు మండలమున కనిగిరి తాలూకాలో తక్కెళ్లపాడు

అను గ్రామమున్నది. దానినిబట్టి యీ కవి గృహనామ మేర్పడి యుండును కవి తనవంశమును మూఁడుగ్రంథములలోను విశేష ముగా వర్ణించియున్నాఁడు. కాని యందు విశేషాంశము లేమియు లేవు.

ఈతని కవిత్వము నిర్దుష్టమయినది కాదు. వ్యాకరణ విరుద్ధ ప్రయోగము లనేకములు గానవచ్చుచున్నవి ఉత్తరహరి శ్చంద్రకథయందు హరిశ్చంద్రుని పరిణయకథ యాదిగా విశ్వా మిత్ర ప్రతిజ్ఞకు పూర్వము హరిశ్చంద్రుని కథవర్ణింపఁబడినది. హరిశ్చంద్రుని కథ భాగవతమునందును, మార్కండేయపురాణము నందును, దేవీభాగవతమునందును, విష్ణుపురాణమునందును, హరి వంశమునందును, కలదు. కాని యవియన్నియు నొక్కతీరున లేవు.

ఈ కవి కవిత్వశైలి తెలియుటకై కొన్నిపద్యముల నుదాహ రించుచున్నాఁడను.

ఉ. చక్రము పంపుసేయ పరచక్రము కైవశమందు చుండఁగా
జక్రధరాభమూర్తి రవి సత్కుల దీపక చక్రవర్తి భూ
చక్రము నేలుచుండఁ బరిచక్ర సమాఖ్యను నొంద మాకహో
శక్రమహత్వ మబ్బెనని సంతసిలెన్ భువి చక్రవాకముల్ ౧ఆ

చ. తనదు మనోహరాకృతికిఁ దద్దయు నద్భుతమంది పౌరు లె
ల్లను గుమిగూడి చూడఁగ విలాసగతిన్ బురిలో విచిత్రముల్
గనుఁ గొనుచున్న రాకొమరుఁ గాంచి నృపాలుఁడు మిమ్ముఁ బిల్వగాఁ
బనిచె నటంచు వారు దెలుపన్విని యాతఁడు వచ్చె నయ్యెడన్ ౧ఆ.

మ. పతివెంట న్మనుబోని నేర మెలమి న్బాయంగ సర్వస్వమా
బులు తాఖంగని గాన్క సేయ నతఁడారాధీశ దయ న్మెచ్చియు
న్నత మాణిక్య ప్రభూషణాళి బహుమానంబియ్యఁగా గొన్నటు
ల్తత వృత్తంబులఁ బందుటాకు లురులం దాల్చె న్వవిశాళంబు
లన్ 3 ఆ.

శా. ఆజ్ఞోల్లంఘన మాచరించె నని భార్యాదుర్ణయం బెంచ కే
యజ్ఞానుండును బోలె నుండె నవురా యక్కుండు రామా
తురుల్
ప్రాజ్ఞత్వంబు దలంపఁ జాలరు గదా బ్రహ్మాదు లెంతైన స
ర్వజ్ఞుండున్ దన మేను సామునఁగఁడే వామాక్షి స్వేదుకన్
ర ఆ.

ఇతఁడు రచించిన మదనమోహినీవిలాసము, సూర్యతనయా పరిణయము, అను గ్రంథములు ముద్రితము కాలేదు. వాని వ్రాఁత ప్రతులు మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునం దున్నవి. మదనమోహినీవిలాసము. నలకూబర మదనమోహినుల ప్రణయ గాథ వర్ణింపఁబడిన యయిదాశ్వాసముల ప్రబంధము. దీనిని నరకృతి సేయుట కిష్టము లేక వెంకటేశ్వరునకుఁ గృతియిచ్చి నట్లీ క్రిందిపద్యములోఁ జెప్పినాఁడు.

ఉ. మెచ్చుటలేదు పొచ్చెములు మిక్కిలి యెంతురు కాని మెచ్చి రే
నిచ్చుట లేద యిచ్చిన నొకించుక గాని ఘనంబెఱుంగ రీ

యిచ్చు నరేశులందు ఫలమేమి యటంచును భక్తి ముక్తిఁ దా
నిచ్చు రమాధినాథునకు నిచ్చెను లింగన మంత్రి యీకృతిన్

సూర్యతనయా పరిణయ మైదాశ్వాసముల ప్రబంధము శ్రీరామచంద్రున కంకితమీయఁబడినది. శ్రీకృష్ణునకును గాళిందికిని జరిగిన పరిణయ కథ యిందువర్ణితము. ఈ కవి విద్యుత్ప్రభావిలాసమను యక్షగానమును రచియించినట్లు తెలియుచున్నది కాని యాగ్రంథము నాకు లభ్యము కాలేదు.



## 362 రావూరి సంజీవరాయకవి

ఇతఁడు ప్రథమశాఖకుఁ జెందిన నియోగి బ్రాహ్మణుఁడు; సాంఖ్యాయన గోత్రుఁడు; రఘుపతికిఁ బౌత్రుఁడు; గురవకవీంద్రునకును బెద్దనూంబకును బుత్రుఁడు; మృత్యుంజయునకుఁ దమ్ముఁడు; రఘునాథునకన్న.

ఇతఁడు "విశ్వతుంద" శతకమని నామాంతరముగల వీరనారాయణశతకమును, వసుదేవనందన శతకమును త్రివిక్రమ విలాసము, రుక్మిణీపరిణయము, భాగవతమునం దేకాదశ ద్వాదశస్కంధములును నింక ననేక గ్రంథములను రచియించి యుండెను. కాని యందుఁ గొన్ని యిప్పుడు లభించుట లేదు. ఈతఁడు జ్యోతిశ్శాస్త్రమున జాతకసిద్ధాంత భాగములయం దతినిపుణుఁడట ఈ కవి నివాసమునుగూర్చి శతకకవుల చరిత్రమునం దిట్లున్నది. "తెనాలి తాలూకాలో నున్న పెదరావూరు గ్రామమునందున్న కరణము లీతనివంశము వారని చెప్పుకొందురు" సంజీవకవి స్వగ్రామము మంతెశము. ఈతని యత్తవారింటిపేరు గంథమువారు ఈతని వంశీయులలోఁ బ్రస్తుతము తెనాలితాలూకా పెదరావూరు వెంకయ్యగారొకరు వీరి తండ్రి తాతలనాటినుండియు వంశపారంపర్యముగ నాగ్రామోద్యోగులుగ నున్నారు. ఇంకను సంజీవకవి వంశీయు లచ్చటఁగలరు. ఈరావూరివారు విష్ణుభక్తులు" అని దుర్గప్రసాదరావుగారు వ్రాసిరి. కవికి బెజవాడ సమీపమునందున్న మందెశము కాపురమై యుండవచ్చును తరువాత నాతఁడో, ఆతని వంశమువారో పూర్వులో రావూరున వసియించి యుండవచ్చును. విశేషదూరప్రదేశము కానందున నీచర్చయనగత్యము.

వీరనారాయణ శతకమునందే కవి రావూరివంశజుఁడ నని యీక్రింది పద్యమునఁ జెప్పియుండుటచే నీతని యొక్కయు నీతని పూర్వులయొక్కయు నివాసము రావూరనియు, ఏకారణమువలననో కొంతకాల మీకవి మందశ గ్రామమున నివసించియుండె ననియుఁ దలంచుట యుక్తమని తోఁచుచున్నది.

సీ. శ్రీకృష్ణ పదయుగాశ్రితుఁడ సాంఖ్యాయన
గోత్రుఁడ రఘుపతిపౌత్రుఁడ గుర
వకవీంద్ర పెద్దమాంబా పుత్త్రుఁడ రఘునా
థునకుఁ బూర్వజుఁడ మృత్యుంజయున క
నుజుఁడ రావూరువంశజుఁడ ననుమకొండ
సౌంజ్ఞ గల్గిన యాదిశాఖను వెల
సినవాఁడ జాతక సిద్ధాన్త ముఖకళా
చతురుఁడ నుభయభాషావిశేష

తే. రసగుణాలంకృతి కవిత్వ రసికుఁడ. విర
చించితి భవచ్ఛతకము సంజీవ కవిని
కుంఠితాశ్రితభవభూక కొలను పాక
వీరనారాయణ! ముకుంద! విశ్వతుంద! ౧౦౮

ప్రథమ శాఖాబ్రాహ్మణులలో నాడు భేదమునుబట్టి యైదంతశ్శాఖలు కలవు. 1 అనుమకొండలు 2 కాసులపాడులు 3 ద్రావిడులు 4 దువ్వలు 5 ఆర్యులు. ఇవిగాక మాధ్యందినశాఖ యొకటి కలదఁట! ఆశాఖ వారీప్రాంతమున లేరనియుఁ గాశీప్రాంతమున నుండి రనియుఁ దెలియుచున్నది. ఈప్రథమ శాఖా బ్రాహ్మణు

లను యాజ్ఞ్యవల్క్యులనియు, కాణ్వులనియు, శుక్ల యజుస్సులనియుఁ బిలుచు చుందురు అనుమకొండవారు లౌక్యులు. ఈ కవి యనుమకొండ శాఖకుఁ జేరినవాఁడని పైసీసపద్యమువలనఁ దెలియుచున్నది. "ప్రథమ శాఖో ప్రాణఘాతకః" అని ప్రథమ శాఖవారు ప్రాణఘాతకులని యొకసామెత యున్నది. ప్రథమశాఖ వాఁడుపాము వంటి వాఁడని వేమనపద్యములలో నున్నది వీనిని బట్టి ప్రథమశాఖా బ్రాహ్మణులందఱు దుర్మార్గులని కుటిలవర్తనులని చెప్పుట కేవల మన్యాయము. ఒకని మూలముననో కొందఱిమూలముననో బాధ నొందిన యేపండితుని వలననో యిట్టి సామెత కల్పింపఁబడి యుండును. క్రమక్రమముగ నది వ్యాప్తము నొంది యొక శాఖకంతకు నన్వయింపఁ జేయఁడియుండును. సత్పురుషులును దుష్టులును ప్రతి శాఖయందును బ్రతిజాతియందును నుందురు ఒక శాఖయంతయు, సన్మార్గులుగా గాని దుర్మార్గులుగా గానియుండుట సృష్టివిరుద్ధము.

ఈ కవి రచించిన వీరనారాయణశతకము నిజాము రాష్ట్రమందలి కొలనుపాక గ్రామముననున్న వీరనారాయణ స్వామిపై రచింపఁబడినది. ఈశతకరచనాసందర్భమున నీ కవిని గూర్చిన రెండు కథలు ప్రచారములో నున్నవని శతకకవుల చారిత్రకారులు వ్రాసియున్నారు. వారిమాటలుగా నాకథల నిటఁ వ్రాయుచున్నాఁడను.

"దుర్గాప్రసాదరావు గారిట్లు వ్రాసియున్నారు. ఈ సంజీవకవి మొదట విద్యావిహీనుఁడనియు, అత్తవారింట నవమాన పరుపఁ

బడి వారణాసికి జని విద్య నేర్చుకొనెననియు, పిమ్మట యొక ప్రభుని తన ప్రౌఢ కవిత్వముచే మెప్పించి రెండుకుంచముల యీనాముదములివ్వుమని కోరి తనయమాయకత్వమును వెలిబుచ్చె ననియు, తదనంతరమున నాతఁడు కొలనుపాక ప్రభువును సందర్శింప నటకేగ రాజాస్థానమందలి పండితుఁడీతనిని వంచింపఁ బ్రయత్నింప నాతనికి హనుమంతోపాసనపరుఁడగు నీసంజీవకవి లోఁగక గ్రామసమీపములో నున్న ముండ్లపొద కొట్టినయెడ నచ్చట వీరనారాయణుఁడవతరించునని రాజున కెఱింగించె ననియు, అంతనాతఁడట్లొనరింప సంజీవకవి యాశతకమును జదివె ననియు పిమ్మట వీరనారాయణుఁడు భూమి బ్రద్దలుచేసికొని వచ్చె ననియు నొకకథ మాపెద్దవారిలో నొక్కరు చెప్పగా వింటిని"

"(2) పరిషత్పత్రికలో నీకథయే కొంతమార్పుగా నున్నది. కాశికి బదులు భువనగిరి యున్నది. సంజీవకవి విద్యార్థిదశయందలి కష్టములోఁ జదువుకొనుటకు దీపము లేక శ్మశానవాటికలోఁ జదువుచుండ రాజు మేడపైనుండి చూచి పిశాచములఁ బ్రయోగించువాఁడని యనుమానించుటయు, కవిని రప్పించి పరీక్షించి నిర్దోషియని గ్రహించి యాతనికి సదుపాయములు గుదుర్చుటయు, చదువు పూర్తియైన వెనుక సంజీవకవి కొలనుపాకమీఁదుగాఁ దనస్వగ్రామమునకు వచ్చుచుండ నట వీరనారాయణస్వామిపై శతకము చెప్పి పైకిరప్పించుటయు నాప్రభువు మెచ్చి కవి నేమి కావలెనని యడుగుటయు, నాస్వగ్రామము చేరువకు దారిలోనున్న యొక్కొక్క గ్రామమునకు 24 కుచ్చెళ్ళ భూమి చొప్పున నిప్పింపుమని కోరినట్లును, ఆప్రభుఁడట్లిచ్చుటయు మొదలగు సంగతులు కూడియున్నది."

వీరనారాయణ శతకపీఠికాకారులగు శేషాద్రిరమణకవులు "కొలనుపాక క్షేత్రవాసులు వీరనారాయణ విగ్రహము ఆలయమున కెదురుగా నున్నకోనేటిలోఁ బడిపోవ సంజీవకవి త్రోవనేఁగుచు నీవార్తవిని మాటయెనిమిది సీసపద్యములు చెప్పఁగా విగ్రహము ఒక్కొకపద్యమున కొక్కమెట్టు నెక్కి పైకి వచ్చినటులఁ జెప్పుదురు. ఇట్టికథలు చరిత్రములకంతగా నుపయోగింపఁ జాలవు" అనియు, "సంజీవకవి భువనగిరి యందు విద్యనేర్చి కుశలుఁడై కొలనుపాక కేఁగి గోపరాజు రాయనామాత్యుని గలసికొని తనకవితచే నాతని నలరించి చెంతనున్న పాదలో వీరనారాయణ విగ్రహముంట దెలిసికొని పద్యములఁజెప్పి ముందునకు రప్పించె నని చెప్పుదురు మహమ్మదీయవిప్లవసమయమున స్థానికులు వీరనారాయణ విగ్రహమును గంపలలోఁ దాచఁగాఁ బిదపఁ దనపలుకుబడి నుపయోగించి రాజసహాయమున సంజీవకవి యుద్ధరించెనని గ్రహింపనగును" అనియు వ్రాసియున్నారు.

సామాన్య మానవాతీత కార్యముల యందించుకంతయు నమ్మకముంచని యీకాలమున నిట్టికథల సత్యత్వమును గూర్చి చెప్పి పాఠకుల నమ్మింపఁజాలము. ఎట్లయిన నీకథలనుబట్టి గవి కష్టపడివిద్యనార్జించిన వాఁడనియు, భగవదారాధనాతత్పరుఁడనియు దపశ్శాలియనియుఁ జెప్పుట కభ్యంతరము లేదు. ఈకవికి ఉర్దూ భాష తెలియునఁట. 'ఈతఁడు క్షేత్ర సంపాదన మధికముగఁ జేసెననియు, నవిచాలవఱకుఁ దత్సంతతివారిచేఁ బరాధీనములైన నిప్పటికని రావూరివారి మాన్యములనియే వాడుచున్నారనియుఁ దెలియుచున్నది. ఈకవికి "కవివిరాట్" అను బిరుదము కలదఁట. ఎవరిచ్చిరో

తెలియదు ఈయనకిచ్చిన భూములపట్టాలలో "కవివిరాట్ సంజీవ రాయసింగారికి" అని వ్రాసియున్నట్లు వినుదుము" అని శతకకవుల చరిత్రకర్తలు వ్రాసియున్నారు.

"కొలనుపాక యనునది సుప్రసిద్ధజైనక్షేత్రము తరువాత పశ్చిమ చాళుక్యులలో నొకశాఖవారికి రాజధాని. కాకతీయుల కాలమున శైవులకు, వెలమ వీరులకాలమున వైష్ణవులకు నీక్షేత్రము వశమయ్యెను. కొలనుపాక హైదరాబాదునకు బెజవాడనుండి పోవునినుపదారి మజిలియగు ఆలేరునకు నాలుగుమైళ్ల దూరమున నున్నది. ఇటగల వీరనారాయణాలయము దర్శనీయము. చిర కాలము క్రింద నిది జైనాలయమై యుండెను క్రమముగా నదిరూపు మాపఁబడుటచే వీరనారాయణస్వామి నిటీవల ప్రతిష్ఠించిరి ఇప్పటికి నాలయమున జైనశాసన మొకటి దేవనాగరలిపిలో వ్రాయబడినది గర్భాలయమునందుఁ గలదు అని శేషాద్రిరమణకవులు వ్రాసియున్నారు.

వీరనారాయణ శతకమునఁ గొలను పాకనుఁ గొలిపాకయని కూడ వాడియున్నాఁడు; 'కొలనుపాక' అని వ్రాసిన ప్రతిపద్యము నందును, కొలనుపాకకుఁ బూర్వమంత్యనియమమును పాటించుచు 'క' యను నక్షరమంత్యమున నుండు పదమునే యుపయోగించి నాఁడు. ఈశతకమును గోపరాజు రాయనామాత్యుని ప్రేరణముచే రచించినట్లు క్రింది రెండు పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

సీ. మతతటాక వనప్రభృతి సంతతిని మించి
తిని వీరనారాయణుని మహిమను

కృతిముఖంబునఁగాని కీర్తి జగద్విది
తముగాదు గానసీసములచేత
సంజీవ సుకవీంద్ర ! శతక మొక్కటి నీవు
రచియించు వీరనారాయణున క
టంచు శ్రీగోపరాజాన్వయ రాయనా
మాత్య చంద్రుఁడు రత్నహాటకాంబ

తే. రాదితాంబూల సత్కృతి నాదరింప
శతకము రచించి యిచ్చితి స్వామి సికు
కుటిలహృదయ పినాక శ్రీకొలనుపాక ... ౧౦౫

సీ. తతభరద్వాజ గోత్రపవిత్ర పుణ్యచా
రిత్రాయ్య వార్యమంత్రిపుత్ర గోప
రాజాన్వయ మహేంద్ర రంగద్యశస్సాంద్ర
రాయనామాత్య చంద్రప్రరుంద్ర
శాశ్వతైశ్వర్య సంజాతదాయక కృపా
రససుధాలహరి విరాజమాన
ఫుల్లారవింద సంపల్లలనావాస
భాసుర శ్రవణాన్త భాగభాగ

తే. రుణవిభాభాసమాన విలోలలోచ
నాంచల నిరీక్షణ పరంపరాభిషిక్త
గోపదిఙ్ముఖదిగనేక కొలనుపాక ... ౧౦౬

ఈశతకమును రచించునప్పుడీతఁడు కొలనుపాక యందుండి యుండును. ఈశతకము నీతఁడు శా. శ. ౧౬౫౩ (క్రీ శ ౧౭౩౧) విరోధికృతు సంవత్సరమున మార్గశీర్ష శుక్ల తృతీయాభానువారము నాటికిఁ బూర్తి చేసినట్లీక్రింది పద్యములో జెప్పియున్నాఁడు.

సీ. గణబాణ షట్చంద్రగణ నత శాలివా
హన శకవర్షంబులరుగ వర్త
మానవిరోధి కృన్మార్గ శీర్షాధిమ
పశుతృతీయేద భానువార
మునకు సంపూర్ణమై తనరిన యీకృతి
యాచంద్ర తారార్కమగుచు ధరణి
నలరె నీవీరనారాయణ శతకంబు
జదివిన వ్రాసిన జనులు సిరియు

తే. నాయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధి
బరగుదురు గాన నీకృపభక్తహృదయ
కల్పితపదపర్వశీక శ్రీకొలనుపాక ... ౧౦౬

దీర్ఘ సాంస్కృతిక సమాసములు లేక చిన్నచిన్న పదములతో వచనములవలె గునుగునీసములచే నొప్పుచున్న యీశతకము నందలి కవిత్వము మనోహరముగా నున్నది. శైలి చూపుటకై రెండుపద్యముల నిట వ్రాయుచున్నాఁడను.

సీ వరద జగత్కుటుంబ ధురీణుఁడవు నీవు
నీగర్భమునను జన్మించి పిదప

నీమేని కాసించి నిన్నుఁ గృష్ణాయని
పేర్కొంచు మనగల ప్రీతినుండు
మాకుఁ గళ్యాణమే చేకూరుఁగాక కీ
డేల నెదుర్కొను నెదురుకొనిన
కలితజన్మాపకీర్తి జన్యము దేవ
రదిగాక యొరులచే యవయవకృత
తే. మైన దార్ఢ్య మవయవిదైనయట్లు
ప్రబల సబల మురాసుర ప్రమథనసమ
తులిత బాహాబలోత్సేక కొలనుపాక ... 33

సీ. దేహమనిత్యము తెలియరాదెట్టి దు
ర్స్మృతిని బొందునో యేమిగతిని జెందు
నో నిజమాడెద నేను జేసిన పాత
కముల నేకములటుగావున నను
జేకొని గావనీచిత్తము నాభాగ్య
ము మరేమి నానియమములుఁ గనఁగ
నక్కట యాపద ల్మొక్కలు సంపద
మఱపులుగాని యుష్మత్పదాబ్జ
తే. యుగళసద్భక్తి నిగళసంయుక్తతఁ దగు
లఁగ సదాప్రవర్తించదు లలితసామ
కవిత గానకళాచ్ఛేక కొలనుపాక ... ౧౫

సత్కవియగు నీతని రచనలయందు 'చేసుట' మొదలగు కొన్ని యపప్రయోగములు గన్పట్టుచున్నవి. ప్రమాదమో బుద్ధిపూర్వకమో తెలియదు.

వసుదేవనందనశతకము నందుఁ దానదివఱకైదు శతకము
లను జెప్పిన ట్లీక్రిందిపద్యములో వ్రాసికొనియున్నాఁడు.

చ. శతకము లేను సెప్పితిని శాంకరవైష్ణవశాక్తి ముఖ్యముల్
కృతిమతి మున్నుఁగొంటి నిపుడీశతకంబు రచించెదన్ యథా
గతమతి లోకశాంఘ్రి బలిగానికు నుత్పలచంపకావళిం
గృతిగొని నివ్వటిల్లఁగను కృష్ణహరీ వసుదేవ నందనా !

వీరనారాయణ శతకము, వసుదేవనందన శతకము దక్కు—
దక్కిన శతకములనామము లేవియు మనకుఁ దెలియుటలేదు. ఇతఁడు
కృష్ణలీలా తరంగములు మొదలగు భక్తిరస ప్రదములగు గ్రంథము
లను రచియించి యుండినట్లు ప్రసాదరావుగారు వ్రాసిరని శతక
కవుల చరిత్రమునందున్నది.

ఈకవి రుక్మిణీపరిణయమును రచించినట్లు గోలకొండ కవుల
సంచికలో నున్నది. కొప్పర్తి నరసకవియును నతఁడు రుక్మిణీపరిణయ
మును, శాపూరి సంజీవరాయకవి సాహాయ్యమున రచించితినని
వ్రాసికొనియున్నాఁడు. సంజీవరాయకవియే రుక్మిణీ పరిణయమును
రచియించి నరసకవి పేరు పెట్టెనని కొందఱనుచున్నారు. ఆవిషయ
మును నరసకవి చారిత్రమునఁ జర్చించియున్నాఁడను నరసకవి
రుక్మిణీపరిణయ రచనాకాలము శా. శ. ౧౭౦౯ వ సంవత్సరమని
వ్రాసికొని యున్నాఁడు. రుక్మిణీపరిణయము నెవరు రచించినను,
సంజీవరాయకవి అప్పటివఱకు జీవించి యుండెననుట నిర్వివా
దాంశము. వీరనారాయణశతకమును రచించునాటికి కవి యిరువది
యైదు సంవత్సరముల వయస్సు గలవాఁడంటిమేని, రుక్మిణీపరిణయము

నాటికెనుబది సంవత్సరముల వయసువాఁడై యుండును. సహస్ర మాస జీవియగు నీకవి భగవంతునకుఁగూడ వందనార్హుఁడు.

సంజీవకవి విరచితమగు భాగవతైకాదశస్కంధ మొకటి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్నది. అది యీ కవికృతమై యుండుననుకొంటిని కాని విమర్శింపఁగా నాతఁడు నందవరీకుఁడనియుఁ గృష్ణయామాత్యుఁడనియుఁ దెలిసది.



## 363 శేషప్ప కవి.

ఇతఁడు ధర్మపురిరామాయణమును యక్షగానముగ రచియించెను. "భూషణవికాస శ్రీధర్మ పురినివాస దుష్టసంహార నరసింహ దురితదూర" అనుమకుటముతో నొక సీసపద్యశతకమును జేసెను. ఇతఁడు నరహరిశతకము రచించెనని చెప్పుదురు కాని యదిలభింపలేదు. "ధర్మపురినృకేసరీ" యను మకుటముతో నొక శతకమున్నది. ఆశతకకర్త శేషాచల దాసుఁడై నట్లీక్రిందిపద్యములో నున్నది.

ఉ. నే చతురత్వ మేమియుఁగ నీకృపవల్లఁ గవీశ్వరుండనై
తోఁచిన పద్యముల్ ముదముతో రచియించితి తప్పులున్న నీ
వే చెలువారఁ జేసి చిత్తఁబెట్టక కోర్కులనెల్లఁ దీర్చి శే
షాచలదాసు నేలు మునిసన్నుత ధర్మపురీ నృకేసరీ ... ౧౦౮

ఈ శేషాచలదాసుఁడును శేషప్పయు నొకఁడే యనియు, నీరెండు శతకములు నొక్కని రచనములేయనియు, నీశతకపీఠికలో శేషాద్రి రమణకవులు వ్రాసియున్నారు. ఇతరాధారములేమైన లభించిననే తప్ప వారు వ్రాసినది సత్యమేయని యంగీకరింపవలసి యుండును. అట్లయినచో నరహరిశతకమే నృకేసరీశతకమయి యుండును. ఈకవి రచించిన నరసింహశతకమునకు భూషణ వికాస శతకమని నామాంతరము కలదు. ఈశతకకర్త తననామము నీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. శేషప్ప యనుకవి చెప్పిన పద్యముల్
చెవుల కానందమై చెలఁగు చుండు

నేమనుజుండైన నెలమి నీశతకంబు
భక్తితో విన్న సత్ఫలము గలుగుఁ
దెలఁగి యీపద్యముల్ జేర్చి వ్రాసిన వారు
కమలాక్షు కరుణను గాంతు రెపుడు
నింపుగా పుస్తకంబెపుడుఁ బూజించిన
దురిత జాలంబులు దొలఁగి పోవు
తే. నిద్ది పుణ్యాకరంబని యెపుడు జనులు
గష్టమెన్నక పఠియింపఁ గలుగు ముక్తి ... భూషణ ...100

నరసింహ శతకము 100 పద్యములు, నృకేసరిశతకము 108 పద్యములు.

"ఈధర్మపురి నిజాము రాష్ట్రమునందు ఓరుగల్లునకుఁ బంద్రెండామడల దూరమున గౌతమీనదీతీరముననున్న సుప్రసిద్ధమగు నృసింహక్షేత్రము. చిత్రభారతము, పద్మపురాణము, నవీనవసిష్ఠ రామాయణము గ్రంథములలో నీధర్మపురిప్రశంసగలదు. ఆంధ్రులందఱకుఁ దీర్ఘరాజముగానున్న నిజాము రాష్ట్రములోని క్షేత్రములు పెక్కులు యవన పరిపాలనమునకు లోఁబడినపిదప నితర రాష్ట్రవాసుల కగమ్యములయ్యెను. క్రమముగ విస్మృతికి వచ్చెను. అట్టివానిలో సుప్రసిద్ధమగు ధర్మపురిక్షేత్రముగూడ నొకటి"

శేషాద్రి రమణకవులు-

ఈకవి రచించిన మూఁడుగ్రంథములును ధర్మపురితో సంబంధమును కలిగియుండుటచే, నీతఁడు ధర్మపురినివాసియో తత్పరిసర గ్రామనివాసియో యైయుండును. ధర్మపురి రామాయణము నాకు

లభింపలేదు. ఈతని నారసింహాశతకములోని పద్యములను బలువురు పఠించుచుందురు. ఈతని కవిత్వము నిర్దుష్టము కాకపోయినను, మొత్తముమీఁద ధారాశుద్ధికలిగి చక్కని భావములతోఁగూడి మనోహరముగా నుండును. ఈతని శతకములయందు భక్తిరసము ప్రధానము నీతినిబోధించు పద్యములును గలవు. పూర్వమీతని నరసింహా శతకమును పల్లెటూరి బడులలో పాఠముగాఁ జెప్పుచుండెడివారు. ప్రసంగములో నీతని శతకములోని పద్యముల నుదాహరించుచుందురు

శతకములయందలి శైలినిబట్టి యీతఁడు వందికులమునకుఁ జెందినవాఁడని తోఁచుచున్నదని శతకకవుల చరిత్రకర్తలు వ్రాసియున్నారు. గోలకొండకవుల సంచికలో నీతఁడు సాతాని వైష్ణవుఁడని యున్నది. కవి నిజాము రాష్ట్రవాసుఁడు కావున, గోలకొండకవుల సంచికయే యీతని విషయమున ప్రామాణ్యతరమని యెంచఁదగియుండును.

కవిత్వశైలి తెలియుటకై యీతని శతకములనుండి మూఁడేసి పద్యముల నుదాహరించెదను.

నృకేసరీ శతకము:-

ఉ. ప్రొద్దునలేచి నేను కడుబొంకులు బల్కుచు నుందు నోటనా
వద్ద నిజంబులేదు పెరవారి సుఖంబు సహింపలేను నా
బుద్ధి మహావికారపుది భూమిని దుష్టగుణంబులందు నే
పెద్ద దురాత్ముఁడన్ వినుమి పేరుగ ధర్మపురినృకేసరీ ౬౧

ఉ. అంధున కద్దమేమిటికి నందముదప్పిన ముండమోపికిన్
గంధపుఁ బూఁత లేమిటికిఁ గాననమందుఁ జరించుకోతికిన్
సింధుజరత్నమేమిటికిఁ జెడ్డదురాత్మకున్నఁ డైన నీ
గ్రంథపు విన్కి యేమిటికిఁ గట్టిగ ... ౨౦

చ. నరములగుత్తి మల్లొకటి నాఁటినఁ దాళని తోలుతిత్తి న
త్తురుగద దీనినిండ బలుతొమ్మిది చిల్లులుగల్గు కుండ భూ
నరున కిదేమి లెస్స యగు నమ్మిన వారికి లావు ఫిస్సఛీ
మురికిది పాడుమొక్క సుమి ముప్పది ... ౫౨

నరసింహశతకము:-

సీ. కువలయశ్యామ నీకొలువు చేసిన నాకు
జీతమెందుకు ముట్టఁ జెప్పవైతి
మంచిమాటలచేతఁ గాంచి మియ్యఁగ లేవు
కలహమా నీకుఁ జుమ్మి ఖండితముగ
నీవు సాధువుగాన నింతపర్యంతంబు
చనువుచే నిన్నాళ్లు జరుపవలసె
నీకు నే సహింప నీవిపుడు నన్నైన
శిక్ష చేసినఁ జేయు సిద్ధమయితి

తే. నేఁడు కరుణింపకుంటివా నిశ్చయముగఁ
దెగఁబడితిఁ జూడు నీతోడ జగడమునకు ... ౪౨

సీ. ధరణిలో వెయ్యేండ్లు తనువు నిల్వఁగఁ బోదు
ధనమెప్పటికి శాశ్వతంబు గాదు

దార సుతాదులు తనవెంట రాలేరు
భృత్యులు మృతిని దప్పింపలేరు
బంధుజాలము తన్ను బ్రతికించుకో లేరు
బలపరాక్రమ మేమి పనికిరాదు
ఘనమైన సకలభాగ్యం బెంత కల్గియు
గోచి మాత్రంబైనఁ గొనుచుఁ బోఁడు

తే. వెఱ్ఱికుక్కల భ్రమలన్ని విడిచి నిన్ను
భజన సేసెడి వారికిఁ బరమ సుఖము ... ౩౨

సీ. అందఱకైన నిన్నడుగ వచ్చెద రంచు
క్షీరసాగరమందుఁ జేరినావు
నీచుట్టు సేవకుల్ నిలువ కుండుటకునై
భయద సర్పము మీఁద బండినావు
భక్త బృందము వెంట బడి చరించెదరంచు
నగసిపాయ్యెడి పక్షి నెక్కినావు
దాసులు నీద్వార మాసింప కుంటకు
మంచి యోధుల కావలుంచి నావు

తే. లావుఁగలవాడవైతి వేలాగు నేను
నిన్నుఁ జూతును నాతండ్రి నీరజాక్ష ... ౩౦

"ఈకవి క్రీ శ 1800 కు బూర్వుఁడే యైయుండవచ్చును" అని శతకకవుల చరిత్ర కారులు వ్రాసియున్నారు. కవి నివాసము కరీంనగరుజిల్లా ధర్మపురి యనియు, నీతఁడు 150సంవత్సరముల క్రిందట నున్నవాఁడనియు గోలకొండ కవుల సంచికలో దెలుపఁ

బడినది. ఈకవి కులనిర్ణయమున క్రిందిపద్య మేమయినఁ దోడుపడు నేమో చూడవలసి యున్నది.

చ. కలియుగమందు విప్రుఁడనుగాను నృపాలుఁడఁగాను మేటివై
శ్యుల జతవాఁడఁగాను బలుశూరుఁడఁగాను సమస్తమైన జా
తుల నొకరుండఁగాను సుమి దుర్గనుజాంతక నీపదాబ్జముల్
దలఁచెడి వారి దాసులకు దాసుఁడ ధర్మపురీనృకేసరీ రా౫



## 364. పెద్దాడ నాగరాజామాత్యుఁడు

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, గౌతమగోత్రుఁడు, నాగయామాత్య పౌత్రుఁడు; సావిత్రీసూరయామాత్యులకుఁ బుత్రుఁడు; ముంజులూరి పద్మరాజునకు దౌహిత్రుఁడు; వెంకప్ప లక్ష్మీపతి, సుబ్బరాయఁడు గంటలరాయడను వారలీతని సోదరులు.

ఈకవి నివాసము పశ్చిమ గోదావరి మండలములోని భీమవరము తాలూకా యందలి వీరవాసరమను గ్రామము. ఈగ్రామ

మునందిప్పుడును పెద్దాడవారున్నారు. ప్రాచ్యగోదావరి మండల మందలి కాకినాడతాలూకాలో పెద్దాడయను గ్రామమున్నది. అందుపూర్వము పెద్దాడవారుండెడివారేమో కాని యిప్పుడు లేరు. కాని ఆగ్రామమునకు రెండుమైళ్లదూరములో గంగ్రేడు అను గ్రామమున్నది. అందు పెద్దాడ వారున్నారు. వీరవాసరమునుండియే పెద్దాడవారు కొందఱు గంగ్రేడుగ్రామమునకును, కొందఱు మఱికొన్ని యితరగ్రామములకు వెళ్లినట్లు చెప్పుచున్నారు. పెద్దాడగ్రామము నుండియే వీరవాసరము వెళ్ళియుందురని గృహనామమును బట్టి యూహింపఁదగియున్నది. కాని కొందఱందుల కంగీకరించుట లేదు.

కవి తనపూర్వుఁడైన పట్టసమంత్రి వీరాసనగ్రామవాసుఁడై నట్లీక్రిందిపద్యములో చెప్పియున్నాఁడు ఈవీరాసనమే వీరవాసరము.

ఉ. తా సరివారిలో మిగుల ధన్యతఁగాంచి చెలంగె వేదవి
ద్యాభాసుర బంధు మిత్ర జనపుంజము రంజిలఁ జేయుచు న్నిజో
ద్భాసిత సంపదం దనకుఁ బట్టసమంత్రి నిరంతరంబు వీ
రాసన భవ్యనామక పురంబు గరంబది రాజధానిగన్.

ఈకవి శకుంతలాపరిణయమను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచియించి కాశీవిశ్వేశ్వరున కంకితము చేసెను. వేదవ్యాస, కాళిదాస, పినవీరభద్రాదులచే సుప్రసిద్ధమైన కథనే యీకవి తన మధురవాక్యములతో నింపి మఱల ప్రబంధ రూపమున రచియించినాఁడు. కాశీవిశ్వేశ్వరుడు స్వప్నమున సాక్షాత్కరించి.

తే. వత్స! శుభదము పెద్దాడవంశ మతివ
విత్ర మభివందనీయ ముర్వీ స్థలమున

**నందుఁ బ్రభవించి సకలవిద్యావివేక**
**సంపదలఁ బెంపుఁ గాంచిన జాణ వీవు**

వ. సకలజన సంస్తూయమాన మనీషావిశేషంబున నాంధ్రభాష నీవు రచించిన శకుంతలా పరిణయంబను మహాప్రబంధంబు మదంకితంబు గావించి కృతార్థుండవు గమ్మని'' యాన తిచ్చెనఁట

కవి తనవంశావళిని గ్రంథాదియందు నలువది పద్యములలో వర్ణించి యున్నాఁడు. కాని యందు చరిత్రకుపయోగించు నంశములు లేనందున వానిని గూర్చియిట నేమియు వ్రాయలేదు. తనతండ్రియైన సూరనామాత్యుని వర్ణించిన యొక్క పద్యమును మాత్రమిటఁ బొందు పఱచుచున్నాఁడను.

సీ. తుదిఁ గార్శ్య మొందఁడు తొలుదొల్త వసులక్ష్మి
వరసుమనః పరంపరల కొసఁగి
కువలయ ద్వేషంబు దవిలి వర్తింపఁడు
ఘనమార్గ సంచార గరిమఁ గాంచి
దరిలేని భంగపాటొరయఁ డావంతైన
బహుజీవన సమృద్ధిఁ బరిఢవిల్లి
కులగోత్రములవారి చెలువు గుంచఁ డొకింత
ప్రాజ్యసామ్రాజ్య భారము వహించి

తే. యతనితో దానరుచి గభీరతల వైభ
వమున శశి సూర్య వాహినీవర సురేంద్రు
వీఁడె యని రాజసభల నరేంద్రవంద్యు
సూరసచివాగ్రణి నుతించు సూరిజనము

ఈతఁడు పూర్వకవిస్తుతియందు కవిత్రయము వారిని మాత్రమే స్మరించెను. కవిత్వముండవలసినరీతి నీవిధముగా కుకవినిందలో సూచించెను.

చ. పలుకులతేట భావములపద్ధతి పాకము సొంపలంక్రియా
కలన సమానరూఢి రసగౌరవ మర్థము వృత్తి రీతులున్
గలుగ రచించు కబ్బములు కబ్బములెన్నఁగ జల్లిపొల్లుకూఁ
తలు గుదిగూర్చి చెప్పుకవితల్ సరసుల్ విని మెత్తురే మదిన్

కవి యేకాలమువాఁడో తెలియఁదగినయాధారములు గ్రంథమునం దేమియు లేవు. సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనలు, ఋతువర్ణనము మొదలగునవి చేర్చి యీతఁడీగ్రంథమును ప్రబంధశైలిలో రచించెను. కాళిదాసుని యభిజ్ఞానశాకుంతల నాటకములోని శ్లోకముల నాంధ్రీకరించలేదు గాని యందలి భావములను గ్రహించి యాపట్టులను మనోహరముగా నుండునట్లు స్వతంత్రముగా రచించినాఁడు. దుర్వాసశాపవృత్తాంతము నంగుళీయ ప్రదర్శనానంతర పూర్వస్మృతి నీతఁ డిందు వ్రాయక, యాభాగము నాకాశవాణి పలుకులతోఁ బూరించినాఁడు. శకుంతలాదుష్యంతప్రథమ సందర్శనావసరమునఁ గాళిదాసు సృష్టించిన యనసూయాప్రియంవద లిందులేరు. అమృతమయమగు వెన్నెల రాత్రియందుద్యానవనమున నాయికానాయకుల నిరువురి నొంటరిగఁ జేర్చి కథనంతయు నేకాంతముగ నడపినాఁడు. తనజన్మవృత్తాంతమును తెలుపు నెపమున విశ్వామిత్ర మేనకల కేళీవిలాసాదులన్నియుఁ గొంతపచ్చిగా శకుంతలచేతనే దుష్యంతునకుఁ జెప్పించుట పాత్రోచితముగా గన్పట్టదు. గ్రంథములో నాల్గవభాగమాకథతోడనే పూరింపఁబడినది. పదునెనిమిది

వర్ణనములుండవలయునను నుద్దేశముతోఁ గవి యాకథకుఁ బ్రాధాన్య మొసంగియున్నాఁడు. శకుంతలచేత నాకథను చెప్పించుట రసభంగ మగునని కవికిని దోఁచియుండును. అందుచేతనే తనజన్మకథను, కణ్వమహర్షి మఱియొక మునితోఁ జెప్పుచుండఁగాఁ దానువినినట్టును, ఆకథను తెల్పుట కనుమానము కలుగుచున్నను అచ్చట నితరు లెవ్వరు లేనందున తాను చెప్పుచుంటిననియు శకుంతల దుష్యంతు నితో నన్నట్లీక్రిందిపద్యములలో జెప్పియున్నాఁడు.

క. నావిని పతిపల్కుఁ దప
శ్శ్రీవిలసితుఁ డాతఁడూర్ధ్వరేతస్కుఁ డనం
గా వెలయు నట్టి వానికి
నీవెట్టులఁ బుత్రివైతి నిక్కము చెపుమా!

చ. అనవిని యింతి యిట్లను నృపాగ్రణి కొండొకనాఁడహర్ముఖం
బున సకల శ్రుతి స్మృతి సమూహ విచారణ శీలుఁడై వనం
బునఁ బ్రియశిష్యయుక్తముగఁ బొల్పెసలార మునీంద్రుఁ డొక్కెడా
యన కడకేఁగుదెంచె నుదయారుణబింబ విజృంభితద్యుతిన్

ఉ. అంతట పారలిద్దఱు ఖిలాగమ శాస్త్రపురాణచర్చ వే
దాంతరహస్యగోష్ఠి నిరతాత్మకులై యొకచో వసించి ని
శ్చింత నొకింతసేపు తమచెంగట రూపవయోరమా సమా
క్రాంతతనూ విలాసమున రంజిలు నన్గని సంభ్రమంబునన్

క. మాతండ్రికనియె నమ్ముని
యాతన్వి జగన్మనోజ్ఞ శృంగారకళా

స్వీత భవదీయ శుశ్రూ
షాతత్పరవృత్తి దా నిచటవర్తిలెడున్

గీ. అనఘ శమితేంద్రియుఁడవై యలఘుతర త
పోమహత్త్వమునఁ బ్రసిద్ధిఁ బొరయు నియమ
శాలివిదినీకుమారి నాఁజనదు దీని
జనన విధమెద్ది యెఱిఁగింపు వినఁగ వలతు

ఉ. అనవిని యాయన కస్మ
జ్జనకుఁడు నాపుట్టుతెఱఁగు సాంద్రానంతం
బునఁ దానుపన్యసింపఁగ
జననాయక వింటి నేనచలమానసనై

క. వినునది నీకొరులెఱిఁగిం
చిన మద్వృత్తాంత మేనచెప్పుటకు మనం
బనుమానమెనయు నైనను
విను చెప్పెద నేనతక్క వెలయరిట నొరుల్

కవి యెంతగా సమాధానము చెప్పినను, ద్వితీయాశ్వాస మందలి శృంగారవర్ణన మప్రస్తుతమును మహర్షుల ముఖమునగాని శకుంతల నోటఁగాని చెప్పింపఁ దగనిదియునైనట్లు తోఁచుచున్నది.

తనకుఁ గలిగెడి కుమారునకు రాజ్యమొసంగునట్లు వాగ్దత్త మొనర్పుమని శకుంతలయే దుష్యంతుని గోరిన ట్లీక్రిందిపద్యములలోఁ గవి రచించి యున్నాఁడు

ఉ. ఓనరనాథవంశకలశోదధిపూర్ణశశాంక! నీమనం
బేనరయన్ బహూక్తి నలయించితి నింతియ కాని శంకలో
నూనకు నాదు కోర్కి-గలదొక్కటి యవ్వర మీవొసంగి న
న్నైన వరింతు నిన్ను మునియానతిఁగైకొన కీక్షణంబునన్.

క. ఆకోర్కి- వినుము నీకృప
నాకొదవిన సుతుఁ జతుర్వనధివేష్టితభూ
లోకరమా యువరాజ
త్వాకలితుఁగఁ జేయవలయు నన నృపుఁడనియెన్.

క. ఇపుడిచ్చెదఁ గొనుదైవము
కృప నీకొదవిన కుమారుఁ బృథివీసామ్రా
జ్యపదమునకు యువరాజుగ
నిపుణతఁ గావింతు నిదియ నిజము పలికితిన్

చ. అనవిని యింతి యిట్లను నరాధిపవంశలలామ నీయొసం
గిన వర మశ్మరేఖయని కేవల మాత్మఁదలంతుఁ గాని యై
నను బరికింప రాజ్యభరణంబున! గల్గిన వైభవంబు లా
వున హృదయంబున న్మఱతువో యను శంకయొకింతదోఁచెడున్

క. నిను గవయఁగోరి మదనా
స్త్ర నిపీడితచిత్తవృత్తిఁ బ్రాజ్ఞత చెడి ప
ల్కి-న యమ్మాటలు నిజములె
చనుమన నాకెద్ది వెరవు సౌజన్య నిధీ

క. ఇరువురమతాని యొరులె
వ్వరు లేరిచ్చోట సాక్షి వలయు ధరిత్రీ

వరతిలక నీయొసంగిన
వరమున కట్లయిన నమ్మవచ్చు మనమునన్

చ. అనిన విభుండనున్ హిమకరాన్వయ సంజనితుండ సాధుస
జ్జన హితకార్యధుర్యుఁడ నసత్యముఁబల్కుదునే ధరాదిభూ
త నికరమంబుజాప్తహిమధామముఖగ్రహముల్ దిగీశ్వరుల్
గనుఁగొనుచుండఁగా వికచకంజముఖీ మది శంక యేటికిన్.

కాళిదాసమహాకవి వయస్యాముఖమున నిర్వర్తించిన కథా విషయముల నీకవి శకుంతలముఖమునఁ జేయించుటలో నౌచిత్య భంగము గలిగినట్లు భావించినను, నంతమాత్రమున నీతని కవితా రసమందలి మాధుర్యమునకుఁ గొఱత రాలేదని చెప్పవచ్చును.

ఈతని కవిత్వము ప్రౌఢమై సలక్షణమై మనోహరముగా నున్నది. ఈకవి కవిత్వమున సంస్కృతాంధ్రపదములు సమానముగా నుండి పద్యములనర్గళ ధారను కలిగి యున్నవి. శకుంతలా పరిణయమును రచించిన పిల్లలమఱ్ఱి పినవీరన, కృష్ణకవుల గ్రంథము లతో నీతనిది తులదూగుచున్నదనుటకు సందియములేదు. కృష్ణకవి రచనముకంటె నీతనిగ్రంథమే మిన్నయని చెప్పవచ్చును

కవిత్వశైలి తెలియుటకు పైన నుదాహరించినపద్యములే చాలి యున్నను మఱికొన్ని పద్యములను గూడనుదాహరించుచున్నాఁడను.

చ. అని వలమానసూనధనురస్త్రనితాంతవిషాదవేదనం
గనలుచు నీలతాంగి మునికన్యక యేమొకొ యట్టులైన నా

మనమిటులేల మోహరసమగ్నతఁ గాంచు దదాభిజాత్యమా
త్మ నెఱుఁగఁబోలునంచు వసుధావరుఁడంగన డాయ నొయ్యనన్

చ. ఎడపక మారుఁ డిక్షుధనువెక్కిడి తుమ్మెదనారిఁ గమ్మపూ
బెడిదపుఁ దూపులం దనువు బిట్టగలింపఁగ దాల్మి కల్మి గో
ల్పడి యతిదీనవృత్తి వొదలన్ నినుఁడాసితిఁ గూర్మిఁ బ్రోవవే
తడయక పుణ్యమెక్కుడుగదా శరణాగత రక్షణంబునన్

గీ. అనని సిరిగల వాఁడెవ్వఁ డతనియింటఁ
బుట్టఁదగు నాఁడుపడుచులు పుట్టిరేని
నుభయ సంకల్పములు సిద్ధి నొరయుఁ బేద
కునుజనించినఁ గుడుపుగల్గుటయు యరిది

ఉ. అంకతలంబుడిగ్గి వినయాప్తిఁ బ్రణామము లాచరించు నే
ణాంకముఖు న్మునీంద్రుఁడు ప్రియంబునఁ గౌగిటఁ గ్రుచ్చి యెత్తి దృ
క్పంకరుహద్వయీగళదభంగురశోకపయఃకణాళిని
ర్వంకల గోటమీటుచు నవార్య విచార కృశీ కృతాత్మఁడై

మ. తనశిష్యావళి పొత్తునం జనుసుతం దత్పుత్రు దీవించి యి
ట్లనుపం గొండొక దూరమేఁగి హృదయవ్యాలీఢచింతాభరం
బున బాష్పాకుల లోచనాబ్జుఁడయి యూర్పుల్ పైపయిం గ్రమ్మ న
య్యనఘుం డాశ్రమభూమికి న్మరలె నూరార్పన్మునీంద్రోత్తముల్

ఉ. సన్నుత రూపలక్షణ భుజాబల రాజ్యరమావినీతి సం
పన్నిధి నన్నురాగరసమగ్నుఁడవై వరియించి యిష్ట సౌ

ఖ్యోన్నతి మన్వఁజాలక యయో విడనాడఁగఁ జూతురే
"గృహీ-
తన్నపరిత్యజే" త్తనెడు ధార్మిక సూక్తులెఱుంగవే నృపా !

మ. యువరాజై భరతుండు దానిటులు గర్వోదగ్ర నానావిప
క్షవిభుశ్రేణి భుజాబలోద్ధతి రణక్ష్మామండలిం గెల్చి త
జ్జననాశ్వేభ శతాంగ వస్త్రి మణిభూషా ద్రవ్యముల్ దెచ్చి కీ
ర్తివిశాలుండగు తండ్రిమ్రోల నిడి భక్తిన్ మ్రొక్కి నిల్చెన్
సభన్.

ఈకవి కాలమును నిర్ణయించుట కొకయాధారములభించినది. గోదావరిమండలమందలి పోలవరసంస్థానప్రభువగు శ్రీకొచ్చర్లకోట రామచంద్రవెంకటకృష్ణారాయులు, పెద్దాడవంశమున నాగరాజామాత్యునకును, తిరుపతమ్మకును జన్మించి, కొచ్చర్లకోట కామాయమ్మగారిచే దత్తునిగా స్వీకరింపఁబడియెను. ఈనాగరాజునకు మన కవి యగు నాగరాజు పితామహుఁడు రామచంద్రవెంకటకృష్ణారాయప్రభువు, తిరుపతి వెంకటేశ్వరకవిద్వయకృతమగు బుద్ధచరిత్ర మను కావ్యమును గృతి నందియుండెను. అందుఁగృతిపతిని వర్ణించు సందర్భమున నీక్రిందిపద్యములో నాగరాజామాత్యకవి విషయము చెప్పఁబడి యున్నది.

సీ. గౌతమగోత్రవిఖ్యాతు శ్రీపెద్దాడ
వంశజుఁ బెద్దవిద్వాంసుఁడై ది
గంత విశ్రాంతమా గతి శ్రీశకుంతలా
పరిణయమనెడి ప్రబంధమెలమిఁ

జేసిన నాగరాజ్శేఖరు మున్మనుమని
మల్లిఖార్జును మనుమని ఘనుఁ
దనచెల్లెలగు తిర్పతమ్మకు నకలంక కన
ఘుఁడౌ నాగరాజాఖ్యునకుఁ ద

తే. నూజు విద్యలభోజు మనోజతేజుఁ
గలిత కవిరాజు యాచకకల్పభూజు
రామచంద్రవేంకటకృష్ణరాడ్బిడౌజు
డత్తుగాఁ గొనెఁ గామాంబ ధవునియాజ్ఞ.

ఈరామచంద్రవెంకటకృష్ణారాయభూపతి పందొమ్మిదవశతాబ్ది యందంత్యభాగమునను ఇరువదియవశతాబ్దియందు ప్రథమపాదమునను నున్నవాఁడగుటచే, నాతనికి ముత్తాతయగు నాగరాజామాత్యకవి పదునెన్మిదన శతాబ్దియందుఁ దుదిభాగముననో పందొమ్మిదవ శతాబ్దియందు మొదటిభాగముననో నుండియుండు ననుట నిశ్చయము.



# 365 నాదిండ్ల ఉమాపతి

ఇతఁడార్వేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; ఆత్రేయసగోత్రుఁడు; శేషయామాత్య వెంగమాంబల పుత్రుఁడు; వీరయ్యకుఁబౌత్త్రుఁడు, ఇతనికి చిదానందయోగి గురువు.

ఈకవి అద్వైతవేదాంత విషయములనుదెలుపు "చిదానంద యోగమంజరి" యను నొకచిన్న ద్విపదకావ్యమును రచియించెను. అందుఁ దనవిషయము నిట్లు చెప్పుకొని యున్నాఁడు.

"సదయుండు నాదిండ్ల శాసనాంకుండు
కూరిమి వీరఘ కులపవిత్రుండు
నారూఢిఁ దనరు బుధాగ్రగణ్యుండు
అతనిపుత్త్రుఁడు శేషయామాత్యుఁ డనఁగ
నతిపుణ్యుఁ డల వేంగమాంబందుఁ గనియె
సకల విద్యావిచక్షణుండగునట్టి
యకలంకమతి పుణ్యుఁ డనఘచరిత్ర
గుణనిధి యాత్రేయగోత్రపవిత్ర
మణియగు నార్వేలమంత్రి శోభితుఁడు
అసమాధురీ చిత్రయు మితవిస్తార
భాసుర వాక్ప్రౌఢి భావవిచిత్ర
సర్వవేదాంత నిశ్చయరహస్యములు
నుర్విని ద్విపద లోకోపకారముగ
గరిమ నుమాపతి కావింపఁబూనె
నరయఁ జిదానందు లనుమతిసేయఁ

గరుణించరయ్య సత్కవివరులార !
ధరణిలో నాచంద్రతారార్కముగను.

ఈకవినివాసము గుంటూరుమండలములోని నరసారావుపేట తాలూకాయందలి నాదిండ్ల యైనట్లును ఆగ్రామమున కీతనివంశము వారు కరణములైనట్లును దెలియుచున్నది. శ్రీకృష్ణదేవరాయల యొద్ద మంత్రిగానుండు సాళువతిమ్మరుసు మేనల్లురగు నాదిండ్ల అప్పయమంత్రిగోపనామాత్యు లీకవికిపూర్వులేమో ! వారినిగూర్చి యీగ్రంథమున నేమియుఁ జెప్పఁబడలేదు. ఈకవి కాలనిర్ణయము చేయుట కాధారము లభింపలేదు. పదునెనిమిదవశతాబ్దివాఁడై యుండును.



# 366 నల్లాని నృసింహాచార్యకవి.

ఇతఁడు శ్రీవైష్ణవుఁడు; కౌశిక గోత్రుఁడు, నృసింహాచార్య పుత్రుఁడు. ఈకవి పద్మినీపరిణయమను నాల్గాశ్వాసములశృంగార ప్రబంధమును రచియించి మర్లపూడినివాసులగు కాకర్లపూడిగోపాల రాజుగారి కంకితముచేసెను. మర్లపాడునందున్న గోపాలస్వామి యీకవికి స్వప్నమునఁ బ్రత్యక్షమై నీలాదేవిని, విష్ణుచిత్తునికుమా ర్తెను దాను బరిణయమాడినకథల నిదివఱకుఁ గవులు వర్ణించి యుండిరి కాని యగ్రసతియైన శ్రీమహాలక్ష్మినివివాహమాడిన కథ నెవ్వరును రచియింపలేదు కావున నాలోపమును బూర్తిచేయుమని యానతిచ్చుటచే నీతఁడే పద్మినీపరిణయమును రచించితినని యీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

చ. అమర నదీప్రవాహగతి నద్భుతమా కవితావిశేషమ
శ్రమమునఁ బుట్టుటిమ్మహి నశక్యము నంతట మామకప్రభా
వముఁగొనియాడుబుద్ధి మదినశ్యము జేయుట దుర్లభంబు మ
త్సమధికచర్య సన్నుతిడఁదల్చితి వాపని కేను మెచ్చితిన్.

చ. వినుము కుమార తొల్లిటి కవిప్రజనాథులు నేను విష్ణుచి
త్తునిసుతఁ బెండ్లియాడుట మృదుస్థితి నీళఁ బరిగ్రహించుట
వినుతి యొనర్చి రగ్రసతి నిర్మల సద్గుణ పద్మినీకుమా
రిని గొనుటన్ రచింపరు ధురీణత నక్కథ విస్మరింపుమా !

విష్ణుచిత్తీయమును రచించిన శ్రీకృష్ణదేవరాయలును, నీలా సుందరీపరిణయమును రచించిన కూచిమంచితిమ్మకవి సార్వభౌముఁ డును, ఈపద్యమందలి కవిప్రజనాథులై యుందురు.

కృతిపతి పలికిన వాక్యములుగా నీక్రిందిపద్యములలోఁ గవి తనను గూర్చి చెప్పుకొనియున్నాఁడు.

సీ. భాగవతాది ప్రబంధ గీర్వాణాంధ్ర
భాషామయ శ్లోకపద్యములను
ప్రత్యక్ష బాహాట పాంచాల రీతిగాఁ
జదువుటచేఁ దదక్షరవిలేఖ
నమునఁ దదర్థముల్ నవరసయుక్తిగాఁ
బలుకుటచేఁ గావ్యఫణితి వలన
శబ్దశాస్త్రద్వయ సకలఛందో పూర్వ
నాటకాలంకరణ ప్రరూఢి

గీ. నుభయ భాషాకవిత్వాద్భుతోరుశక్తి
భువన మోహన సంగీత పూర్తిచేత
స్వమత సిద్ధాంత మార్గవిచారమునను
ప్రథితుఁడవు నీకు నుపమింపఁ బరులు గలరె !

చ. సర్వనృపాలశేఖరు నిఁజాంధ్రధరాధిపుఁ గాంచి తద్బుధా
ఖర్వ సభాంతరంబునఁ బ్రకాశగతిన్ గృతులన్ రచించి దృ
క్పర్వముగాఁగ నమ్మనుజభర్త యొసంగిన రూపికాసహా
స్రార్యమణి ప్రభూషణము లందితి గాదె నృసింహసత్కవీ !

ఈపద్యమునందుఁ జెప్పఁబడిన సర్వరాయ చంద్రరాయ లెవ్వరో తెలిసికొనవలసియున్నది కవి తనను గూర్చి చెప్పుకొనిన పద్యము లింకను కలవు గాని యందు చరిత్రకుపయోగించు నంశములు లేనందున గ్రంథవిస్తరభీతిచే విడచివైచితిని.

కృతిపతిని వర్ణించిన పద్యములలో నొకదాని నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. ప్రాగ్దేశపతి బంపు పటకుటీరము లాత్మ
రమణుని ఛత్రధారణము దెల్ప
నలబొబ్బిలిక్ష్మాపుఁ డంపిన కీరముల్
నాథుని విజ్ఞాపనములు బల్క
నుత్తరాధీశ్వరుఁ డొసఁగిన మసలందు
పతికి మాఱంఘ్రులు ప్రాపు నొంద
జగదీశుఁ డొసఁగు కాంచన పుత్రికలు నాథు
బదిలీగఁ జామర ప్రతతివీవ

గీ. నసమ సుమహిత వన విసర శీత
వాత పోతము లాతత ప్రీతిఁ గూర్ప
సకల సామంత నృపవర సకల విబుధ
సకల వరగాయకులు గొల్వ సభను దీర్చి

ఇందుఁ గృతిపతి నొక్క పెద్దభూపతిగా వర్ణించినను నీతఁడొక చిన్న మొఖాసా కధికారియై యుండునని తోఁచుచున్నది. పద్యాంతములలో

క. "కాకర్లపూఁడి వంశ
శ్రీకరునకు మర్లపాటి చిరనగరీస్థ
లోకునకు వసిష్ఠసగో
త్రాకర గోపాల మన్నెహం వీరునకున్

అని చెప్పియుండుటచే నీతఁడు మర్లపాడుగ్రామనివాసియనుట స్పష్టము. ఈమర్లపాడు విశాఖపట్టణమండలములోనిదిగా గన్పట్టు

చున్నది. ఆశ్వాసాంతములయందు రచయిత పేరు తెలుపుగద్యలే కాకుండ నొక్కొకపద్యమును గూడనీక్రింది రీతిగా వేసికొనినాడు.

మ. ప్రథితానేక చమత్క్రియా ఘటకుఁడాంధ్రస్వప్నభాషాకవి
త్వధన శ్రీమహితుండు భాగవత సేవా ప్రజ్ఞ నల్లాని గో
త్ర ధురీణుండు నృసింహదేశికుఁడు నిర్మాణంబు గావించె నీ
ప్రథమాశ్వాసము పద్మినీపరిణయ ప్రఖ్యాత కావ్యంబునన్.

మ. అమితశ్లేషపదార్థపుష్టి సదనుప్రాస ప్రజాలంక్రియా
సముదాఘూర్ణిత కావ్యభవ్య ఘటన స్తవ్యుండు నల్లాని వం
శమణీంద్రుండు నృసింహదేశికుఁడు వాంఛావృత్తిఁ జేసెన్ చతు
ర్థము నాశ్వాసము పద్మినీపరిణయోద్దాజత్ప్రబంధంబునన్.

ఈకవికాలమును దెలిసికొనుట కాధారములేవియును గ్రంథమున గన్పట్ట లేదు. ప్రతిలేఖకుఁడయిన రాయసం సుబ్బయ్య కాకర్లపూడి గోపాలరాజుగారికి ప్రమాదీచ సంవత్సర కార్తీక శు ౨ గురువారం ఉదయమైన రెండుఝాములకు వ్రాసి యిచ్చినట్లు వ్రాసియున్నాఁడు. ఇందుదాహరించిన గోపాలరాజుగారు కృతిపతియే యైన యెడల కవికాలము నదియే యగును. ఈదినము క్రీ.శ. ౧౭౫౩ సంవత్సరము నవంబరు మూఁడవ తేదీయైనది. కావున నీకవి కాలమదియనియే నిశ్చయింపవచ్చును.



# 367 కళువె నంజరాజు

ఇతఁడు క్షత్రియుఁడు; కాత్యాయనసూత్రుఁడు; భారద్వాజ గోత్రుఁడు; ఋక్శాఖానువర్తి; దొడ్డరాజుపౌత్రుఁడు; వీరరాజ పుత్రుఁడు.

ఈకవి స్కాందపురాణమందలి యగస్త్యసంహితాప్రతిపాదితంబగు హాలాస్యమాహాత్మ్యమును వచనమున రచియించియుండెను. ఈగ్రంథము డెబ్బదిరెండధ్యాయములుకలది. మధురహాలాస్యమాహాత్మ్యమే యిందు వర్ణింపఁబడినది. ఈతనితండ్రియుఁ దాతయు మైసూరు రాజునొద్ద సేనాధిపతులుగా నున్నవారు. ఈకవితండ్రియైన వీరరాజు శ్రీమహాభారతమును వచనకావ్యముగా రచియించియుండెను. అతని చారిత్రము నీగ్రంథమున వేఱుచోట వ్రాసియున్నాఁడను. ఈతని వంశచారిత్రమునుగూర్చి ఆచారిత్రమునఁ జదువనగును.

ఈకవి కాశీమహిమార్థదర్పణమను నింకనొక వచనకావ్యమును రచియించియుండెను. అందు కాశీమహిమ వర్ణింపఁబడినది. హాలాస్యమాహాత్మ్యమువలె నీవచనము ప్రౌఢముగాలేదు. వ్యావహారిక భాషలో వ్రాయఁబడినది.

హాలాస్యమాహాత్మ్యము గరణనగరమందలి నంజుండను దేవున కంకితముచేయఁబడిన ట్లీక్రిందిపద్యమువలనఁ గన్పట్టుచున్నది.

శా॥లిని:- హారిణపరశుహస్తా అంచితౌజః ప్రశస్తా  
సరసిజ భవవంద్యా సర్వలోకాభినంద్యా

పరమ శుభచరిత్రా భాసమాన త్రినేత్రా
గరణనగరవర్తి క్రమనంజుండ వర్తీ.

ఈగరణనగరము మైసూరురాష్ట్రమునందుండనోపును. ఈ క్రింది గద్యవలన కవిసంగతి తెలియుచున్నది.

గద్య:- ఇది శ్రీభారద్వాజగోత్రాభిరామ ఋక్శాఖానువర్తిమహిసూర సేనాధిపతి కళువె దొడ్డమహీపాలపౌత్ర వీరరాజపుత్ర విద్వజ్జన కల్ప భూజ నంజరాజ ప్రణీతంబగు హాలాస్యమాహాత్మ్యంబు సర్వంబును డెబ్బదిరెండవ అధ్యాయము.''

ఈతఁడు క్రీ. శ. 1730 సంవత్సరమునందున్నవాఁడు ఇతఁడు 'విష్ణుభక్తవిలాసము, హరభక్తవిలాసము' అను రెండాంధ్రవచన కావ్యములను రచించినట్లు తెలియుచున్నది. కాని నా గ్రంథములు లభింపలేదు. కర్ణాటభాషయందు ''భారతేతిహాసమును'' గూడ రచియించెనఁట.

"నంజరాజయశోవిభూషణ'' మనుపేర నొకయలంకార గ్రంథ మును, అభినవకాళిదాసబిరుదాంచితుఁడగు నృసింహాకవి రచించి యీతనికిఁ గృతియొసంగెను. ఇది ప్రతాపరుద్రీయమునంటి యలం కారగ్రంథము. ఇతఁడు తనతండ్రియగు వీరరాజును, దనసోదరుఁడగు దేవరాజును, ఈక్రిందిపద్యములలో హాలాస్యమాహాత్మ్యమున వర్ణించి యున్నాఁడు.

ఉ. ఆదళవాయి దొడ్డవసుధాధిపమౌళికిఁ గల్గె సజ్జనా
హ్లాదకరుండు షోడశమహాద్భుత దానధురంధరుండు తే

జోదిననాథుఁ డంచిత యశోధనలీకృత సర్వదిక్తటుం
డాదినృపాల సన్నిభుఁ డుదారుఁడు వీరన రేంద్రుఁడున్నతిన్.

శా. దీనత్రాణ పారాయణుండగుచు సంతే విశ్రుతుండైన యా
సేనాధీశ్వర దేవభూవిభుఁడు కాశీంఖానమాద్యన్మలా
ఖానాద్యుద్భట యావనాధిపుల సంగ్రామంబునంగూల్చి ఢి
ల్లీ నాథాదులకెల్ల నచ్చెరువు గొల్పెన్ ధారుణీ మండలిన్

క్రీ.శ. 1731–1734 సంవత్సరములలో మైసూరుసింహాసనము నధిష్ఠించిన చామరాజున కీదేవభూవిభుఁడు దాయాదియనియు, చామరాజునీతఁడే చెరసాలలోనుంచెననియు స్యూయెల్ వ్రాసి యున్నాఁడు. దీనినిబట్టి యీనంజరాజు క్రీ. శ. 1730 ప్రాంతమున నున్నవాఁడని నిశ్చయింపవచ్చును. ఈకవినివాసము మైసూరురాష్ట్ర మనుట నిశ్చయము.



# 368 తుళ్లూరు శరభరాజు

ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; వీరనార్యుని పుత్రుఁడు, తల్లిబాపమ్మ; మంచిగంటిబ్రహ్మయ్య మాతామహుఁడు; అమ్మయ్య, బుచ్చయ్య, వియ్యన్నలు తమ్ములు. అబ్బరాజు బుచ్చమ్మల కీకవి పౌత్రుఁడు.

ఇతఁడు శృంగారసుధార్ణవము, ప్రజ్ఞావతీరాయభారము, లవలీ వివాహము, భాగవతాభ్యుదయము, కాళిందీపరిణయము, శరభ రాజీయము, ఇంక ననేకశతకములు రచియించినట్లు శరభరాజీయము నందలి యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. శయ్యాచమత్కారసరసతఁ గూర్చితి
మహిని శృంగారసుధార్ణవంబు
పాకభేదముల నేర్పడఁ బల్కితి వినుతి
సేయఁ బ్రజ్ఞావతీ రాయభార
మవలీల రచియించి, తౌనన లవలీవి
వాహంబు కవిరాజ వర్ణితముగ
సరసు లుప్పొంగగా సమకూర్చలేదె భా
గవతాభ్యుదయ మనుకావ్య మొకటి

బల్కితివి వేడ్కఁ గాళిందీపరిణయంబు
పార్వతీనాథవిష్ణులఁ బ్రస్తుతించి
శతకము ల్పెక్కుగూర్చితి శరభరాజ
యెన్నసామాన్యకవివె కవీంద్రమహాళి!

శరభరాజీయము తప్ప తక్కిన గ్రంథములు ముద్రితము కాలేదు. అవి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నైన నున్నట్లు గన్పట్టదు. మొదటిమూఁడు గ్రంథములలోనివిషయము లైనను గ్రంథనామములనుబట్టి స్పష్ట మగుట లేదు. శరభరాజీయము వైద్య శాస్త్రము. దీని నితఁడు సంపూర్ణముగా రచియింపక పూర్వమే కాల మాసన్నమైనందున దనకుమారుఁడైన మాధవకవిని పిలిచి గ్రంథమును బూర్తి చేయు మని చెప్పినట్లును, దాని నావిధముగాఁ బూరించితినని యు మాధవకవి యీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. మామకజనకుండు మదనారిసదృశుఁడౌ
శరభాహ్వయుండు నీశాస్త్రమందు
పదునాల్గుపద్ధతు ల్బాగుగా విరచించి
యొకనాఁడు ననుఁజూచి యోరిపుత్ర!
మాధవాహ్వయక! మర్త్యసుఖం బొల్ల
భూతేశుఁ జేరఁగాఁబోదు నీవు
కడమపద్ధతులను నుడువు కోటీశ్వరు
కరుణచే నీకబ్బు కవితఁ జెప్పఁ

శక్తి యనుచు నతులసత్కృప బోధించి
కాలకాల! ధృతకపాల! శర్వ!
శివ! మహేశ! శూలి! శ్రీకంఠ యనుచును
దనువు విడిచి శివపదంబుఁ జేరె!

శరభరాజకవి తనగురువుల నీక్రిందిపద్యములోఁ గీర్తించి యున్నాఁడు.

సీ. కావ్యనాటకములఁ గఱపె నడింపల్లి
మంగళాద్రిసమాఖ్యమంత్రివరుఁడు
వికృతిశాస్త్రార్థప్రవీణునిఁ గావించె
కావూరిసంజీవరసికమౌళి
జ్యోతిషమార్గంబుఁ జూపెఁ బురాణము
వంశజపౌంటుదైవజ్ఞమూర్తి
మంత్రకోవిదుఁ జేసె మన్నించి శ్రీముది
గొండబుచ్చయయాహ్వగురువరుండు

గీ దివ్యనామకపద్యోప దేశి దేశి
కేంద్రుల నుతించి నతిఁజేసి హృదయసీమ
వారిపదపద్మములు నిల్పి వన్నెకెక్కఁ
గృతియొకటిచెప్పఁబూనఁగా మతి దలంచి.

ఈకవి కిరువురుభార్యలయిన ట్లీక్రిందిపద్యములోఁ జెప్పి యున్నాఁడు.

చ. ధర ముదిగొండబుచ్చయవదాన్యునిపుత్రిక శాయమాంబ శీ
లరసిక రుంటముక్కలకులప్రభ వాప్పయమంత్రిరాడ్గుణో
త్తరుసుత వెంకమాంబయు ముదంబున నన్వరియింపఁ బెండ్లియై
శరభసమాఖ్యుఁ గైకొని నిజప్రియకాంతలఁ గూడియుండఁగన్

కవికి మంత్రగురువైన ముదిగొండబుచ్చయారాధ్యుని కుమార్తెయే ప్రథమభార్యయైనశాయమాంబయైనట్లు కన్పట్టుచున్నది. శాయమాంబను బరిణయమాడినపిమ్మటనే బుచ్చయారాధ్యుఁడు

మంత్రగురువై యుండును. కవి శరభరాజీయమును రచించునాఁటికి మనమల నెత్తియున్నట్లు వ్రాసికొనియున్నాఁడు. గ్రంథవిస్తరభీతిచే నాపద్యముల నుదాహరింపలేదు. ఈకవి కప్పటికి డెబ్బదియేండ్లు దాటిన వయసుండియుండును.

ఓరుగల్లు నేలిన ప్రతాపరుద్రమహారాజుకడ మంత్రిగా నున్న శివదేవయ్య యీకవివంశమునకు మూలపురుషుఁడైన ట్లీక్రిందిపద్యములలోఁ జెప్పుకొనియున్నాఁడు.

సీ. శ్రీమదష్టాంగప్రసిద్ధయోగాభ్యాసి
ధరనోరుగంటి సత్పురనివాసి
ప్రాణలింగార్పితభావసంచయమాళి
యజ్ఞానతిమిరసంహారహేళి
బుధజనసన్మిత్రి పోష్యదయాశాలి
శోభితాశాంత యశోవిశాలి
యమలశ్రీవత్ససంయమిగోత్రపావని
వర్ణితసకలవిద్యాన్నిధాని
గీ. సంతతోల్లాసి దిననాథసమవిభాసి
రహితదుష్కర్మి నిత్యసన్మహితధర్మి
యనఁగ నుతికెక్కె శివదేవుఁ డనదు యోగి
నాయకుండు సదామోక్షదాయకుండు

చ. అతఁడు ప్రతాపరుద్రవసుధాధిపుచేత నవాగ్రహారముల్
హితమతి నంది నిత్యశుచివేశ్వరసంతతి కెల్ల మేటియై
యతులితసంస్కృతాంధ్ర కవితావలికెల్ల బితామహుండనన్
సతతము వన్నెకెక్కె బుధసంఘములోన మహాప్రసిద్ధుఁడై.

కొమిరెపూడియందున్న శ్రీయాంజనేయస్వామి స్వప్నమునఁ గన్పడి యీవైద్యశాస్త్రమును రచింపుమని చెప్పినట్లు కవి యీ క్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

సీ. శార్ఙ్గధరభేషజకల్పవాహటాది
వైద్యశాస్త్రములు గీర్వాణభాష
నార్యులు వచియించి రందలియర్థంబు
ప్రాకృతులకు బోధపడదు గాన
పద్యంబులు తెనుంగుబాస నేర్పరచిన
సకలజనులకు మోదకర మొసఁగు
సర్వవైద్యగ్రంథసారంబు దీసి త
త్కావ్యంబులోనుంచి శ్రావ్యముగను.

గీ శరభరాజీయమనుపేర శాస్త్ర మొకటి
కల్పనముఁజేసి మత్కృతిగాఁగఁ దలఁచి
యొసఁగు శుభములు నీకగు నుర్విలోన
సాధుసంతాన శరభరాజప్రధాన

కవిపూర్వులలో నొకఁ డగుసర్వపామాత్యుఁడు తుళ్లూరులో మిరాసిసంపాదించుటచే నప్పటినుండియు నివంశమువారు తుళ్లూరు వారైన ట్లీక్రిందిపద్యములలోఁ గవిచెప్పియున్నాఁడు.

క. అవిభువంశంబునఁ గుల
పావనుఁడై పుట్టి సర్వపార్యుఁడు బుధసం
సేవితుఁడై మతికెక్కెను
భావజసంహారుని కృపను ప్రభువులసభలన్

క. ఆరసి కామామాత్యుఁడు తు
ళ్లూరుమిఁ రాసి గొనుట నుర్వీస్థలిఁ దు
ళ్లూరువారందు గొందఱు
సూరు లనిరి నాటనుండి శుభ మిగురింపన్

ఈసర్వపామాత్యుఁడు మొదలుగాఁ గవివఱకును తనవంశావళిని ౧౫ పద్యములలోఁ గవివర్ణించియున్నాఁడు గ్రంథవిస్తరభీతిచే వానినిందుదాహరింపలేదు. ఈతని కవిత్వశైలి తెలియుటకై నాల్గు పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

మ. హరవీర్యాభ్రక కాంతభస్మములు సమ్యగ్గంధకంబున్ సమాం
శ రహింగూళ్ళ పునర్నవామృతత్రివృత్క్షారంబులన్ మూఁడునా
ళ్లిరవొప్పన్ మధియించుచున్ లఘుపుటంబింపారగాఁ బెట్టినన్
సరసంబై తగు వాతరాక్షసమగున్ సర్వామయధ్వంసియై.

ఉ. రోగనిదానవేళల నిరూఢముగా ఘృతలేహ్యచూర్ణముల్
బాగుగఁ జెప్పగావలసి ప్రస్తుత మిక్కడ కొద్దికొద్దిగా
నే గణుతించి చెప్పితిని యిచ్చట మాత్రము మీరు స్వల్పసం
యోగములంచు నెంచి తలయూచకుఁడీ బుధులార వేఁడెదన్.

ఉ ఘాతము రాగిభస్మమును శొంఠి మరీచము తారముల్ త్రయం
బాతత నుప్పులైదును సమాంశల నార్ద్రిరసాన వాలుకా
చేతను కుప్పివండి యదిచల్లగుచో దశమూలచూర్ణసా
పేతముతోడ నార్ద్రిక ము బెట్టి రయిసంగ గుణంబగున్మహా
శీత తను త్రిదోషము ప్రసిద్ధ ప్రతాపకుమారమెన్నగన్.

చ. ఘన శిశికంఠవీర్యమును గంధక తాళక వత్సనాభ టం
కణ కటికత్రయంబు సరిగాగను హింగుళ మన్ని యొత్తు నే
ర్పున నిడి శాకరాజరసమున్ మృదులార్ద్రక వారినూరి వెం
టనుగొన తాపమార్చు తరుణజ్వరకేసరి ధారుణీస్థలిన్

ఈకవి గుంటూరు మండలములోని కొమిరెపూడి నివాసుఁడు. ధావూరి సంజీవకవి యీతనిగురువు. కావున నీతఁడు క్రీ.శ. ౧౭౩౦-౫౦ ప్రాంతములో నున్నవాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.



# 369 అల్లంరాజు రంగధామకవి

ఇతఁడారామద్రావిడ బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; హారితస గోత్రుఁడు; రంగధామార్యపౌత్రుఁడు. ఎల్లనార్యపుత్త్రుఁడు. ఈకవి నారాయణాచలమాహాత్మ్యమును రచియించి, ఎనుముల చినబాపన్న దొరకంకితము చేసెను. కృతిపతినారాయణాచలమాహాత్మ్యమును రచింపుమని ప్రోత్సహించినట్లు కవి యీక్రిందిపద్యములలోఁ జెప్పుకొనియున్నాఁడు.

మ. ప్రియవాక్చాతురి మేర మీఱి యలరన్ శ్రీసూర్యనారాయణా
శ్రయు నన్నల్లమరాజు వంశభవు నార్యస్తోమ సేవారతున్
నయమార్గాన్వితు రంగధామసుకవి న్రాజన్యపూజ్యున్ మహో
భయభాషాకవితాప్రగల్భు నెనరొప్పంజూచి పల్కెం గృపన్

క. మిత్రుఁడవు మాకు పరమ ప
విత్రుఁడ వతిమధురమృదుకవిత్వశ్రీకిన్
బాత్రుఁడవు కృతిరచింపుము
ధాత్రిన్ గుణసాంద్ర రంగధామకవీంద్రా !

ఆ. భువియశంబును దివిభోగంబు నిచ్చును
సరసకావ్యకన్య వరకవులకుఁ
దదనువల్లభునకుఁ దండ్రికి నిహపర
వివిధ సుఖము లొసఁగు వెలఁది వోలె

శా. నానానూన పురాణగాథలును వింతల్ గాఁగఁ గన్పట్టు మా
కైనన్ మద్భుజపాలితప్రకట రాజ్యస్థాయియై సంతత

శ్రీనారాయణశైల రాజశిఖరక్రీడాకళాలాలసుం
డౌ నవ్వేంకటదేవు పుణ్యకథ బాయం జాల దస్మన్మతిన్.

ఈకవిని గూర్చి శతకకవుల చరిత్రకారులిట్లు వ్రాసియున్నారు. "అల్లమరాజువారారామద్రావిడ బ్రాహ్మణులు. వీరిది హారితస గోత్రము, ఆపస్తంబసూత్రము. వీరిలోఁ గవులు చాలమందికలరు. మన మెఱిఁగియున్నంతలో బాపయకవి పూర్వుఁడు. ఇతఁడు గౌతమీ మాహాత్మ్యము వ్రాసెను. ఇదియంత మంచికవనము కాదు. ఇతఁడు క్రీ. శ. ౧౭౩౫ ప్రాంతములవాఁడు. ఇతనికొడుకు ఎల్లన్న. ఎల్లన్న కొడుకు రంగధాముఁడు. ఈతఁడు నారాయణాచలమాహాత్మ్యమును వ్రాసెను. ఈతనికొడుకులలో రామకృష్ణ, సుబ్రహ్మణ్యకవులు పెక్కు గ్రంథములువ్రాసిరి. వీరితండ్రియైన రంగధాముఁడు నారాయణాచల మాహాత్మ్యమును వ్రాసి చినబాపభూపునకుఁ గృతియిచ్చెను. ఇది మూఁడాశ్వాసముల గ్రంథము. ఇతఁడు విజయనగరప్రభువగు నారాయణగజపతిగారిపై నెనిమిదర్థములచాటుపద్యముల వ్రాసెనఁట! ఇతఁడు ద్రోణాచార్యులనలె సాము గరిడీలు చేయుచు వింజరమను గ్రామములోఁ గొందఱు క్షత్రియుల కావిద్యలు కొంతకాల ముపదే శించుచు శరీరపారిశ్రామికగురువుగా నుండెను. ఇతఁడఱువదిసంవత్సర ములప్రాయమున నిప్పటికి ౭౫ సంవత్సరముల క్రితము మరణించెనని తద్వంశీయులనుచున్నారు"

శతకకవులచరిత్ర ౧౯౨౫లో ప్రకటితమయినది. పైవాక్య ములను బట్టి రంగధామకవి క్రీ.శ. ౧౭౯౦ ప్రాంతమున జన్మించి ౧౮౫౦ ప్రాంతమునఁ గాలధర్మమునొంది యుండును. రంగధామకవి తాతబాపయార్యుఁడైనట్లును, అతఁడు గౌతమీమాహాత్మ్యమును

రచించినట్లును శతకకవులచరిత్రకారులనుచున్నారు. నారాయణాచల మాహాత్మ్యములోని యీక్రిందిగద్యనుబట్టి యీకవిపితామహుఁడు రంగధామార్యుఁడు కాని బాపయార్యుఁడుకాఁడు.

"ఇది సూర్యనారాయణ కరుణాకటాక్ష వీక్షణోపలబ్ధ సరస కవితాపాత్ర హారితసగోత్ర శ్రీమదల్లమరాజు రంగధామార్యపౌత్ర వినయవిద్యావైభవ యెల్లనార్య తనూభవ సకలసుకవిజనవిధేయ రంగధామనామధేయ ప్రణీతంబైన శ్రీనారాయణాచల మాహాత్మ్యం బను మహాప్రబంధము"

తనపూర్వులు గౌతమీమాహాత్మ్యమును రచించినట్లీతఁడు చెప్పియుండలేదు. గౌతమీమాహాత్మ్యము అముద్రితాంధ్రగ్రంథ సర్వస్వమునఁదున్నదని యాసంపాదకులు నారాయణాచలమాహాత్మ్య పీఠికలో వ్రాసియున్నారు. కాని నాకాగ్రంథము లభించలేదు. ఆగ్రంథమును జూచినఁ గాని యీసంశయము తొలఁగఁజాలదు. ఈకవి యొక్క నివాసము గోదావరిమండలములోని పిఠాపురమునకు సమీపముననున్న చేబ్రోలనుగ్రామము. ఈకవి తనయులైన రామకృష్ణ సుబ్రహ్మణ్యకవులు బహుగ్రంథరచనాధురీణులు. వారిని గూర్చి వేఱుగా వ్రాయుచున్నాఁడను.

కృతిపతియైన యెనుములచినబాపనదొర శూద్రుఁడు. వీరిని వంటరులని పిలచెదరు. వంటరులు పౌరుషమే ప్రధానముగా గలిగి పరాక్రమముతో జీవించు వారుగనున్నారు. రాఘవరాజుసీమ కీవంశీయులు పరిపాలకులుగా నున్నారు. కృతిపతివంశమును ఆవంశీయుల బలపరాక్రమాదులను గవి తొంబదిపద్యములలో వర్ణించియున్నాఁడు. కాని యందుఁ జరిత్రాంశములంతగా లేవు. రాఘవరాజుసీమను బరి

పాలించిన వారిలోఁ గృతిపతి యేఁడవవాఁడు. పరిపాలకులేడుగురి నామములను గవి యీ క్రింది సీసపద్యములోఁ బేర్కొనియున్నాఁడు.

"వ. ఇవ్విధంబున నుత్తరోత్తరాభి వృద్ధులన్ బ్రబలుచున్న యెన్మలకుల రత్నాకరంబున నమూల్యప్రభురత్నంబులనన్ జనియించి శ్రీరాఘవ రాజసీమామహారాజ్యపూజ్యసింహాసన సుఖాసీనులై ధర్మమార్గంబు వెలయం బ్రజాపరిపాలనంబొనరించి మించు మహానుభావులం గ్రమంబున వివరించెద.

సీ. శ్రీవల్లభాంశచే భావనదొరపట్టి
యగు జగ్గపతి ప్రథమాధికారి
యామహామహునకు నౌరసపుత్రకుం
డగు మల్లుదొర ద్వితీయాధికారి
యామహీవిభునకు నాత్మజుండై మించు
నలజగ్గపతి తృతీయాధికారి
యతని జ్యేష్ఠపితామహ కనిష్ఠపౌత్రుఁడు
రాజన్నదొర చతుర్థప్రభుమణి
యాతృతీయాధిపుఁడగు జగ్గవిభుసూను
మల్లుదొర పంచమాధికారి

గీ. తత్కనిష్ఠపితామహనప్తయా
నలబాపనృపతి షష్ఠాధికారి
యాధరావల్లభాగ్రణి యనుజుఁడైన
జగ్గపప్రభుసుతుఁడు రాజన్న సుతుఁడు
చిన్నబాపన భూపాలశేఖరమణి
యాధునిక కృతిపతి సప్తమాధికారి

ఈరాఘవరాజుసీమ గోదావరి మండలమందలి పెద్దాపురం తాలూకాలోఁ జేరిన మన్యపు గ్రామములు. ఈరాఘవరాజు సీమవృత్తాంతమును దెలుపుకై ఫీయతును ఈక్రిందనుదాహరించుచున్నాఁడను.

పెద్దాపురముకు వుత్తరభాగమున పంన్నెండుక్రోసుల దూరమున జంగిలిపట్టిని కొండలమధ్య కొంన్ని కొంన్ని చిల్లరపల్లెలు వుంటూవుండగా అక్కడికి రాఘవరాజు అనే ఆయన పదిమంద్ని స్తోమతు చేస్కొని ప్రవేశించ్చి ప్రబలుడై కొండ్లపల్లెలు అరణ్యప్రదేశము స్వాధీనంచేసుకుని అక్కడవాళ్లవల్ల చిన్నపల్లెకు వరహాచొ॥ పెద్దపల్లెకు రెండేసివరహాలుచొ॥ పుచ్చుకుంటూ హాకముల (అధికారులు) తర్పునవచ్చినవారివద్దకివచ్చి మంచ్చిమాటలు ఆడుకుంట్టూవుండేవారు. అప్పటిలో తురుష్కులఅధికారం అగుటచేత యెవరైనను పరాక్రమవంత్తులు బుద్ధిమంత్తులు అయితేవారు కొన్ని గ్రామములు ఆక్రమించుకోవడమున్ను వారే ఆప్రదేశముకు అధికారులు అయివుండడంచాతనున్ను రాఘవరాజు అనే ఆయన అక్కడ రాజవొమ్మంగ్గి అనే గ్రామంలో నివాసంచేసుకుని వుండ్డడంచేత అతను ంఆక్రమించుకుంన్న పల్లెలుకు రాఘవరాజుసీమఅనే వకప్రసిద్ధినామం యేర్పడ్డది వీరు మన్నెంలో వుండ్డడంచేత మన్యపురాజులు అనిపించుకున్నారు. ఆయ్నకు బల్ రాఘవరాజు అనేవక కొమార్డువుండ్డేవాడు. ఆయ్నతండ్రిగారయ్ని రాఘవరాజుగారుపోయ్నితరువాత క్రమక్రమంగ్గా బల్వుడయిన బాబులకు యేమి వారితరఫునవచ్చిన ఫౌజుదారులకు యేమిస్వాధీనంకాక రాఘవరాజుసీమ అనే స్తలమును ప్రత్యేకం అనుభవిస్తూ వుండ్డేవాడు. అప్పటిలో షేరుమహమ్మదుఖాన్‌వారు తమతాలూకు కొంతఫౌజును రాఘవరాజుసీమకు పంపించినంతల్లో వారికి స్వాధీనంకానంద్ను శ్రీపెదరాయపరాజుగారిని పిలిచి రాఘవరాజుసీమ వారికుస్వాధీనం అయ్నిది

కాదుగన్ను మీరు కొట్టి సాధించ్చి అనుభవించవలస్నిదని శల్వు యిచ్చి ఫర్మానా వ్రాయించినందున్ను శ్రీపెదరాయపరాజుగారు స్న. ౧౦౮౫ ఫసలీ ౧౫౬౮ * శాలివాహనశకం రాక్షససంవత్సరంలో విస్తరించ్చి ఫౌజును తీస్కుని రాఘవరాజుసీమమీదికి వెళ్లి అనేక విధాలప్రయత్నం చేసి బల్ రాఘవరాజు తాలుకు కొంత్త ఫౌజును కొట్టి షికస్తుచేస్ని మీదట బల్ రాఘవరాజు స్వాధీనంఅయి జేరుదస్తులోకి వచ్చి సాలు ౧ కి వో ౧౦౦౦౦ లు చొ॥ జమాబందీపయికం చెల్లించ్చుకోవడము కున్ను ౫౦౦ మంది సిబందీతో నౌఖరీ చెయ్యగలందులకున్నూ నప్పు కొని ఖరారునామా వ్రాసి దాఖలుచేసి ఆప్రకారం కొంన్నిసంవత్సరములు పైకంచెల్లించి నవుఖరీచేస్తూవుండి చనిపోయినాడు.

ఆబల్ రాఘవరాజు కొమార్డు మల్ రాఘవరాజు అనే ఆయున్ను తండ్రివలెనే కొంత్తకాలం పెద్దాపురపుజమీదారుగారిఆజ్ఞలో తిర్గుతూ పయికంచెల్లించి నవుఖరీచేస్తూ వుండేవాడు. మొదట స్థలంసంపాదనకర్త రాఘవరాజు అవుటచాత దరిమిలాను వారివంశీకులున్ను చివర రాఘవరాజు అనేకితాబు వాడుకలో తెచ్చుకుంట్టూ ఆప్రకారనే వ్రాశుకుంటూ వుండ్డేవారు. యీలాగు కొంత్త కాలం జర్గుతూ వుండగా ౧౦౭౨ ఫసలీ ౧౩౦౪ శ. * శాలివాహనశకం దుందుబి సంవత్సరంలో తానెషావారి హుకుంబమోజున్ను షేరుమహమ్మదు ఖానుకు అయినజుగా ముస్తుఖాఖొల్లిఖానుడు శ్రీకాకొళంసర్కారు కొండవీడుపురపు ముత్తుజానగరము కొండపిల్లిపురపుముస్తుఖాంన్నగరు మచిలీబంద్దరు నిజాంపట్నం యేలూరు రాజమహేంద్రవరం సర్కార్లకు

* ఫసలీ. శక్యం అంకెలు సరియయినవికావు. సంవత్సరములుమాత్రం నిజము.

పాళ్ళమైవచ్చివారు. ఆదోతరఫీసమయంలో రాఘవరాజుసీమ మన్యపు స్తలంగన్క పెద్దాపురం జమీందారుగారికి స్వాధీనంకాక తిరగబాటు చేసినందున్ను శ్రీపెదరాయపరాజుగారు విస్తరించి జనమును ప్రోత్సాహము చేసి పంపించ్చి మల్‌రాఘవరాజును కొట్టివేసి స్తలం స్వాధీనము చేశుకున్న మీఁద వారిసన్నిహిత జ్ఞాతిఅయ్ను పోట్రాఘవరాజు అనే ఆయ్నవచ్చి అనేకవిధాల ప్రాధేయపడి కొంతకాలము నజరుదాఖలు చేసినందున్ను ఆయనను యధాప్రకారం రాఘవరాజుసీమకు అధికారిని చేసి సాలు ౧ కి వొ ౧౦౦౦ లు పుచ్చుకుంట్టూ ౫౦౦ సిబందీచేతను నవుఖరీచేయించుకుంట్టూవుండ్డేవారు. ఆయ్న కొమారుడయ్ను శరభ రాఘవరాజుగారున్నూ తండ్రిగారివలెనే శ్రీపెదరాయపరాజుగారివద్ద యేమి ఆయ్నకొమార్లు అయ్ను శ్రీపెదతిమ్మరాజుగారివద్దనుయేమి చాలవినయవిశ్వాసంగ్గానే మసులుతూ వుండ్డేవాడు".

ఈక్రింది విషయములు పెద్దాపురసంస్థాన చరిత్ర విమర్శనము నుండి గైకొనఁబడినవి.

"ఇట్లు శ్రీరాయజగపతిరాజుబహద్దరువారు శరభరాజుగారిని గొట్టివేసినతరువాత, శరభరాజుమంత్రియగు నెనుముల బాపన్న దొరయును సేనానియగు బొగ్గుగన్నంరెడ్డిదొరయును శ్రీజగపతిరాజు గారి నాశ్రయించి వారియనుగ్రహమును బొంది యీసీమను మూఁడు భాగములుగా భాగించుకొని రెండుభాగములు బాపన్నదొరయును మూఁడవభాగమును గన్నంరెడ్డిదొరయును బరిపాలింపఁజొచ్చిరి. బాపన్నదొర తనసీమకు తోటపల్లిని రాజధానిగాఁ జేసికొనియె. గన్నంరెడ్డిదొర జడ్డంగియందుండెడివాఁడు. తోటపల్లి సంస్థానమున ౧౧౦ గ్రామములు కలవు జడ్డంగిసంస్థానమున ౫౫ గ్రామములుండెను.

కై పీదులో తోటపల్లి జడ్డంగిముఠాలోని గ్రామములపట్టికలు కలవు. పెద్దాపురసంస్థానమువారికిఁ దోటపల్లివారు చెల్లించుపైకము సాలు ౧ కి ౨౭౦౦ వరహాలు. జడ్డంగివారు ౧౩౩౩ వరహాలను సాలునకుఁ జెల్లించెడివారు. మఱియును ౫౦౦ సైన్యమును తోటపల్లివారును ౨౦౦ సైన్యమునుజడ్డంగివారును పెద్దాపురసంస్థానమువారి స్వాధీనమునందుంచవలెను. ఇంకను పెద్దాపురసంస్థానాధిపతు లీమన్నె దొరలవలనఁ బ్రజలకు హానికలుగకుండుటకై తాము కట్టించిన రాతులపూడి కోటయందును అన్నవరపుకోటయందును దమసేనల నిలిపియుంచిరి.

తోటపల్లి నిబరిపాలించిన చినబాపనదొర హూణశకము ౧౮౨౨ లో నింగ్లీషుదొరతనమువారి కొకవిజ్ఞాపనపత్రికను బంపుకొని యున్నాఁడు. అందుఁ దనకుటుంబమునకు రాజ్యమువచ్చి యప్పటికి ౧౮౭ సంవత్సరములైనట్లు తెల్పఁబడియున్నది. కాన ౧౮౨౨ లో ౧౮౭ తీసివేసిన క్రీ. శ. ౧౬౩౫ లో యెనుములవారికీ రాజ్యమువచ్చినట్లు తేలుచున్నది.

౧౮౨౨ సంవత్సరములో నింగ్లీషువారికి విజ్ఞాపనపత్రమంపిన చినబాపనదొరయే నారాయణాచలమాహాత్మ్య కృతిపతి. ఈనారాయణగిరి తోటపల్లిసంస్థానములోనిది అందు శ్రీవెంకటేశ్వరస్వామి అగస్త్యమహర్షి చేఁ బ్రతిష్ఠింపఁ బడియున్నాఁడు.

కృతిపతియొనర్చిన ధర్మకార్యములను గవి యీక్రింది పద్యములో వర్ణించి యున్నాఁడు.

సీ. నారాయణాద్రిచెంత మహాగ్రహారంబు
    సేయించె శాశ్వత స్థాయిగాఁగ

గౌతమీతటిని శ్రీగరుడ ప్రతిష్ఠ జ
నార్దను సన్నిధి నాచరించె
నలపాలకడలితోఁ దులదూఁగఁ జాలిన
సుమహాతటాక రాజములొనర్చె
సకలదీనానాథ సంఘంబులను బ్రోచు
నిజవంశవృత్తి వన్నియకుఁ దెచ్చె

గీ. రామగిరి ముఖ్యపంచదుర్గయుతరాజ్య
పూజ్య సింహాసనస్థుఁడై భుజవిభూతి
యలర రాఘవరాజ సీమాధికారి
యైన శ్రీచినబాపభూపాగ్రవరుఁడు.

గరుడప్రతిష్ఠబహుశః ధనళేశ్వరమునన్నై యుండును, ఇవిగాక గౌతమీనదీతీరముననున్న కోటిఫలి యందలి సోమేశ్వరాలయమున నందిని ప్రతిష్ఠించినాఁడు.

ఈకవి కవిత్వశైలి తెలియుటకై పైనుదాహరించినపద్యములే చాలియున్నను, మఱిమూఁడు పద్యముల నీక్రిందనుదాహరించుచున్నాఁడను.

ఉ. ధ్యాన తపస్సమాధులఁ గృతప్రముఖాది యుగత్రయంబునన్
భూనుతవైఖరిన్ బడయు పుణ్యఫలం బలవేంకటాది రా
ణ్మానిత నామ సంస్మరణమాత్రన గల్గు మనుష్యకోటికిన్
గానఁ దలంప మేల్ కలియుగంబుఁ గృతాదులకంటెనిమ్మహిన్

చ. జగమున మత్ప్రియుండయిన శంకరుఁడేనని నేధరిత్రి నే
నగమున నేనదీతటమున న్నివసించు నిరంతరంబు నా

నగమున నన్నదీతటఘనస్థలి నవ్వని సద్ధరిత్రి ని
మ్ముగ నివసింతు నేనును బ్రమోదభరం బెదనంకురింపఁగన్.

గీ. దుస్తర భవార్ణవాంతర దుఃఖభంగ
మాలికలు వోలిమునుఁగుచుఁ దేలుచున్న
మాకుఁ బారంబు చేర యుష్మత్పదాబ్జ
భక్తి దరి దక్క గతిలేదు పరమపురుష



## 370 పరశురామపంతుల లింగమూర్తి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; తండ్రి రామమంత్రి; తల్లి తిమ్మాంబిక. ఈకవి సీతారామాంజనేయసంవాదమను మూఁడాశ్వాసముల పద్యకావ్యమును, రతీమన్మథవిలాసము, అధ్యాత్మరామాయణము మానసశతకము, సాంఖ్యయోగము, సీతపాట, జీవన్ముక్తి ప్రకరణము, బ్రహ్మనారదసంవాదము, తారకయోగము అను గ్రంథములను రచియించెను.

ఈతఁడు నిజామురాష్ట్రమందలి వరంగల్లు సమీపముననున్న మట్టెవాడగ్రామనివాసి. ఈతనివంశీయులిప్పటికి నాగ్రామముననే లింగమూర్తి నివసించినయింటనే కాపురమున్నారఁట బ్ర. శ్రీ శేషాద్రి రమణకవు లీకవిజీవితమును, సీతారామాంజనేయ సంవాద పీఠికలో వ్రాసియున్నారు. వారివాక్యముల నిట వ్రాయుచున్నాఁడను.

"ఈవంశమున నీయనకుఁ బూర్వము కవులున్నటులఁదెలియదు ...... ఇందు సీతారామాంజనేయము రతిమన్మథవిలాసము అను రెండు గ్రంథములే యించుకపెద్దవి. మిగిలిన కబ్బములు శతకప్రాయములు. రతిమన్మథవిలాసము మూఁడాశ్వాసముల ప్రబంధము. ఈ గ్రంథము కవిబాల్యమున రచించినటుల నందలి భావలోపములు వ్యాకరణలోపములు సాక్ష్యములగుచున్నవి. గద్యములో "శ్రీమదాంజనేయ చరణకమల సేవావిధేయ శృంగార కవితాచమత్కారధౌరేయ పరశురామపంతుల లింగమూర్తి నామధేయప్రణీతంబైన రతిమన్మథవిలాసమను శృంగారప్రబంధమందు" అని వ్రాసికొని యున్నాఁడు. దీనింబట్టి యౌవనమున నీగ్రంథము కవి రచియించియుండునని తేలుచున్నది. సీతారామాంజనేయము లిఖించునప్పటికి కవిస్థితిగతులు మారెను. ఈతని మానసము శృంగారరసమునుండి విముఖమై వేదాంతరసమున నోలలాడఁదొడఁగెను. కవితయు నిగ్గుతేఱి వశంవదయై భావబింబముల నిర్జీవకథాంశములలోసైతము చిత్రించు శక్తికలదయ్యెను. రతిమన్మథవిలాసము హనుమంతునకుఁ గృతియీఁబడినది. గద్యమున హనుమద్భక్తుఁడనని కవి చెప్పికొనియెను. గ్రంథమున గురుప్రశంస లేదు. తుదకు స్వవంశవిషయమేని చెప్పికొని యుండలేదు. సీతారామాంజనేయ మీకవి తనయుత్తరవయసున రచించియుండును. ఇందులకుఁ గవితాధారయు, వేదాంతపాండిత్యము మనకు దృష్టాంతములు కాఁగలవు. ఈకవి బాల్యమున సామాన్యునివలె విద్యాజ్ఞానశూన్యుఁడై తనగ్రామమగు మట్టివాడకు సమీపముననున్న "ఈదులవాయ" యనుగ్రామమున సంచరించుచుండ సమీపశైలమున వసించు మహాదేవయోగి యనునొక మహాత్ముఁడు రామమంత్రోపదేశ మొనరించెననియు నాగిరియందె

యామంత్రరాజము సిద్ధించువఱకు వసించి యోగివలని సెలవంది యాయనదయచేసిన షట్చక్రసీతారామస్వరూపము నిజగృహమునఁ బ్రతిష్ఠించెననియుఁ జెప్పుటయేకాక నేఁటివఱకు నాసీతారామమూర్తి స్వరూపమును వంశీయులు భక్తితాత్పర్యములతోఁ బూజించుచున్నారు. కవి, తాను మహాదేవగురుశిష్యుఁడననియు, షట్చక్రసీతారామోపాసకుఁడననియు సీతారామాంజనేయ గద్యమున నిటుల "శ్రీమన్నారాయణ మహాదేవ గురు కరుణాకటాక్ష వీక్షణ విమలీకృత నిజహృదయ కమలకర్ణికాంతస్సందర్శితాఖండ సచ్చిదానంద రసైక స్ఫూర్తి షట్చక్రసీతారామమూర్తి పరశురామపంతులలింగమూర్తి గురుమూర్తిప్రణీతము" అని వ్రాసికొని యున్నాఁడు. మఱియు నీకవి వర్యుఁడార్జించిన శ్రీరాముమాఁడయు స్ఫటికవినాయకవిగ్రహము మరకతలింగము సాలగ్రామములు సైతము వంశీయులు శ్రద్ధాభక్తులతోఁ బూజించుచున్నారు. ఎట్టి విపత్కాలముననేని తానుగడించిన విగ్రహముల మట్టివాడయందుంచియే పూజింపవలయునని కవి యాజ్ఞయొసంగెనఁట నేఁటికి వంశజులటులె సల్పుచున్నారు. కవికి గురుమూర్తిపదము బిరుదనామము. ఇది యిక్కవిరామమంత్రోపదేశకుఁడై నిజాముఱాష్ట్రమున నఖిలదిశలఁ బల్లకి నెక్కి తిరిగి పెక్కండ్రు శిష్యుల గడించి వారివలనఁ బొందెనట. కవి తన గురుపరంపర నిటులఁ జెప్పుకొన్నాఁడు.

శ్రీదత్తాత్రేయుఁడు – జనార్దనయోగి – ఏకోగురుస్వామి – నరహరి మయుళగురుస్వామి – నాగోజీరామగురుఁడు – కోనేరుగురుఁడు – మహాదేవగురుఁడు – కడపటివాఁడగు మహాదేవగురుఁడే ప్రకృత కవికుపదేశ మొనరించిన దేశికుఁడు. ఈదేశికనామము రతిమన్మథ విలాసమునఁ గానరామిచే నప్పటికీకవి భక్తియోగాభ్యాస మొనరించి

యుండఁడని తెలియుచున్నది. సీతారామాంజనేయమునఁ దన దేశికు నిటుల స్తోత్రమొనరించి యున్నాఁడు.

సీ. అఖిల భూతంబుల నాడించు మాయను
　　సొంపుగా నెవ్వఁడాడింపుచుండు
గురుజనంబులకెల్ల గురువులై తగు హరి
　　హరులకెవ్వఁడు గురువగుచు నుండు
విబుధలోకంబుల వెలిఁగించి వెలుఁగుల
　　మించియెవ్వఁడు వెలిగించుచుండు
ప్రభువులకెల్ల సత్ప్రభువైన బ్రహ్మకుఁ
　　బ్రభువాచు నెవ్వఁడు పరఁగుచుండు

తే. సగుణ నిర్గుణ రూపుఁడై నెగడుచుండు
సమ్మహాదేవగురునరు నభినుతింప
సకల నిగమాంత శాస్త్రంబు లోప
వనఁగ మము బోంట్లకు నుతింప నలవి యగునె.

ఈపద్యమువలన మహాదేవయోగి దైవసముఁడని తోఁచుచున్నది. ఎంతవాఁడో కానిది. లింగమూర్తికవికి గురువు కాఁగలఁడా? కవి తాని గ్రంథమున బ్రహ్మాండపురాణాంతర్గతమగు అధ్యాత్మ రామాయణమునందలి శ్రీరామహృదయమును విస్తరించి వ్రాసితినని యు, శ్రీరాముఁడు స్వప్నమునఁ బ్రత్యక్షమై కృతిరచింపుమనె ననియు వ్రాసికొని యున్నాఁడు.

ఈకవి యీగ్రంథమును మూఁడాశ్వాసములుగ విభజించి క్రమముగఁ దారకయోగము సాంఖ్యయోగము అమనస్కయోగము అని పేరులఁ బెట్టియున్నాడు.

రజతగిరియందు శంకరుఁడు పేరోలగముఁ దీర్చియుండుతఱిఁ దనపరిచర్యలయందపరిమత్తురాలగు పార్వతినిఁ జూచి శంకరుఁడు సంతసించి నీయభీష్టంబుఁ దీర్తు నెద్దియేని వరము కోరుమనెనఁట. అందులకుఁ బార్వతి పవిత్రమగు మంత్రరాజముపదేశింపుమని కోర శంకరుఁడు నీకుఁదగినది శ్రీరామమంత్రమని దాని నుపదేశించెనఁట. పిమ్మట పార్వతి శంకరునిఁ జూచి శ్రీరామతత్త్వస్వరూపమెట్టిదని ప్రశ్నింప, శ్రీరామునానుమతిచే సీత హనుమంతున కెఱింగించిన యంశము శంకరుఁడు పార్వతికెఱింగించెనఁట. ఇదియే యీగ్రంథావతారిక.

కవికాలము తెలిసికొనుటకు గ్రంథమున నాధారములు లేవు; రతిమన్మథవిలాసము కవిస్తుతిలో అయ్యలరాజు రామభద్రుని పేర్కొనియుండుటచే పదునాఱవ శతాబ్దమునకు గడపటివాఁడను విషయము స్థూలదృష్టికిఁ దోచును. కవికిఁ గడపటి వంశవృక్షమీ క్రిందివిధముగ నున్నది.

పరశురామపంతుల లింగమూర్తి
గ్రంథకర్త.
|
రామమూర్తికవి
|
లింగమూర్తి
|
రామకృష్ణసోమయాజి
|
అనంతరామయ్య — దశరథరామయ్య
|
పట్టాభిరామయ్య (అనంతరామయ్య కుమారుడు)

ఈవంశవృక్షమునందలి పట్టాభిరామయ్య గ్రంథకర్తయగు లింగమూర్తి కవి కైదవతరమువాఁడు. ఈపట్టాభిరామయ్యకు వయస్సు 40 సంవత్సరములుండును ఈయనవద్దనుండి. తరమునకు ముప్పదియేండ్లు చొప్పున లెక్కించినచో ప్రకృతకవి యిప్పటికి రమారమి 150 సంవత్సరములపైకాలమువాఁడగును. అధ్యాత్మరామాయణము శుకచరిత్రము లోనగు గ్రంథములవిరచించిన మహాకవియు లింగమూర్తి కవికుమారుఁడు శిష్యుఁడునగు రామమూర్తి తనతండ్రిలిఖించిన రతిమన్మథవిలాసమునకు శుద్ధప్రతి వ్రాయుచుఁ గ్రింద "ప్లవంగసంవత్సర జ్యేష్ఠబహుళ 13 గురువారమువఱకు పరశురామపంతులు రామన్నగారు రతిమన్మథవిలాసము పూర్వప్రతిలో నున్నక్రమాన వ్రాసిరి" అనివ్రాసికొనియెను. జీర్ణమయ మైయున్న గ్రంథము వలనను ప్రకృతవంశీయులకు రామమూర్తికవి యైదవపురుషుఁడగుట వలనను ప్లవంగసంవత్సరమిప్పటికిఁ బదియేండ్లక్రిందను డెబ్బదియేండ్లక్రిందను గతించినది కాక నూటముప్పదిసంవత్సరములక్రిందగతించినదే యుండును. అంతకుముందు లింగమూర్తిగారు రమారమియిరువది సంవత్సరములక్రిందనుండెననుకొనినను సీతారామాంజనేయ మిప్పటికి నూటయేఁబది సంవత్సరములక్రింద అనగా క్రీ.శ 1760 ప్రాంతములో విరచింపఁబడియుండు ననుటకు నిస్సందేహము" ఈపీఠికను శేషాద్రిరమణకవులు 1917 సంవత్సరములో వ్రాసియున్నారు.

ఈసీతారామాంజనేయమునకుఁ బాలపర్తి నాగేశ్వరశాస్త్రిలుగారు మొదట టీకరచియించియుండిరి. వావిళ్లవారు వెన్నెలకంటి సుందరరామశర్మగారిచే విపులమగు టీక వ్రాయించి క్రీ.శ 1920 వ సంవత్సరములోఁ బ్రకటించియున్నారు. ఈసుందరరామశర్మ నామాదిక మీక్రింది పద్యములోఁ గానఁనగును'

ఉ. సుందరమాంబకున్ ప్రథిత సువ్రతకున్ పరదేశమంత్రికిన్
నందనుఁడన్ రమేశ కరుణా పరిలబ్ధ కవిత్వశక్తి ని
ష్పందుఁడ రామదాస బుధపౌత్రుఁడ వెన్నెలకంటి వంశ్యుఁడన్
సుందరరామనామకుఁడ సూరిజనైక విధేయ చిత్తుఁడన్.

ఈలింగమూర్తికవి కవిత్వశైలినిగూర్చి సీతారామాంజనేయ పీఠికలో ఉత్పల వేంకటనరసింహాచార్యులుగా రీక్రిందివాక్యములను వ్రాసియున్నారు. "ఈకావ్యమునందు విషయమువలెనే కవిత్వమును జాలసమంజసముగనే యున్నది. దురవగాహామగు వేదాంతమును సులభశైలిలోఁ గ్లిష్టపదసందర్భముగలుగకుండఁ బద్యములో నిముడ్చుట సామాన్యమగు పనికాదుకదా! వేదాంతములో నెంతయో యనుభవము కలిగి వశ్యవాక్కులుగల కవికిఁగాని యిట్టి సామర్థ్యము కలుగనేరదని చెప్పవచ్చును. ఇంతియుకాక యీకవి తనగ్రంథము నందచ్చటచ్చట నేకాక్షర ద్వ్యక్షర ముక్తపదగ్రస్తాది శబ్దచిత్రములు గల పద్యములఁ బెక్కింటిఁ జొప్పించి నిజపాండిత్యప్రకర్షను వెల్లడించి యున్నాఁడు". కవిత్వశైలిచూపుటకై కొన్నిపద్యము లుదాహరింప బడుచున్నవి.

సీతారామాంజనేయ సంవాదము :— ౧ఆ.

ఉ. రాముఁడు నిర్వికారుఁడు నిరామయుఁ డవ్యయుఁ డక్షరుండు ని
ష్కాముఁ డతీంద్రియుం డజుఁ డకర్తయ భోక్తయ సంగుఁడంతరా
రాముఁడు నిర్వికల్పుఁడు నిరంజనుఁ డద్వయుఁడైన యాపరం
ధాముఁడు గాని చారుగుణధాముఁడు గాఁడు సమీరనందనా!

సీ. దారుణ గాఢాంధకారం బడంగునే
వసుధపైఁ గృతదీపవార్త వలన
నాఁకొన్న మనుజుని యాఁకవి దీఱునే
ఘన సరసాన్న వర్ణనము వలన
నెఱిపేదవాని పేదఱికంబు వోవునే
ద్రవ్య ప్రభావకీర్తనమువలన
రోగపీడితుని బల్రోగంబు దీఱునే
కవితౌషధ ప్రసంగంబు వలన

తే. జండిపడి బుద్ధిలో వెలినుండి మిగుల
దట్టమైనట్టి యజ్ఞాన తమము దెగునె
తర్కిత విచిత్ర శబ్ద బోధంబు వలన
ఫలిత యోగానుభవదృష్టివలనఁ గాక ౧౭

సీ. ఏకమై పరమై విశోకమై సత్యమ
లోకమై వ్యాపకాలోక మగుచు
జ్ఞానమై జగదధిష్ఠానమై ముక్తిని
దానమై మాయావిహీనమగుచు
నందమై కేవలానందమై సంతతా
స్పందమై శ్రుతిపద్మ కందమగుచు
సారమై చిదచిదాకారమై యతినిర్వి
కారమై విగతసంసారమగుచు

తే. జెలుఁగు మెలసుల కలఁకలు గలికి కొనుచు
మెలఁగు ప్రకృతినిఁ దగులక మిగిలి వెలుఁగు

వెలుఁగు వెలుఁగంగఁ జేయుచుఁ గలయ వెలుఁగుఁ
బరమ పరిపూర్ణ నిర్గుణ బ్రహ్మ మనఘ. ౧ ఆ.

సీ. త్రాడు భుజంగమై స్థాణువు పురుషుఁడై
రాజిల్లు శుక్తిక రజత మగుచు
మరుమరీచికలు నిర్మల సలిలంబులై
తోడరి మిన్న సితమై తోఁచు పగిది
నద్వయామల సచ్చిదానంద మయుఁడనై
తగు నేను మిగుల నెద్దాని వలనఁ
దోలుతన సజ్జడదుఃఖాత్మకములైన
జగములై కనుపింతు జనులకెల్ల,

తే. దృఢతరాద్వైత విజ్ఞానదృష్టి చేతఁ
బండితులు పూర్ణనిర్గుణ బ్రహ్మమయుఁడ
నైన ననుగాంచి సంతసి నెయ్యది యభావ
మగు నదియ సూ మదీయ మాయాత్మకంబు ౨ ఆ

మ. శివజీవైక్యసమాధియందు విలసచ్చిన్మాత్రతత్వంబుఁ దా
నవలీలంగని పూర్ణుఁడై పిదప మాయాసంసృతిం జెందినం
దవులన్నేర్చునె యోగి, పాలు పెరుగై ద్రచ్చంగ వేఱైనయా
నవనీతంబిఁకఁ జల్లలోఁ గలయునే నానా ప్రకారంబులన్ ౩ ఆ

మ. తలఁపన్ గాఢ విరక్తియున్ స్ఫుటతరాద్వైతాత్మవిజ్ఞానము
జ్జ్వల సర్వేంద్రియమానసోపరతియున్ సంపూర్ణమై నిత్యమున్
వెలయంగాఁ దనుఁగాంచు కేవలునకున్ విశ్వంబు చూపట్టునే
కలలోఁగన్న గజంబు మేలుకొనినం గన్పట్టునే మారుతీ ౩ ఆ

తే. ప్రాప్తదుఃఖములకు భయపడక యోర్చి
కొసరి యప్రాప్త సుఖములఁ గోరి కొనక
వీతరాగ భయక్రోధుఁడై తనర్చు
నాతఁడాత్మస్థితప్రజ్ఞుఁడగుఁగవీంద్ర 3 అ

తే. విను మొకరహస్యమెత్తేఁగింతు వేయు నేల
యేమహాప్రాజ్ఞునకు మానసేంద్రియములు
పంచినట్లాజ్ఞలో నిల్చి పనులు సేయు
నతఁడు నాత్మస్థితప్రజ్ఞుఁడగు బుధేంద్ర 3 అ

మనశ్శతకము:- "మనసా" యనుమకుటముతో 101 కందపద్యములు గల శతక మొకటి యీకవి రచియించినది యని యాంధ్రసాహిత్య పరిషత్తు వారు ప్రకటించి యున్నారు. దీని మాతృక మట్టెవాడలోనే పరిషత్తువారికి లభించినదఁట. ఈశతకమును లింగమూర్తికవి రచియించినదని చెప్పుటకు శతకమునందాధారము లేదు. కవినామమును దెలుపు పద్యమీశతకమున లేదు. మాతృక మట్టెవాడలో లభించుట మూలముననను, శతకమందలి విషయము వేదాంతమగుటను, ప్రతి పద్యమునందును శ్రీరామునిశరణు బొందుమని మనసునుద్బోధించు వాక్యములుండుటచేతను, సీతారామాంజనేయమునందలి భావములే యిందుఁ గన్పట్టుచుండుటవలనను నీశతకమును లింగమూర్తికవియే రచియించియుండునని తోఁచుచున్నది. కాని యీశతకమునందుఁ దనగురువు నారాయణయోగి యని యీక్రిందిపద్యములలోఁ జెప్పి యుండుటవలనను, లింగమూర్తికవి తనగురువు మహాదేవయోగియని సీతారామాంజనేయమున జెప్పియుండుటచేతను, శతకకర్త లింగమూర్తి కాఁడేమో యని కొందఱు సంశయమును జూపియున్నారు.

క. శ్రీనారాయణగురు సీ
తానాయకుఁగాఁ దలంచి తత్పాదాబ్జ
ధ్యానానందముచే ని
త్యానందముఁ బొందు మెపుడుఁ దలఁగక మనసా ౧

క. అఱగడియలోన రాముని
సిరిఁబొందఁగ నొక్క యుక్తిచేఁ దెలిపిన శ్రీ
గురునారాయణయోగుల
మఱువకుమీ రాముఁడతఁడు మహిలో మనసా ౨

లింగమూర్తికవికి మహాదేవయోగికాకుండ నారాయణయోగి కూడ గురువే. నారాయణయోగి మహాదేవయోగికంటె ముందుగ బాల్యముననే తారకోపదేశము చేసినగురువు. ఆవిషయము సీతారామాంజనేయసంవాదములో నీక్రిందిపద్యములో నున్నది.

క. ఆరయ మద్బాల్యంబున
గారవమునఁ జిత్తశుద్ధికరముగ నాకుం
దారకయోగముఁ దెలిపిన
నారాయణగురువులను మనంబునఁ గొలుఁతున్.

సీతారామాంజనేయసంవాదమునందలి కొన్నిపద్యములలో నీ యిరువురు గురువులనుకూడ నుతించియున్నాఁడు. చూడుఁడు.

క. ప్రణవాత్మక సదసత్కా
రణ సంపూర్ణప్రభాభిరామ గుణని
ర్గుణ నిర్వికార నారా
యణ సీతారామగురు మహాదేవశివా!

సీతారామాంజనేయ సంవాదగద్యలోకూడ నిద్దరు గురువులను జేర్కొని యున్నాడు. కనుడు.

ఇది శ్రీమన్నారాయణ మహాదేవ గురుకరుణాకటాక్ష వీక్షణ ...

మహాదేవయోగి గురువుకాక పూర్వమే అనగా సీతారామాంజనేయరచనకుఁ బూర్వము మనశ్శతకమును గవి రచించినట్లు తోఁచుచున్నది. మనశ్శతకమున మహాదేవయోగిని బేర్కొనకుండుటయే యిందులకు దార్కాణము.

సీతారామాంజనేయము మనశ్శతకము దప్పఁ దక్కిన గ్రంథములు నాకు లభింపలేదు. అవి ముద్రింపఁబడలేదేమో! సీతారామాంజనేయమునకుఁ బీఠిక వ్రాసిన శేషాద్రిరమణకవు లీనారాయణ గురువునుగూర్చి యెందుచేతనో వ్రాయలేదు.

సీతారామాంజనేయసంవాదమును కేవల వేదాంతగ్రంథము నందు గవితన ప్రాగల్భ్యముఁ జూపుటకై యనేక శబ్దాలంకార రచనలు గావించి తనివిచెందక యేకాక్షరకదంబమని యీక్రింది పద్యము వ్రాసెను.

క. నానా నూనుని నని న
న్నే నేనన నిన్ను నన్ను నేనన నని న
నేనును నేనన్నానా
నేనును నిన్నెన్ని నన్ను నిను నేన ననినా



# 371. పోచిరాజు వీరన్న

బహుగ్రంథనిర్మాణదక్షుఁడగు నీకవి యార్వేలనియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శాండిల్యగోత్రుఁడు; ఇతనితండ్రి వీరభద్రుడు; తల్లి మూర్తిమాంబ; పితామహుఁడు వీరామాత్యుఁడు; కొండాంబ పితామహి; ప్రపితామహుఁడు భద్రమంత్రి; ఎల్లమాంబ ప్రపితామహి; ఇతనినివాసము కృష్ణామండలములోని ఈవనియను గ్రామము. ఇప్పుడు గుంటూరుమండలములోఁ జేరినది.

ఈకవి కృష్ణార్జునసంవాదము మనువంశపురాణము. భావనారుషిమాహాత్మ్యము, పంచకావ్యములు, భర్తృహరిసుభాషితము, భల్లాణచరిత్రము ముక్తదేవుకథ, విభూతిరుద్రాక్షమాహాత్మ్యము, ఆనందలహరి, సౌందర్యలహరి యను గ్రంథములను రచియించియున్నవాఁడు. ఈతఁడు కౌండిన్యగోత్రుఁడని యాంధ్రకవులచారిత్రమునఁ జెప్పఁబడినది. కాని యదిపొరపాటు. శాండిల్యగోత్రుఁడయినట్లీకవి రచించిన మనువంశపురాణమునందలి యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. శాండిల్య గోత్రసంజాతుఁ డాపస్తంబ
సూత్రుఁడు సజ్జనస్తుత గుణుండు
పోచిరాజాన్వయోద్భూతుండు భద్రమం
త్రీశుఁ డాతనిపత్ని యెల్లమాంబ
వారిర్వురకు నాత్మభవుఁడు వీరామాత్యుఁ
డాతని సతియుఁ గొండాంబయులరె

వారికిర్వురుసుతుల్ వీరభద్రుఁడు భద్రుఁ
డనఁగ జనించి రందగ్రజునకు
మూర్తిమాంబకు నుదయించి కీర్తితోడ
వీరకవిచంద్రుఁడను పేర వెలసినాఁడ
శివకథారచనాది విశేషభక్తి
యుక్తి దినములుగడుపుచు నున్నవాఁడ.

ఈతఁడు రచియించిన గ్రంథములు భల్లాణచరిత్రమునందలి యీక్రిందిపద్యములలోఁ జేర్కొనియున్నాఁడు.

సీ. పదునాలుగగునేఁట మొదటఁ గృష్ణార్జున
సంవాదము ప్రబంధసరణియయ్యెఁ
బదునెన్మిదగునేఁటఁ బంచకావ్యము లాంధ్ర
పద్యకావ్యములుగాఁ బరిఢవిల్లె
నిరువదిరెండగునేఁట విభూతిమహా
త్మ్యంబు ద్విపదకావ్యంబుగనొప్పె
నిరువదియాఱగునేఁట మార్కండేయ
చరితంబు రచితమై సంఘటిల్లె

గీ. ముప్పదగునేఁట మనువంశముఖ్యనృపపు
రాణము ప్రకల్పితంబయి ప్రకటమయ్యె
ముప్పదాఱగునేఁట శ్రీముక్తదేవు
కథ కథితమయ్యె నాచేతఁ గౌశలమున

గీ. సంస్కృతంబైన శంకరాచార్యవిరచి
తంబులానందలహరి సౌందర్యలహరి

భర్తృహరి కృతమైన సుభాషితమును
శతకములుగాఁగ మత్ప్రకల్పితములయ్యె.

ఈకవి తన పదునాల్గవ సంవత్సరమునాఁటినుండియు కవిత్వము జెప్పనారంభించినట్లు కన్పట్టుచున్నది. ఈతని రచనములలో మనువంశపురాణము మాత్రము ముద్రితమై ప్రచారములోనున్నది. భావనారుషిమాహాత్మ్యము; విభూతిరుద్రాక్షమాహాత్మ్యము, భల్లాణచరిత్రము నను గ్రంథములు యముద్రితప్రతులు మదరాసునందలి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందున్నవి. తక్కిన గ్రంథము లిప్పుడెచ్చటను గన్పట్టుటలేదు.

క్రీ. శ. ౧౮౯౯వ సంవత్సరమునఁ బ్రకటింపఁబడిన యాంధ్రకవులచరిత్రములో నీకవి నూఱుసంవత్సరముల క్రిందటివాఁడని వ్రాయఁబడియున్నది. ఈకవి భారతమందలి యుద్యోగపర్వమును, మామిడి వెంకయ్యయను వైశ్యపండితునకు శుక్లసంవత్సరములో వ్రాసి యిచ్చెనని యీక్రింది పద్యములోఁ జెప్పఁబడియున్నది.

మ. అనఘుండేవని పోచిరాజకుల వీరామాత్య పుత్త్రుండు వీ
రన యన్సత్కవి వ్రాసె మామిడికులగ్రామీణుఁడౌ సూరవై
శ్యుని సూనుండగు వెంకయార్యుకొఱ కీయుద్యోగపర్వంబుఁ బ్రే
మను శుక్లాబ్దసహస్యమాసబహుళామావాస్యయా నాఁటికిన్.

క్రీ. శ. ౧౮౦౯ శుక్లసంవత్సరమైనది కావున నీకవి పదునెనిమిదవశతాబ్దిఁ జతుర్థభాగమునను బందొమ్మిదవశతాబ్దిఁ బ్రథమ పాదమునను నున్నవాఁడని చెప్పనచ్చును.

ఇతఁడు రచించిన యైదాశ్వాసములుగల మనువంశచరిత్రము నకు ఖండకపాలోపాఖ్యానమని నామాంతరముకలదు. ఇది బెజవాడ యందలి మల్లికార్జునస్వామి కంకితమీయఁబడినది. ఆంధ్రదేశమున తేలీలు, దేవతేలీలు, తెలుకులవారు అనిపిలువఁబడువారిచారిత్రమిందు వర్ణితమైనది. వీరుచాక్షుషమను సంతతివారని చెప్పఁబడుటచే నీగ్రంథ మునకు మనువంశపురాణమని పేరువచ్చినది. స్కాందపురాణాంతర్గత కాపాలికాఖండములోని కథయగుట దీనికిఖండకపాలీయమని నామాం తరము కలిగినది. చాక్షుష మనుసంతతిలోనివాఁడగు విమలవిదుఁడను వాఁడు గొప్పతపముచేసి త్రిమూర్తులనుమెప్పించి వారియాజ్ఞానుసార ముగా విశ్వకర్మచే సకలసంపదలకాకరమైన యొకపురమును బడసి దానియందు నివసించుచు విమానారూఢుఁడై యొకనాఁడు బ్రహ్మ లోకమునకుఁ బోవునెడ మార్గమధ్యమున విశ్వంభరమహర్షి యాశ్ర మమునమీఁదనుండి యావిమానము కదలదయ్యెనఁట. ఆమహర్షి శిష్యు లాతనికడకు వచ్చి విమానమునుండిదిగి మహర్షిదర్శనముచేసి పోవలసి నదని చెప్పినను వినక గర్వితుఁడై క్రోధావేశమున నాతని నిందించుచు నామునిశ్రేష్ఠుని దిలలంతఖండములుగా ఖండించెదనని నుడివెనఁట. అందుపై నాఋషి కోపించి నన్నుఁ దిలలంతఖండములుగాఁ జేసెదనని యంటివిగావున నీవును నీవంశమువారును భూమిపై నదియేవృత్తిగా తిల ఘాతకులరై చరించెదరని శపించెనఁట. ఆమనువంశజు లట్లుశాపో పహతులైనప్పటినుండియు, తేలీలు నాఁ బరఁగి యావృత్తిలోనుండి రఁట. బెజవాడయందుండి శైవమతోద్ధారణ మొనర్చిన శ్రీపతిపండి తారాధ్యులవారు వీరిని దమశిష్యులనుగాఁ గైకొనినట్లును, విష్ణువర్ధన మహారాజు వీరికిఁ గొన్నిగ్రామముల నిచ్చినట్లును నీగ్రంథములో నీవిధముగాఁ జెప్పఁబడినది.

సీ. కృతయుగమందు హరిశ్చంద్ర విభుసఖ
త్వముఁ గాంచి భువి నేలె విమల విదుఁడు
త్రేతను మఱియు పం క్తిశతాంగుసఖుఁడయి
విపులాధిపతి యయ్యె విశ్వమూర్తి
ద్వాపరంబునఁ గౌరవప్రభుచెలిమితో
భూపాలన మొనర్చె భూరి భుజుఁడు
విశ్వంభరాఖ్య మునీశ్వర శాపాన
కలియుగంబున రాజ్య చలితులగుచు

విజయవాటికపుర వర విహారణోత్క
మల్లిఖార్జున దేవ సమ్యత్కృపా క
టాక్ష సంపన్నులయి పండితార్య శిష్యు
లగుచుఁ దిలవృత్తి నుండ్రు దదన్వయజులు

సీ. తిలక్రియాదులును గీర్తియుఁ బ్రతాపంబును
బెద్దతనంబును బృథులశక్తి
నిర్మలబుద్ధియు నియతప్రసిద్ధియు
గోత్రానతారుల గుణకథనము
విని తెల్కిసెట్లకు ఘనముగా నప్పుడు
బెజవాడ చాట్రాయి విజయరాయి
జననాథపురి ధనంజయ పురి తడికల
పూడి పద్మావతియు భోగవతియు

తాడివాయియు చింతలపూడి గౌత
వరము సాకేత పాంచాలవరపురములు

మధురయ యాత్రేయపురమును, మాణికర్ణి
కంబగుపురంబు నేకభోగములు గాఁగ.

వ. ప్రతాపచోళుండొసంగె నాపదార్థురు మనుకులీనులు సకల సంపత్సమృద్ధితో నాయా గ్రామముల విలసిల్లి సప్తసంతానముల గావించి శ్రీపతిపండితులుగురుండుగ శ్రీమన్మహామల్లికార్జునస్వామి దైవంబుగ వర్తించుచు చాళుక్యరాజశిఖామణులగు విష్ణువర్ధనమహారాజదేవభల్లాణపెరుమాళ్లు ప్రతాపచోడనరేంద్రులు రాజ్యంబు సేయుసమయమున గురుదేవసింహాసనంబులఁ బ్రకాశింపఁజేసి శాలివాహనశకవర్షంబులు వేయిన్నూటతొంబదియగు ధర్మశాసనంబున వాణిజ్యవ్యవహారంబుల మాన్యులై మనుకులోత్పన్నులు ధన్యులని బ్రాహ్మణులు కీర్తింపుచు నాశీర్వదింప గురుమహేశ్వర కృపానుభావంబున దీనుల రక్షించుచుండిరి"

ఇందుఁ జెప్పిన శా.శ ౧౧౯౦ అనగా క్రీ.శ ౧౨౬౮ వ సంవత్సరములోనీ ప్రాంతములరాజుగానున్న వాఁడు మూఁడవరాజేంద్రచోళుఁడు. ఇతఁడు చాళుక్యచోడుఁడైనను విష్ణువర్ధనవంశములోనివాఁడని చెప్ప వీలులేదు. శ్రీపతిపండితుఁడు క్రీ.శ. ౧౦౮౫-౧౧౨౫ నడుమనున్నవాఁడు. ఆకాలమునందీప్రాంతమునకు రాజుగానున్న వాఁడు. రాజేంద్రచోళుఁడని నామాంతరము గల మొదటికులోత్తుంగచోళుఁడు. ఇతనికి సర్వలోకాశ్రయ విష్ణువర్ధనమహారాజను బిరుదమున్నమాట వాస్తవము. పైనచెప్పిన గ్రామములు ఏకభోగములుగా నీ తెలుకుల సెట్టులకిచ్చినట్లిందు వ్రాయఁబడిన విషయమును గురించి, శాసనము లేమిచెప్పుచున్నవో చూడవలసి యున్నది.

మాధవవర్మ కాలములో వీరిని గూర్చి మఱియొక శాసనమున్న ట్లీక్రిందిపద్యమువలనఁ గన్పట్టుచున్నది.

సీ. ఇలనొప్పఁ బెదవేగి యత్తిపోతముసెట్టి
ఘనుఁగ నిడదవోలి పోలిశెట్టి
సుభగుండు దాద్వాయిసోమిశెట్టియు మహా
త్ముఁడుతడికెలపూడి బొమ్మిశెట్టి
వరగుణాఢ్యుఁడు బెజవాడను యణ్ణము
రామిశెట్టియు నాదిగా మహాత్మ
లగు తెలుకులసెట్టులకు బెజవాడమా
ధవవర్మయిచ్చిన ధర్మశాస

నము శివస్తంభమువ జగన్నాథుఁడైన
మల్లికార్జున దేవుని మందిరంబు
తూర్పు దిక్కున విలసిల్లు తోయజాప్త
చంద్రతారార్కభభూములు సాక్షిగాఁగ

ఈ తేలీల గోత్రములు ప్రవరలు వీరవలంబింపఁదగిన ధర్మములు ఏగోత్రములవారేవృక్షములను ఖండింపఁగూడదో యావివరములు నీగ్రంథమునఁ దెలుపఁబడినవి.

యణ్ణమురామిశెట్టి కొంతధనము సమకూర్చి బెజవాడలో సహస్రస్తంభమండపము గట్టించుటకై తోడుపడుండని తక్కినవారిని గోరెనఁట. ఆమాట "విని కొందఱు తత్కార్యంబున కొడంబడిరి. కొండమీఁదివారాదిగా మఱికొందఱు మీకు బెజవాడయందుఁ గృష్ణా నదియు, మల్లికార్జునస్వామియుంబోలె మాకును నెల్లూరు గ్రామ

మునఁ బినాకినియు మూలస్థానేశ్వర దైవంబును గలవు. మీకును మాకును సాంగత్యంబు గలుగవని దక్షిణాభిముఖులై నెల్లూరునకుం జనిరి. తదనంతరం బారామి శెట్టియు శెట్టిశబ్దంబు శ్రేష్ఠివాచ్యంబుగావున తచ్ఛబ్దంబున కనుకూలులైన మన్నుకులీనులఁ గూడికొని మల్లికార్జున దేవునకు నాలువేయు గంబంబుల కోవెల గట్టించె” నఁట.

ఈకవి కవిత్వశైలి తెలియుటకై మనువంశపురాణమందలి యైదాశ్వాసములనుండియు నైదుపద్యముల నుదాహరించుచున్నాఁడను.

ఉ. మీరిట కేమివచ్చితిరి మీరరుదేరఁగ నాగృహంబు వి
స్తారపవిత్రమయ్యె నతిధన్యుఁడనైతి ధనాధినాథ నీ
కోరిన యర్థమెద్ది యదిగొంకకఁ జేసెదఁ దెల్పుమెంతయే
నూరక రారుగాదె సుజనోత్తము లన్యుల కిండ్ల నెన్నఁడున్ ౧ఆ

ఉ. చల్లగగాడ్పు తావి వెదచల్లఁగఁ జల్లనివెల్లుమింట భా
సిల్లఁగఁ దేటిగుంపువిలసిల్లఁగఁ గోకిలకీరపంక్తి ఘో
షిల్లఁగ ముజ్జగం బఖిలషిల్లఁగఁ దోడుగ మాధవుండు శో
భిల్లఁగఁ బువ్వుటమ్ముల గుభిల్లుగవై చెమరుందు పాంథులన్ ౨ఆ

చ. తెలతెలవారఁజొచ్చె నలుదిక్కులఁ జీఁకటివిచ్చె కుక్కుటం
బులరొద హెచ్చె మింటనుడుపుంజము మాయఁగఁ జొచ్చెఁ దామరల్
కొలఁకులు బాసి మెచ్చె వలిగాలిముదంబులు దెచ్చెకంతుఁడున్
విలు రతిచేతికిచ్చె రమణీరమణావళి నొచ్చెఁ గ్రీడలన్ 3 ఆ.

ఉ. నందనుఁడైనఁ బాతకమొనర్చిన నన్య మనుష్యుచేత వా
నిం దునిమింపఁగా నలయు నిశ్చయ మింటజనించి కీడుచే

యం దొరకొన్న మాపకము నారసి చంపఁగఁ బాలుబోసి పి
ల్లిం దగఁ బెంచిట్లున నచలీకృతమానసులై నృపోత్తముల్ రఆ

గీ. క్రొత్తనూళ్లనామగోత్రమానవులు ద
ద్దళ్లవారు మఱియు తాళ్లవారు
ఘనులు కోనవారు కాళపువారు పెం
డలపువారు నగుచు నెలమి నుంద్రు

తెలీలవిషయమున మనువంశపురాణమును రచించినట్లే పద్మశాలీలను గుఱించి, భావనాఋషి మాహాత్మ్యమను నామాంతరముగల మార్కండేయచారిత్రమును రచించి, హరిహరులకంకితము చేసెను. ఇది మూఁడాశ్వాసములు కలది. ఈకథ మార్కండేయపురాణములో నున్నదఁట. ఈగ్రంథమున పద్మశాలీలయుత్పత్తిని గూర్చి చెప్పఁబడినది. అందలి సారాంశ మీక్రింది రెండుపద్యములలో సూచింపఁబడినది.

చ. అనవుడు సంతసించి హరి యాత్మవిచార మొకింత జేసి మ
న్నన నిజనాభి తామరసనాళమునంగల తంతుజాలమున్
గొనుఁడనియిచ్చె యాఘనులకోరికె దీర్చి దరస్మితాంబితా
ననుఁడయి సత్ప్రతిజ్ఞ వచనంబున నిట్లనె వారి తోడుతన్

సీ. మీయన్వయంబున జనించిన వారు మ
త్సంబంధులై ప్రశస్తముగ నుంద్రు
మీరాదిగాఁగల వారికోశంబందు
కమలతంతువులు స్వప్రకాశితములు

వాసుదేవీయమై వరలు తత్కోశంబు
యుమ్మత్కులోద్భవులాగి తదీయు
లగుచు త్వన్నాభికాద్యుత్పద్మనాళ సం
భవతంతుకోశకులగుట జేసి

గీ. పద్మశాల్పట్టుశాల్పద్మంబులందు
చెలఁగుదురు దీనిమూలంబు జేయువాఁడు
భావనాముని తత్కులవంశమగును
తన్మహాత్వంబు పరమమై ధరను వెలయు

పర్వతమంత్రి లింగనామాత్యకవి మార్కండేయపురాణమందలి పట్టుశాలీలచరిత్రమును ద్విపదకావ్యముగా రచియించియున్నాఁడు.

వీరనకవి రచించిన రుద్రాక్షమాహాత్మ్యము బ్రహ్మోత్తరఖండమునుండి ద్విపదకావ్యముగా ననువదింపఁబడి శ్రీపతిపండితారాధ్యుల కంకితమీయఁబడిన ట్లీక్రిందిద్విపదలవలనఁ దెలియుచున్నది.

అని యివ్విభూతి మాహాత్మ్య మిబ్భంగి
ననుదిన శివసపర్యాసక్తు పేర
అభియుక్తి వీరశైవాచారు పేర
శుభకరోద్యద్గుణ శోభితు పేర

విజయవాటీపుర విభుకృపాలబ్ధ
నిజమహత్త్వోదార్ణ నిర్ణయు పేర
పటుశమీశాఖా నిబద్ధవస్త్రాంత
ఘటిత వైశ్వానల కల్పను పేర

పంచాక్షరీ మంత్రభావను పేర
సంచిత భవసమాచార మత్తద్వి
పాంకుశభావు మహాదేవు పేర
నంకితంబుగఁ బ్రథమాశ్వాస మయ్యె

ఇతఁడు రచించిన భల్లాణచరిత్రము కృష్ణామండలమునకు ముఖ్యపట్టణమైన బందరునందుండు దాము మొగ్గన్న యను ముక్త్రి వంశసంభవుని (ముచ్చిలు వీరినిప్పుడు ఆర్యక్షత్రియు లనుచున్నారు) ప్రేరణముచే నీశ్వరునకంకితము చేయఁబడినది. ఈ మొగ్గన్న "శ్రీపతి పండితారాధ్యవంశసముద్భవ మహాదేవాఖ్య దేశికాత్మవ శంభులింగ నామక గురుని శిష్యుఁడని యిందు చెప్పఁబడినది. పట్టాభిరామవిలాస మును రచించిన శ్రీపతినాగలింగకవి పితామహుఁడు శంభులింగా రాధ్యుఁడు. అతఁడు నీతఁడు నొక్కవ్యక్తియో భిన్నవ్యక్తులో తెలి యదు. మొగ్గన్న కవిని బిలిపించి,

తే. ఆంధ్రగీర్వాణ కావ్యంబులందు నధిక
శోధకుండవు సకలార్థ సాధకుఁడవు
నీవు చెప్పెడు భల్లాణనృపుని కథ మ
హేశ్వరాంకితముగ రచియింప నలయు.

ఈకవికి కొలకలూరివీరన్న యని నామాంతరము కలదు. దానికిఁ గారణమిాక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

తే. ఈవనికిఁ గ్రోశయుగమున నెనయు గొలక
లూర వెలసిన యట్టి శ్రీవీరభద్రుఁ
డాత్మకులదైవమగుఁ గాన నతనిపేర
నలరితిని గొల్కలూరి వీరన్న యనఁగ

ఈకవికి శ్రీపతిపండితేంద్రుఁడు గురువైనట్లీక్రింది ద్విపదలలో విభూతిరుద్రాక్షమాహాత్మ్యమునఁ జెప్పియున్నాఁడు. ఈశ్రీపతిపండితుఁడు కృతిపతియైన శ్రీపతిపండితుఁడుకాఁడు. అతఁడాత్రేయసగోత్రుఁడు. గురువుకౌశికగోత్రుఁడు

"కౌశికగోత్ర సంకలితు నిస్తులితు
దేశికోత్తమపూజ్యు దృఢగుణప్రాజ్యు
నాగలింగారాధ్యునకుఁ బుత్త్రుఁడైన
ధీ గరిష్ఠుని మహాదేవుని పౌత్త్రు

శంభులింగ సుపుత్త్రు సశివాక్షగాత్రు
శంభులింగార్చనాసక్తు నసక్తు
భసిత నిస్తంద్రు శ్రీపతిపండితేంద్రు
ననమ్రప్రభావు మహాదేవుఁ దలఁచి



# 372 చిత్రకవి సింగరార్యుఁడు

ఇతఁడు బిల్హణీయమను మూఁడాశ్వాసముల శృంగారప్రబంధమును రాఘవపాండవీయమను నైదాశ్వాసముల ద్వ్యర్థికావ్యమును రచియించెను. ఇప్పుడు మనకులభించుచున్న బిల్హణీయముద్రితప్రతిలో నీకవిపేరు లేదు. పండితపెద్ది కృష్ణస్వామి ప్రణీతమనియు, సింగరార్యుని తనయుఁడగు నరసింహార్యుఁడు సాహాయ్యమొనర్పఁగా కృష్ణస్వామి రచియించెననియు బిల్హణీయమందలి యీక్రిందిపద్యములలోఁ గన్పట్టుచున్నది.

తే. చిత్రకవివంశ దుగ్ధాబ్ధి శీతభాను
డనుపమానోక్తి శ్రీసింగరార్యసూనుఁ
డమితకవితావిశేషజ్ఞుఁడనఁగ వెలయు
నారసింహార్యకవి వచ్చి నన్ను మెచ్చి

క. శ్రీపండిపెద్దిసత్కుల
దీపక కాశ్యపసగోత్ర దీవ్యన్నానా
భూపాలకమకుటమణీ
శ్రీపద పాదాగ్రభూమి కృష్ణస్వామీ!

సీ. కుత్సిత కాణాద కుత్కీల కవిభేద
సంసక్తయుక్తి వజ్రప్రహార
యణకాంకపాణినీ యాటలీ పాటన
చటుల సూక్తి విహార పటుకుఠార
నిర్ణీతి కృతజైమినీయ తూలోద్ఘాత
సంస్కార వాక్య ఝంఝా సమీర

దుర్మత వేదాంత మర్మత మశ్చేధ
భాసుర వచన ప్రభావసార

తే. కావ్యనాటక లసదలంకార సాహి
తీ సుసంపన్న రసలసద్ధీర హృదయ
పండితోద్దీపిత కులీన సంపన్నిధాన
పాలిత కవీంద్ర శ్రీకృష్ణ పండితేంద్ర !

వ. అని వినుతించి వినుము భవదీయంబులగు చతుర్దశవిద్యా ప్రభావంబులు సకల భాషావిశేషంబులు సమస్తచమత్క్రియావినోదంబులు నెన్న నిన్నరులకుఁ దరంబుగాదు. నిఖిలలోకంబులఁ గృతిముఖంబుగాఁ గీర్తి నిత్యంబగు నట్టికృతులయందు నాంధ్రంబతి రమణీయంబు గావున నొక్కపురాతనకథ నాంధ్రప్రబంధంబుగా రచియించి రామాంకితంబుసేసి యాచంద్రతారకంబగు సత్కీర్తింగాంచుమనిన నేనును సంతోషితాంతరంగుండనగుచు.

క. మున్నింద్ర తనూభవునకు
వెన్నుండు సహాయుఁడైన విధమున నే నా
సన్నుత సద్గుణగణ సం
పన్నుండగు కవివరాధిప సహాయమునన్

ఈకావ్యకర్త కృష్ణస్వామికాఁడనియు, సింగరార్యుఁడే కర్తయనియు, నాతని యనంతరమున నాతనికుమారుఁడైన నరసింహనామకకవి ద్రవ్యలోభియై తనతండ్రిరచించిన గ్రంథమును గృష్ణస్వామికిచ్చి తనతండ్రినామమును దీసివేసి యందులకుఁ బదులుగా గద్యాదుల

యందు కృష్ణస్వామినామమును జేర్చెననియు లోకములో నొక ప్రతీతి గలదు.

ప్రథమాశ్వాసాంతముననున్న నీదిగువ చక్రబంధములోని నాల్గుపాదములయందలి మూఁడవ యక్షరముల నేకముగఁ జేర్చినచో సింగరార్యకవి నామమేర్పడుననియు, నీపద్యమును సింగరార్యుఁడు రచించి యుండెననియుఁ నరసింహకవిగాని కృష్ణస్వామిగాని యీ పద్యమును మార్చ లేదనియుఁ జెప్పుచున్నారు. ఇదిసత్యమేయగును.

శా. ధన్యాసింహభచంద్ర కీర్తి వర విద్యాపండితార్యక్రమా
గణ్యా గర్వి ధనంజయా శివదముక్తా కృత్స్న గంక ప్రభా
జన్యా రాజిత భూరి శాత్రవ కుభృజ్జాతి ప్రభావిక్రమా
మాన్యారాధన త్యాగ భోగ జయధామా నవ్య భాగ్యో
త్తమా!

కృష్ణస్వామి తనగ్రంథమును శ్రీరామాంకితముచేసినట్లు పై పద్యములలోఁ జెప్పియున్నాఁడు కానియీపద్యము శ్రీరామచంద్రుని సంబోధించునదిగాఁ గాన్పింపదు.

సింగరార్యకవి రచించిన రాఘవవాసుదేవీయమునందలి యీ క్రిందిపద్యభాగమువలన బిల్హణీయకృతికర్త సింగరార్యుఁడేయయినట్లు స్పష్టమగుచున్నది.

తే. అనెడు తన్ను బుధుల్గొనియాడి బిల్హ
ణంబు మొదలైనకృతులు విన్నాము తెలుప
నిపుడు భగవత్కథాప్తి నూహించు నట్టి
కావ్యము రచింపు శ్లేషోక్తిఁ గవులు మెచ్చ

పైన వ్రాసిన చక్రబంధప్రమాణమునుబట్టియు నీపద్యమును బట్టియు, బిల్హణీయకృతికర్త కృష్ణస్వామి కాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. కృష్ణస్వామి తననుగూర్చి చెప్పుకొనిన పై సీసపద్యమునుబట్టి యాతఁడు సర్వతోముఖపాండిత్యము కలవాఁడని తెలియుచున్నది. అట్టివాఁడిట్లు ప్రణీతకవులలో నేలచేరెనో తెలియకున్నది. ఈగ్రంథకర్తృత్వమువలెనే యీపాండిత్యముకూడ నభూతకల్పనయేమో? ఈకృష్ణస్వామి యేకులమువాఁడో యెచ్చటివాఁడో తెలియదు. వైష్ణవుఁడై యుండునని తోఁచుచున్నది. సింగరార్యకవి నివాసము నెల్లూరుమండలమగుటచే నీతఁడును నెల్లూరుమండలవాసుఁడనియే చెప్పవచ్చును.

సింగరార్యకవి యారువేల నియోగిబ్రాహ్మణుఁడని బ్రాll శ్రీ వీరేశలింగముపంతులుగా రాంధ్రకవుల చరిత్రమున వ్రాసియున్నారు. కాని రాఘవవాసుదేవీయములోని యీక్రింది పద్యములవలన నీతఁడు శ్రీవైష్ణవుఁడని స్పష్టమగుచున్నది.

మ. నను నారాయణ మూని పాద విలసన్నాళీక సేవామరం
ద నితాంతాంచిత పాననీతకవితా ధారా సుపర్వాంధ్ర వా
గ్జనితానేక విచిత్రకావ్యఘటనా శ్లాఘ్యున్ మహోల్లిఖితక
ల్పను శ్రీవైష్ణవవంశవార్ధిశశిఁ బిల్వంబంచి పల్కెంగృపన్.

చ. వరసుకవి స్తుతంబులగు వర్తిలు సత్కృతులన్నపాళిచే
నరుదుగఁ గాంచునట్టి సముదార బహూకృతు లేమిచెప్ప శ్రీ
కరమగు నీకవిత్వగతిఁ గాంచిన వింతయె మెచ్చు సేయుటన్
స్థిరమతి నీవు సేయు కృతి నేయుము మాకిది యంకితంబుగన్.

రాఘవవాసుదేవీయమునందు కవి తనవంశావళి నీక్రిందివచనములో నిచ్చియున్నాఁడు. అందలి నామములను జూచినను నీకవి నియోగిబ్రాహ్మణుఁడు కాఁడనియు, శ్రీవైష్ణవుఁడనియు స్పష్టమగుచున్నది. ఈతనిది ఆత్రేయగోత్రము.

వ. ఆమునివంశంబందు వ్యాయాను సంధాన ధురీణుండగు నారాయణ దేశికుండుదయించె; అప్పురుషునకు భాష్యభగవద్విషయ విశారదుండగుచు నభినవనారాయణ దేశికుండుద్భవిల్లె; ఆఘనునకు నఖిల విద్యావిచక్షణ దక్షుండగు అప్పకొండాచార్యులు జనించె; అమ్మహాభాగునకు సనర్గళపాండిత్య ప్రవీణుండగు నోబళాచార్యుం డుద్భవిల్లె; ఆదేశికాగ్రణికిఁ దిరుమలాంబకు విమతగజసింహులగు నారసింహులును, నృపులచే మెప్పుగాంచిన అప్పలాచార్యులును నాటకాలంకార నయవిశారదుండగు నోబళదేశికుండును జన్మించిరి; వారలు మద్దికరమను పట్టణమందు శ్రీమంతులై ప్రవర్తిల్లుదురు.

ఆనృసింహాచార్యులకు అభినవరామానుజులగు రామానుజులును ప్రబంధకవితాధురంధరుండగు నప్పలాచార్యులును పుట్టిరి. ఆయహోబలపతికి శైలాంబయందు విష్ణుదేవునకుఁ బంచాయుధంబులకైవడి రంగప్ప, తాతయ్య, నారసింహులు, వెంకటప్ప, అప్పలాచార్యులను దేశికాగ్రేసరు లయిదుగురు సముద్భవులయిరి. వారలకనుజయై యచ్చమ్మ జనియించె. అట్టి దేశికోత్తములలో రంగాచార్యులకుఁ గోపమాంబకు సింగరాచార్య సమాఖ్యుండనగు నేనాదిగా నలుగుర ముద్భవించితిమి.

ఈకవికి, పెదతండ్రికుమారుఁడైన యప్పలాచార్యులు ప్రబంధకవితాబంధురుఁడని పైనఁజెప్పియున్నాఁడు. కాని యాతఁడు రచిం

చిన ప్రబంధములేవియో చెప్పలేదు. రాఘవపాండవీయ గ్రంథాంత గద్యమున కవి తననుగూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

"గద్య. ఇది శ్రీమదళఘుసింగరి స్వరూప శ్రీమన్నారాయణముని గురుచరణయుగళ సేవాసంలబ్ధ సంస్కృతాంధ్ర కవితాధౌరేయాత్రేయగోత్ర పవిత్ర క్రొత్తపల్లి రంగయాచార్య సత్పుత్ర చిత్రకవిసింగరార్య ప్రణీతంబైన రాఘవపాండవీయంబను మహాప్రబంధము".

ఈగద్యమందలి క్రొత్తపల్లి గృహనామముకాదు. ఇతని పూర్వులు కొందఱు 'మద్దికర' గ్రామమున నివసించినట్లే కవితండ్రి క్రొత్తపల్లి గ్రామమున నివసించి యుండవచ్చును. అందుచే నాతనిని క్రొత్తపల్లి రంగాచార్యులని వాడుక కలిగి యుండవచ్చును. చిత్రకవియనునది బిరుదనామమనియు, క్రొత్తపల్లి గృహనామమనియు ననఁగూడదా? యనుప్రశ్న రావచ్చును. గాని బిల్హణీయములో "చిత్రకవిదుగ్ధాబ్ధి" యనియుండుటచే నీకవి యింటిపేరు "చిత్రకవి" యే తలంపనలసియున్నది. క్రొత్తపల్లి యనుగ్రామము నెల్లూరుమండలములోనున్నది. అదియే యీకవి నివాసమైయుండును. కృతిపతి నివాసమైన చుండి కూడ నెల్లూరుమండలములోనిదే.

రాఘవపాండవీయము నెల్లూరుమండలమందలి చుండి సంస్థానాధిపతులగు కామినేని బంగారురుక్మభూపాలునకుఁ గృతియొసంగఁబడినది. కృతిపతి వంశమును గవి యీగ్రంథమున విపులముగా వర్ణించియున్నాఁడు. కాని, కవికాలమును దెలిసికొనుటకుఁ దగిన యాధారము లందుదొరకలేదు. కృతిపతి పూర్వులలో కొందరికి, "నవాబు"

"ఏకునాంఖాను" "శేఖునాయఁడు" ఇత్యాది నామములుండుటచే నీతని పూర్వులు మహామ్మదీయుల యనుగ్రహమునకుఁ బాత్రులై సంస్థానమును నైశ్వర్యమును సంపాదించినట్లు గన్పట్టుచున్నది.

రాఘవవాసుదేవీయమున రామకృష్ణార్థములు రెండును వచ్చినట్లుగా రచియించియున్నాఁడు. రాఘవపాండవీయము, హరిశ్చంద్ర నలోపాఖ్యానములవలె నీకావ్యము ప్రౌఢముగా లేదు. కాని ద్వ్యర్థి కావ్యరచనమున నీతనిని సమర్థుఁడనియే చెప్పవచ్చును.

ఈతఁడు రచించిన బిల్హణీయము శృంగారప్రబంధము. ఇందలి పద్యములలోఁ గొన్నిటిలో శృంగారరసము మిక్కిలి పచ్చిగా వర్ణింపఁబడినది.

మదనాభిరాముఁడను నరపతి తనయ, యామినీపూర్ణతిలక, నవయౌవనవతియై సంగీతసరస్వతియైయుండ నామెకు సాహిత్యమును కూడఁ జెప్పింపవలయునని యాభూపతి పట్టణమందున్న వేదశాస్త్ర పండితులను బిలిపించి, వారితో నామెకు, సాహిత్యమును గవిత్వమును నేర్పుఁడని యాజ్ఞాపింప వారలాకార్యము తమవలనఁ గాదని చెప్పుచు,

సీ. శబ్దాపశబ్ద విచారియైనట్టి వ్యా
కరణజ్ఞు జనకునిఁగాఁ దలంచు
యుక్తివాదములచే నొప్పారు తార్కికు
భ్రాతగా బుద్ధినేర్పడఁ దలంచు
నెఱి నిరాదరవృత్తి నెఱపు మీమాంసకుఁ
గదియంగ మందునిగాఁ దలంచు
నొద్దిఁగి వైదికనిష్ఠనుండు నధ్యాపకుఁ
గనలి దూరస్థునిగాఁ దలంచు

తే. వివిధముగ నిట్టులధిప కవిత్వకన్య
కావ్య నాటకలసదలంకార భావ
నవరసాభిజ్ఞ మది నిజనాయకునిఁగఁ
దలఁచి వరియించుఁ దనుఁదానె వలపుమించి.

కావున నట్టి పండితకవి నెవనినైనఁబిలిపించి రాజకన్యకు గురువుగా నియమింపుమని విన్నవించిరి. రాజట్టివారెవ్వరైన నున్నారాయని ప్రశ్నింప బిల్హణకవి నామమును జెప్పి,

శా. ఆవాచాలత యాకవిత్వ సరసంభాషాప్తి యారూఢి యా
భావం బాపదశబ్దగౌరవము లాపాండిత్య మాశాస్త్రబో
ధావిర్భావక మానుధారసవచోవ్యాపార మాప్రజ్ఞయిం
దే విద్వద్బలభేదికైనఁ గలదే యంతేనిఁ జింతించినన్.

అని ప్రత్యుత్తర మొసంగిరి. రాజు బిల్హణునిఁ బిలిపించి యాతని యధరీకృత మన్మధరూపమునకు ననుపమానపాండిత్యమునకు నచ్చెరువంది సబహుమానముగా గౌరవించి యాతనినిబంపి మంత్రితో

చ. మరుఁడు తనూవిలాసమున; మంజులవాక్యవిశేషయుక్తి చా
తురిమ గురుండు; సత్కళలఁతో యజవైరి; తలంప వీనిఁ దా
మరసదళేక్షణల్ గనిన మారశరాహతిఁ గ్రాఁగు చుందురీ
వరకవియొద్ద మత్సుతకు వాంఛితవిద్య లభించు టెట్లొకో?

యని చెప్పి యత్యంత సౌందర్యవంతుఁడును యువకుఁడునగు నాతనికి నవయౌవనవతియగు తనతనయను శిష్యురాలినిగా జేయుట యుచితము కాదనియు, నామెకు విద్యగరపుటకంతకంటె సమర్థుఁడగు

పండితుఁడు గన్పట్టుటలేదనియు నిందులకేదయిన సాధనమాలోచింపుమని యాజ్ఞసేసెను. మంత్రి యాతనితో రాజేంద్రా! ఇందులకొక యుపాయమున్నది. రాజకుమారి జాత్యంధుని జూడనని వ్రతము పట్టియున్నది. బిల్హణుఁడు కుష్టగాత్రులను జూడనని వ్రతముపట్టియున్న వాఁడు కావున

మ. కవిరాజాగ్రణి పుట్టుగ్రుడ్డనుచు నీకంజాక్షికిం జెప్పి యా
కవికిన్ మీసుత కుష్ఠగాత్రియని వేడ్కం దెల్పి యవ్వారికిన్
భువి నన్యోన్య విలోకన క్రియలు నేర్పుల్ మీఱఁగాకుండున
ట్లు విచారించెద నొక్కయుక్తి వినుఁడిట్లున్ రాజదేవర్షభా!

క. ఇరువురనడుమను నొకతెరఁ
దిరముగఁ గట్టించి చదువు దృఢతరమతిఁ జొ
ప్పరయఁగ మనకన్యక నే
మఱకయుఁ జదివింతమయ్య మనుజాధీశా!

యని రాజునకు నివేదించెను. రాజాజ్ఞననుసరించి యిరువురి నడుమ తెరయేర్పడినది. కుశాగ్రబుద్ధియగు యామినీపూర్ణతిలక యనతికాలములోనే

సీ. వివిధభావవిశేష నవరసంబుల యందుఁ
ప్రీతి నలంకార భేదములను
ఛందో విభేద లక్షణముల నరనాట
కప్రక్రియల మహాకావ్యములను
గామప్రదములగు కామశాస్త్రములందు
జ్యోతిషశాస్త్ర సంగీతశాస్త్ర

ముల నభినయ కళాకవిత మార్గములందు
గణిత తత్త్వామరకాండములను

తే. ప్రౌఢయై మించి శ్లోకార్థ భావమెఱిఁగి
సంస్కృతాఖ్యైక భాషాది చతుర యగుచు
హితము మీఱఁ గవిత్వమూహింపఁ దొడఁగె
సాహిత్యకవిత్వ విద్యలయందిట్లు ప్రవీణ యయ్యె.

ఇట్లుండ నొకనాఁడు బిల్హణుఁడు నిండువెన్నెలలో బయుండి చంద్రమండలమును బరికించుచు నిట్లు వర్ణనము చేయనారంభించెను.

చ. జలనిధి పంకమంచు మహిచాయయుఁ జిహ్నము లేడిపిల్ల కం
దళిత సురేంద్ర నీల మణిధామమటంచు వచింతు రందఱీ
కలువలఱేనియందుఁ గల్గ కందును నేననుకొందు రాత్రియం
దలవడ మ్రింగినట్టి తమమంతరసంస్థమటంచు నెంతయున్.

ఇత్యాది పద్యములలో, చంద్రునిఁ జూచినట్లు వర్ణించుచున్న వర్ణనమును రాజకన్యవిని, కవి జాత్యంధుఁడైనచో నిట్లు చంద్రుని యెట్లువర్ణింపఁగలడని సంశయముచెంది

శా. అంధుండెక్కడ! చంద్రుఁడెక్కడ! తదీయంబైన యవ్వర్ణనా
బంధంబెక్కడ! నింతవింతకలదే! భావింప నెచ్చోటనై
నం ధాత్రీంద్రుఁడు మాకునిర్వురకు నందంబొప్ప నన్యోన్యహా
త్సంధానంబగునంచుఁ జేసె నిటులం జర్చింప వేఱున్నదే!

యని హృదయమున నిశ్చయించుకొని,

క. వ్రతభంగమయినఁ గానీ
మతిమంతు నుదాత్తవేషు మానితవిద్యా

న్వితునిం గాంచెదఁ గన్నుల
కతులమహోత్సవముగాఁగ యని చెలిప్రీతిన్.

కవిని దర్శించినది - పండువెన్నెల - ఏకాంతము - యువతీ యువక పరస్పరసందర్శనము — ఇఁక చెప్పునదియేమి ? వేదాధ్యయన సంపన్నులు.

"కన్య కావ్యనాటక లసదలంకారభావ
నవరసాభిజ్ఞ మదినిజనాయకునిఁగఁ
దలఁచి వరియించుఁ దనుఁ దానెఁ వలపు మించి"

అనిచేసిన యాశీర్వచనము సత్యమై ఫలించినది. వారిరువురకు గాంధర్వవిధిని బరిణయమైనది. కొంతకాలమునకు రాజునకీవార్త తెలిసినది. సత్యమెఱింగి కవికి, మరణదండన విధించినాఁడు. యామినీపూర్ణతిలక కవినిఁ దనకుఁ బతిఁగాఁ జేయుమని తండ్రిని ప్రార్థించినది. ఆమె కోర్కె నిరాకరింపఁబడియెను. వధ్యస్థానమునుండి కవి, తనకును, రాజకన్యకునుగల యన్యోన్యప్రేమమును, తత్కృత్యములను వర్ణించుచు ననేకపద్యములను వ్రాసి రాజునకుఁ బంపెను. కాని రాజు హృదయము మారలేదు. తుదకు కవి తనప్రాణములపై నాసవదలుకొని యీక్రింది పద్యమును వ్రాసిపంపెను.

చ. రవిజుఁడు భాగుణింప విధురంబుగ భట్టి నశించె భారవి
ప్రవరుఁడడంగె దీర్ఘమునఁ బ్రాణముఁబాసె గుడియ్యబిఱుండీ
యవనికిఁ దప్పె భీముఁడుదడంతగతి న్మఱికొమ్ము వెట్ట ని
క్కువముగనే భుకుండుఁడను గొమ్మన దీర్ఘము వెట్టకుండఁడీ
భువినతఁడెన్న నిర్దయుఁడు భూపతివీవు దలంప భూవరా

ఈపద్యమును జదువుకొని యందలి యర్థమును గ్రహించి రాజు తనహృదయమునుమార్చుకొని కవినిమన్నించి కూఁతునిచ్చి పరిణయ మొనర్చి తనరాజ్యమునుగూడఁ దనయేకపుత్రికకొసంగి కృతార్థుఁడయ్యెను.

కవిత్వశైలి తెలియుటకై పైననుదాహరించిన పద్యము లేచాలు నని తలంచి వేఱుగనీయలేదు.

ఈకవి నూటయేబది సంవత్సరముల క్రిందటివాఁడని కవుల చరిత్రకారులు ౧౮౯౯ సంవత్సరములో వ్రాసియున్నారు. ఈకవి కాలమునునిర్ణయించుట కొకయాధారము దొరకినది. కృతిపతికిఁ బూర్వుఁడైన కామినేనిముత్తరాజుపేర శా. శ. ౧౫౬౩ లో ఒక శిలాశాసనమున్నది. ఆశాసనము నీక్రింద వ్రాయుచున్నాఁడను. 1

శ్రీరామం స్వస్తిశ్రీజయాభ్యుదయ శలివాహనశక వారుషంబులు ౧౫౬౩ అగునేటి విక్రమసంవత్సర ఫాల్గుణ శు ౨ లు వాల్మీక వంశోద్భవులు అన్మసానిగోత్రసంభవులున్ను వీరరాఘవనాయినిం గారి పౌత్రులున్ను పోలినేనింగారి పుత్రులైన కామినేని ముత్త రాజుంగారు ఇనుగంది వీరాబత్తుని పౌత్రుడున్ను అయ్యపబత్తుని పుత్రుడున్ను అఇన వీరాబత్తునికిన్ని జయవరపు బసవాబత్తుని పౌవుత్రుడున్ను అప్పాబత్తునిపుత్రుడు ... ... ... ... కందుకూరి శీమలో చుండిగ్రామనను పూర్కిపోడ్మట బాగనబరిదిన తిప్ప తూర్పున పూరిమిందై వారిచేనికి వుత్తరం అలత్తూరివారిచేనికి దక్షానను నూలంతంచేనిన్ని లంతుపేరను కుచ్చల చుండికి దక్షినానూ

1. నెల్లూరు శాసనసంపుటము ౨ పుట ౫౦౩.

వ్రిటలదోవాకు పాడుమనుచెరువు పలిపాల్లమర్రి చేనికి దక్షిణానను అయిన గాదియనిమ్మయగారికిన్ని ఇచ్చిన భూదానధర్మశాసనం. మంమ్మన మాసీమలోను దేవళ్లు దేశాలకు పాటువడు రానెట్టుగాను చేసి న్వాందులకు రాజశ్రీసులు తాను అబ్బులాపాదుషాంగారు మాకు అమరంపాలించిన ... ...

ఈశాసనకర్తయైన ముత్తంరాజుతండ్రి పోలినాయఁడు. తాత వీరరాఘవనాయఁడు. రాఘవనాసుదేవీయ కృతిపతి పూర్వులలో ముత్తంరాజునామధారులు చాలమంది కలరు. కాని పోలినాయని కుమారుఁడొక్కఁడుమాత్రమే కలఁడు. కామినేని వంశజులలో దాదినాయఁడొకఁడు; ఆతనితనయుఁడు శేఖునాయఁడు; ఆతని కుమారుఁడు పోలినాయఁడు; ఇతనికుమారుఁడు ముత్తరాజు. ఈవంశావళిని తెలుపునాల్గుపద్యముల నిట వ్రాయుచున్నాఁడను.

క. ఆకామినేని కులర
త్నాకర పూర్ణకువలయాప్తుని కరణిన్
లోకతమోహారణుండై
నాళోకస్తుతుల దాదినాయఁడు పుట్టెన్

క. అల దాదిభూమిభృద్వర
విలసన్మహితోరుకుక్షి వెడలి తదంక
స్థలిఁ బెరగి వీరహారియై
నలిచెన్ రిపునరుల శేఖునాయఁడు పేర్మిన్

క. వర శేఖుభూతవేశున
కరవిందనిభాస్యలచ్చమాంబికసతియై

కరమొప్పఁ బుట్టె వారికి
నరసన్నుతకీర్తి పోలినాయుఁడు వేడ్కన్.

క. ఆజగతీశుఁడు సుగుణ స
మాజమునందనరు లచ్చమాంబికయందున్
రాజీవ రాజసన్నిభ
రాజిత హితతేజు ముత్తరాజున్ గాంచెన్.

శాసనమునందు ముత్తరాజు తాతపేరు వీరరాఘవనాయఁడని యుండఁగా రాఘవదాసు దేవీయమునందు శేఖునాయఁడనియున్నది. బహుశః శేఖునాయఁడనునది వీరరాఘవునకు నామాంతరమైయుండును.

శాసనకర్తయైన ముత్తరాజునకు రెండవభార్యయగు వేంగమాంబికయందు నవాబు అనుకుమారుడు కలిగెను. ఈనబాబునకై దుగురుభార్యలు పన్నిద్దఱుకుమారులు. అందులో విశ్వపతియను నతనికి ముత్తరాజను కుమారునిఁగనియెను. ఆముత్తరాజు కుమారుఁడే రాఘవదాసు దేవీయకృతిపతియైన బంగారంకభూపాలుఁడు. ఈతఁడు శాసనకర్తయైన ముత్తరాజునకు మునిమనుమనికుమారుఁడగుచున్నాఁడు. శాసనకాలము క్రీ. శ.౧౬౪౦ యగుచున్నది. కృతిపతి యీకావ్యమును గృతినొందునాటికి మనమలనెత్తియున్నట్లు గ్రంథములోని కృతిపతి వర్ణనవలనఁ దెలియుచున్నది. కావున రాఘవదాసు దేవీయరచనాకాలము క్రీ. శ. ౧౭౦౦ సంవత్సరప్రాంతమని యూహింపఁదగియున్నది.




1. ముత్తరాజు — ఓబమ్మ
2. ఏకుణంఖాను — అయ్యమ్మ
3. వెంకటాద్రి — నరసమ్మ = కొండయ్య
4. విశ్వపతి — బంగారమ్మ

అత్సమ్మ

లచ్చమ్మ=ముత్తరాజు—భార్యవేగంటమ్మ=

అంకభూపాలుడు

5. పెదజన్నయ 6. చినజన్నయ 7. కళ్యాణపతి

8. భ్రమరయ్య—వెంకటమ్మ 9. మృత్యుంజయుడు

10. వీరేశు 11. చంద్రశేఖరుఁడు 12. రామలింగప్రభువు

# 373 వెలగపూఁడి కృష్ణయ్య

ఇతఁడారువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; లోహితగోత్రుఁడు; నరహరిమంత్రిపుత్త్రుఁడు; నారసింహమంత్రికిఁ బౌత్త్రుఁడు. రామచంద్రగురుని శిష్యుఁడు శ్రీదక్షిణామూర్తికరుణా కటాక్షలబ్ధ చతురకవితావిచిత్రుఁడు.

ఈకవి భానుమద్విజయమను నైదాశ్వాసముల ప్రబంధమును రచియించి తనయిష్టదైవమగు దక్షిణామూర్తి కంకిత మొనర్చెను. ఈతఁడీగ్రంథమునే కాకుండ మాలినీమాధవీయమను శృంగారప్రబంధమును, గాళికాశాస్త్రమును యోగకందశతకమును వేదాంతసార సంగ్రహమను వచనకావ్యమును రచియించిన ట్లీక్రిందిపద్యములోఁ జెప్పుకొనియున్నాఁడు.

సీ. మహిలోన మాలినీ మాధవీయ మనంగ
శృంగారకావ్య మెనంగఁ జేసి
గాళికాశాస్త్రంబు కడులోక హితముగా
నెనయ నేకాశ్వాసమున రచించి
పరిఢవిల్లఁగఁ గందపద్యపుశతకంబు
నాల్గుయోగంబుల నలువు పఱచి
మీఱిన వేదాంతసారసంగ్రహ శాస్త్ర
మమరంగ వచనకావ్యం బొనర్చి

చాటుకృతులను మరికొన్ని సంఘటించి
మామకాంకిత మొనరించి మంచి పుణ్యా

శాలి యనఁగీర్తిఁ గాంచిన సత్కవీంద్ర
మధుర వాక్సాంద్ర కృష్ణయామాత్య సాంద్ర !

తే. ఇపుడు రచియింపవలె నంచు నెంచు నీదు
కృతికిఁ బతిగాను నన్నుఁ జేసి యతులమహిమ
నందుమని ... ... ...

భానుమద్విజయము యొక్క యముద్రితప్రతులు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున నున్నది. ఈగ్రంథమునకు లఘుటీక కూడఁ గలదు. టీకను రచించిన వారెవ్వరో తెలియదు. ఈగ్రంథమును అరవములోనికి భాషాంతరీకరించినట్లు బ్రౌనుపండితుఁ డొకఁడముద్రిత ప్రతిపై వ్రాసియున్నాఁడు. భానుమంతుఁడను బ్రాహ్మణయువకునకును, ఉజ్జయినీ రాజుకుమార్తె పద్మావతికిని జరిగిన పరిణయ కథయిందు వర్ణితమైనది. ఈకవి రచించిన యితర గ్రంథము లిప్పుడెచ్చటను గానవచ్చుటలేదు.

ఈకవి పూర్వులు గాంగేయోపాఖ్యానము, సుమంతోదయము, ఆంధ్రకర్ణామృతము, వజ్రభుజోపాఖ్యానము, సేతుమాహాత్మ్యము, దత్తాత్రేయచరిత్ర మర్యాదరామసచివచరిత్ర యను కృతులను రచియించి నట్లీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

క. భూనుత గాంగేయోపా
ఖ్యాన సుమంతోద యాంధ్రకర్ణామృతముల్
నూనిత వజ్రభుజోపా
ఖ్యానము శుభహేతు సేతుమాహాత్మ్యంబున్

క. దత్తాత్రేయ చరిత్రన్
సత్తగు మర్యాదరామసచివ చరిత్రన్
చిత్రరపు కృతులుచేసిన
యుత్తమ కవులెల్ల మీకులోద్భవు లగుటన్.

ఇందాంధ్రకర్ణామృతమ్ము వెలగపూఁడివెంగయ్యకవి రచించి నది. తక్కినగ్రంథములను రచించిన వారినామములు తెలియలేదు. ఆగ్రంథములు నిప్పుడు గానవచ్చుటలేదు. ఈకవి వంశమునకు మూల పురుషుఁడైన యన్నయామాత్యుఁడు జన్నావులవారిమంత్రియైనట్లును, అతని నల్గురుకుమారులును వరుసగా గాదెవారికిని, చింతపల్లివారికిని, వెలగపూఁడివారికిని పిడుగువారికిని కూటస్థులైనట్లును, ఈక్రింది పద్యములలోఁ దెలిపియున్నాఁడు.

క. అలలోహిత గోత్రమునం
దలఘున్ శ్రీవెల్లపూఁడి యన్నయ జన్నా
వులవారి మంత్రిమణియై
విలస ద్బహుదాన ధర్మ విశ్రుతుఁ డగుచున్

ఆ. గాదెయాబళార్య కంఠీరవుఁడు చింత
పల్లియెఱ్ఱమంత్రివరుఁడు వెల్ల
పూఁడిరామఘనుఁడు బుద్ధిశాలిపిడుగు
గోపననఁగ నతని కూర్మిసుతులు.

తే. విశ్వపతిరాయ మంత్రియై వెలసి యాబ
ళయ్య యాబళయ్యయనంగ లలి ధనంబు

గాదెలను నింప నార్జింప గాదెవారు
ననఁగఁ బేరంది రాసంతులైనవారు

ఆ. చింతపల్లివీడు సొంతంబుగానేలు
కొనుచు నెఱ్ఱమంత్రి ధనికుఁడగుచు
నచట నుండుకతన నతని సంతతివారు
వసుధఁ జింతపల్లివారునైరి

క. అలవెల్లపూఁడి పట్టణ
మిలఁ దొలికాణాచియగుట నింపున నచటన్
నెలకొనుట రామనార్యుఁని
బలుసంతతి వెల్లపూఁడి వారై రెన్నన్

ఉ. శ్రీపతిరాయమంత్రి వరసింహుఁడు గోపన శౌర్యవంతుఁడై
యేపున మీఱి యాగజపతీంద్రుని సాంద్రబలంబు సద్భుజా
టోపమున న్హరించి యుదుటుంగనుటన్ భువి నాటనుండి సం
ప్రాపితమయ్యె నాపిడుగువారను పేరల సంతు వారికిన్

వెలగపూఁడి అనుపేరుగల గ్రామములు నెల్లూరుమండలము లోని యాత్మకూరుతాలూకా యందొకటియు గుంటూరుమండలము లోని వంగవోలుతాలూకా యందొకటియు గుంటూరుతాలూకా యందొకటియుఁ గలవు. కవిపూర్వులనివాస మేవెలగపూఁడియో తెలియదు. పైన చెప్పిన రామరాజుకుమారుఁడు గౌరమంత్రియు, నీగౌరమంత్రియన్నకుమారుడైన రామరాజును పలనాఁటికి దేశ పాండ్యాయును దేశముఖయు నైనట్లీక్రిందిపద్యములోనున్నది.

ఉ. ఆమహిమానుభావుఁడగు నన్నయపౌత్త్రుఁడు గౌరమంత్రి యు
ద్ధామయశోభిరాముఁడయి తాఁ బలినాఁటికి దేశపాండ్యుఁడై
క్షేమముఁ గాంచె నన్నమణికిన్ జనియించిన రామరాజు నా
సీమకు ముఖ్యదేశముఖుఁ జేకొనె నింపునఁ దానిశాయచేన్

వీరలే కాకుండ నీకవి పెదతాతయగు రామలింగమంత్రియును, తాతయగు నరసింహామాత్యుఁడును గూడ పల్నాటిసీమలో దేశముఖులుగా నున్నట్లీక్రింది రెండుపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

క. ఆరామలింగ సచివుఁడు
వైరి మదంబణఁచునట్టి వాహాబలుఁడై
మీఁటి పలినాఁటిసీమను
బేరందెను దండ్రికన్న విభవోన్నతుఁడై

చ. దరిసికుమారయాచవసుధావరకుంజరుఁ డాప్తమిత్రుఁడై
మెఱయఁగ దేశపాండ్యముఖమీఱుచు నాపలినాఁటి సీమలో
గురుతర రాజరాజకులకోటి మనోభయ హేతుభూతుఁడై
నిరతము నాన్నృసింహుఁ డవనిం దగు విక్రమనారసింహుఁడై

కవికిఁ బినతండ్రియైన కొండయమంత్రి పాండ్యదేశమున నధికారము వహించి యచ్చటి పాళ్యగారలచేఁ గప్పములనుగొనిన ట్లీక్రిందిపద్యములో చెప్పఁబడినది.

సీ. గీ. విక్రమార్కావతారుఁడై వితరణంబు
పూని పాండ్యభూమండలంబునను బాళ్య
గార్ల చేఁ గప్పముల్గాంచి ఘనత మించె
మానధనుఁడు యాకొండయామాత్య ఘనుఁడు

పాండ్యమండలమనగా నిప్పటి మధుర తిన్నెల్వేలి జిల్లాలు.

ఈకవి తనతండ్రియైన నరహరమంత్రి పాండ్యభూనాథుఁడగు విజయరంగచొక్కనాథునియొద్దమంత్రిగా నున్నట్లును, ఆభూపాలుని యొద్దనే తనమేనమామయగు బొప్పూడి సాంబయ గొప్పసేనాధిపతియై ఆర్కాడు, మైసూరు మొదలగు దేశాధినాథులను జయించి కీర్తిఁ గాంచినట్లును వర్ణించి యున్నాఁడు. గ్రంథవిస్తరభయము మనమున నున్నను, ఆకాలపు నియోగిబ్రాహ్మణులు కేవలము వ్రాయసకాండ్రుగా మాత్రమే యుండక పరిపాలనా దక్షులును యుద్ధనీతివిశారదులును బరాక్రమవంతులును సేనానాయకులును వితరణకర్ణులునై యుండిరని తెలుపుట కాపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

క. శ్రీవిజయరంగచొక్క
హీవర కరుణాకటాక్ష వీక్షణ గురుసం
భావిత గజాంత వర ల
క్ష్మీవిభవుఁడునై నరహరిమీఱుఁన్ జేర్మిన్

క. బంగరు మొలాము గంటము
సింగారపువెండియొరయు క్షితి బిరుదుగ మీ
అంగని సముఖము సంప్రతి
యంగుగఁ గావించె నరహరయ్య చెలంగన్

చ. వరగురు పౌరుషంబు నలునందఁగ నల్బదినాల్గులక్షలన్
నఱలెడు పాండ్యభూమి దళవాయగు సాంబయగారి బావయై
నిరుపమ కీర్తి గైకొనిన నిత్యమహోన్నతవైభవుండు నా
నరహరిమంత్రి శౌరికరుణారసహారి సమర్థుఁడన్నిఁటన్

సీ. గీ. విభవమరుదందఁగను బూని విజయరంగ
చొక్కనృపపుంగవునిచేత మిక్కుటముగఁ
దనరు నిరుపమ దాన సంధాన ఘనుఁడు
మధుర దళవాయి సాంబయామాత్య ఘనుఁడు.

సీ. సరిబేటి యార్కాటి సాదులాఖానుతో
ఘటియించె నెవ్వాఁడు ఘనత మీఱఁ
బేర్మిఁ దంజాపురీ పీఠువా యానంద
రావును నెవ్వాఁడు రహిఁ నణంచె
మయిసూరి నంజరాజయగారి ప్రియ వాక్య
సంధికి నెవ్వాఁడు శక్తిఁ దాల్చె
నఱువది వేల్బంట్లు నాఱువేల్గుఱ్ఱంబు
కనిగొల్చె నెవ్వాని కలిమి బలిమి

నతఁడు తగు నాజి జిత్వైరి యత్యుదారి
సత్వసంయుక్త గుణహారి సత్వసీరి
తిలికిత పురారి బొప్పారి కులబలారి
సదుపకారి శ్రీదళపతి సాంబశౌరి

సీ. వేదశాస్త్ర పురాణ వేది ధరామర
లసితాగ్రహారంభులను ఘటించి
హరిహర దేవాలయ స్థిరగోపుర
ప్రాకార సన్మంటపములొనర్చి
సర్వ విద్యాభ్యాస సంవత్సర గ్రాస
రక్షిత పాఠశాలలు రచించి

సకల దేశాగత జనమనోరంజన
ప్రవరాన్న దానసత్రముల నుంచి
రమ్య పానీయ శాలికారామ కూప
దీర్ఘికా తటాకాదుల దివ్యముగను
గరము సవరించెఁ గీర్తి దిక్తటుల మించ
బాండు దళవాయి మేటి సాంబయకిరీటి

మ. తన భేరీనినదం బొకింత వినినంతం జెంజి తంజాపురీ
ఘనపూర్వాంబుధితీరపట్టణము లార్కాడాది శ్రీరంగప
ట్టణముం గేరళపట్టణంబులును జిట్టాడంగ నుత్తుంగ కీ
ర్తినిగాంచెన్ క్షితి సాంబసైన్యపతి యుద్దీప్తప్రతాపోన్నతిన్

తే. ఆతని తోఁబుట్టువులలోన నతుల మతులఁ
జతురతల మించి సకల సన్నుతులుగాంచి
సువ్రతంబుల నలరించి సుకృతి యగుచుఁ
దిరుపతమ మీఱుఁ జారుకీర్తిని వహించి

ఈతిరుపతమ్మయే మనకృష్ణయకవికిఁదల్లి. విజయరంగచొక్క భూపాలుఁడు మధురరాజ్యమును క్రీ. శ. ౧౭౦౬ మొదలు ౧౭౩౨ వఱకును బరిపాలించి యుండెను కావున కవితండ్రియును మేనమామయు నాకాలమువారనుటస్పష్టము. సదతల్లాఖాన్ ౧౭౧౦ సంవత్సరము మొదలు ౧౭౩౨ సంవత్సరమువఱకును ఆర్కాడు నవాబుగా నున్నవాఁడు.

కవి తన మేనబావయైన గోవిందామాత్యుని యనుజ్ఞనుబొంది యీకావ్యము నీశ్వరార్పణ మొనర్చినట్లును, సాంబయదండనాయకుని

కుమారుఁడైన యాగోవిందామాత్యుఁడు విజయరంగచొక్కభూపాలుని యాస్థానమున విద్యాధికారియై సంగీతసాహిత్యసంస్కృతాంధ్రకవిత్వములయందు ప్రజ్ఞావంతుఁడైనట్లు నీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

సీ. పాండ్య భూమండలాఖండలుండైన వి
జయరంగచొక్కభూజాని కాప్త
మండనుండగు సాంబదండ నాథాగ్రణి
తనయులలో నేటి తండ్రి యగుచు
సంగీత సాహిత్య సంస్కృతాంధ్రకవిత్వ
సర్వజ్ఞుఁడై నేనమఱఁది యగుచుఁ
గొమరొప్పు బొప్పూరి గోవిందయామాత్యుఁ
డనుపమ విద్యాధి కార్య సభను
నిండు కొలువుండె నప్పుడు నేదండఁ జేరి
సరససల్లాపముల మీఱి చతురమతిని.

క. శ్రీ విద్యానిధియగు ల
క్ష్మీవర గోవిందమంత్రి శివరామయఁ గా
రే వేళఁ బొగడ వినుఁగా
నీవైఖరి యేకవీంద్రునకు లేదైనన్

ఉ. నీవు ఘటించు సత్కృతికి నేఁబతినయ్యెదనంచు శంకరుం
డే వివరించె నింక నొకటేమి దలంచఁగ నున్నదట్లనే
భావము మీఱ సల్పుమన వారి యనుజ్ఞయు నీశ్వరోక్తియున్
సేవల భుక్తి ముక్తులకుఁ గీర్తికిఁ గారణమంచు నెంచుచున్.

భానుమద్విజయమునకుఁ బద్మావతీపరిణయమని నామాంతరముకలదు. ఈతని కవిత్వము రసవంతమై మనోహరముగానున్నది. ఈతని కవిత్వశైలిదెలియుటకై కొన్ని పద్యముల నీక్రిందినుదహరించుచున్నాడను.

ఉ. విద్దెము విద్దెమన్న కడు వేడుక చేతులనెత్తి వాత్తుచున్
ముద్దులు ముద్దులన్న మొగమున్ మొగమున్ గదియన్ నుచుక్కనున్
సుద్దులు సుద్దులన్న బలుజోల్లొలుకన్ బలుకంజేలంగాఁగా
ముద్దులపట్టి దిట్టతనమున్ తలిదండ్రులు చూచి నవ్వగన్

సీ. మొగమందు నొకతేట మురువు హరువు చెలంగ
కనుదమ్ములను విప్పు కళలెసంగ
చెక్కుల నొకనిగ్గు చక్కగా పొదలంగ
కెమ్మోవిని హారంగు కీన్కొనంగ
దంతపంక్తుల నొకవింత సొరమరంగ
చిరు మీసముల కప్పు చిప్పిలంగ
గళమున నొకపెంపు గలసొంపు లదరంగ
బలు మూపులను వింతబలము పొసఁగ
మఱియు నంగంబులకు నెల్ల మంచి మించు
రంగు లీనంగ శృంగార సంగతులకు
కదలి జారవారాంగనల్ కనుగొనంగ
నధ్వరామరసుతుఁడందె యౌవనంబు.

ఉ. కావున నింకనైన ధృతిగైకొని యల్లుఁడు చిక్కయత్న మే
భావమునందలంచుచు ధ్రువంబుగ రాజ్యము చేయుమన్న నా

భావరుఁ డానుమంత్రులను పొల్పుగ జూచి సమంద హాసుఁడై
శీవిచెలంగ బల్కె ప్రకటీకృత బుద్ధిని మైత్రి దోఁపఁగన్.

చ. గుటగుటమంచు వచ్చి నృపకుంజరుపై నొకపుండరీకము
త్కటజమ మొప్పదాటిన వకావకలై జను లెల్ల నేఁగ నం
తట ధృతివీడకానృపతి దానియురంబును జొచ్చి వెన్నువె
ల్పటికినసాగ గ్రుచ్చి పడవైచెను నేజను తత్క్షణంబునన్. ౨౪

మ. చతురాలాప కథాచమత్కృతుల భాషా చాతురీరీతులన్ యో
చతురంగాది వినోద కేళితతులన్ సంగీతసాహిత్య సం
స్కృతులన్ గంధ సుగంధ మాల్య ధృతులన్ దేదీప్యమానాంబర
స్థితులం బుట్టునె తుష్టి చెపుమా శీఘ్రంబు గానంగనా. ౨౫

సీ. అల్లిబిల్లి గనల్లు మల్లికావల్లికా
కుసుమ వనోపాంత వసుధ యగుచు
తతతాల హింతాల తక్కోల ఖర్జూర
సాల శాఖాజాల వేల యగుచు
సారసారసవార కైరవ సందోహ
ఘనవటత్ భ్రమర ఝుంకార యగుచు
సారస హంససంసార భాసుర నీర
భావిలాస వికాస వాస యగుచు
మత్స్య కచ్ఛప మండూక మహితయగుచు
మంద మరుదుద్భవ తురంగ మహిమ గాంచి
నూత్న నవరత్న నిర్మితానూన కనక
జనక సోపానసహితయా సరసిదరిని.

ఉ. అంతట సిగ్గుదొంతరల నంటె మదిన్ దగ నుల్లసిల్లఁ నా
కాంతుఁ డితం డెయంచు బలుకన్ వశమా నభనంచు కాంత భూ
కాంతునిచెంత నిల్వ కనుకాగల కార్యముతో నటంచు శు
ద్ధాంతము డాయఁబోయె నల దారిని కన్గొని రాజు మంత్రులన్.

ఉ. ఘోరున భానుమంతుని చమూపతి యుగ్రుఁడుదగ్రుఁడౌచు కా
శ్మీర దళాధినాథుఁడగు చిత్రరథున్ రణమందెదిర్చి దో
స్సారము మీఱ నారథికచంద్రులుకన్గొన నొప్పి రప్పుడా
మేరువు మందరంబు లెలమిన్ భువి నొక్కెడ నిల్చునట్లు వడిన్.

ఉ. ఆరవ మాలకింపుచు సహాయము వచ్చిన దుష్టరాజు లే
పారఁగ నారణస్థలిని పాఱఁగ వారలఁజూచి నవ్వి కా
శ్మీరవరుండు మంత్రులట జెప్పినదెల్లను నిక్కమంచు వే
దూరెను భానుమంతుపయి దోర్బల మీసును రోస మీనఁగన్.

[ పై మచ్చుపద్యములలో నుదాహృతమైన

"మ. చతురాలాపకథాచమత్కృతుల మోహాచాతురీరీతులన్"

అనుపద్యము పంచతంత్రములోని యీక్రిందిశ్లోకమున కాంధ్రీకరణముగా కాన్పించుచున్నది.

శాలినీవృత్తము : శయ్యాగారం చందనచారుహాస:
వీణాగానం దర్శనీయాచనారీ
నభ్రాజంతే క్షుత్పిపాసాతురాణామ్
సర్వారంభ స్తండులప్రస్థమూలమ్.]

## వెలగపూడి కృష్ణయకవి వంశవృక్షము

- వన్నయ
  - ఔబళయ్య
  - ఎఱ్ఱన
  - రామరాజు
    - నన్నయ
      - పితిరాజు
      - రామరాజు
    - గౌరన
    - మల్లయ
      - నాగన
      - వీరన
        - నాగరాజు
        - మల్లరాజు
          - లింగరాజు
          - సూరప
          - కృష్ణయ
          - హనుమంతు
            - రామలింగ
            - నరసింహ
              - హరియప్ప
              - నరహరి
                - రామ లింగము
                - నరసింహము
                - కృష్ణయ (యీకవి వతంసుడు)
                - సాంబయ్య
              - వెలిగొండయ
        - పెద్దన
        - నాగన
  - గోపన



# 374 శ్రీగిరి లక్ష్మణకవి

ఇతఁడు వెంకటార్యుని పుత్రుఁడు "శ్రీరఘురామా!" యను మకుటముతో ౧౦౮ కందపద్యములు గల శతకమును రచించెను. ఈకవి ఎప్పటివాఁడో యెచ్చటివాఁడో తెలియలేదు. ఈకవి తండ్రి వేంకటార్యుఁడు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నొక తాళపత్రప్రతియున్నది. అది గుంటూరుమండలమున లభించినది. ఈక్రింది పద్యములవలనఁ గవినామమును గవిత్వశైలియుఁ దెలియును.

క. అరయఁగ శ్రీగిరికులజుఁడు
హరిభక్తుఁడు వేంకటార్యునాత్మజుఁడను పే
రిరవుగ లక్ష్మణుఁడను నీ
శరణొందితి సంతతంబు జయశ్రీరామా!

క. శ్రీరామ! నీదునామము
కోరి స్థిరమతిన్ భజించుకోవిదులకు నీ
భూరికరుణార్ద్రదృష్టిని
శ్రీరమ్యసుముక్తి నిడిన శ్రీరఘురామా!

క. శ్రీకరమగు మీచరితము
జోకన్ కందములశతము సొంపు దలిర్పన్
నీకరుణను రచియించెదఁ
జేకొని వినుమయ్యతండ్రి శ్రీరఘురామా!

క. పామరుఁడను జడుఁడను బహు
తామసుఁడను నియమవర్జితాత్ముఁడ నాకున్
నీమహనీయాంఘ్రులు హృ
త్సీమను నివసింపఁజేయు శ్రీరఘురామా!

క. మంగళము శ్రీరమేశుకు
మంగళమఖిలాండపతికి మహనీయునకున్
మంగళమని నిరతము ను
ప్పొంగుచు నినుఁ దలఁతు భూవిభూ! శ్రీరామా!

శ్రీగిరి విరూపాక్షుఁడు, శ్రీగిరి సుబ్రహ్మణ్య బ్రహ్మణ్యుఁడు అనునిరువురు కవులు వేలుగ నున్నారు. ఈకవివలెనే వారిచరిత్రములును అజ్ఞాతములు. కవికాలము తెలియదు. పదునెనిమిదియవ శతాబ్దివాఁడని తోఁచుచున్నది. ఇతఁడు శతక కవులచారిత్రమున కెక్కలేదు.

---

# 375 కొప్పర్తి నరసయామాత్యుఁడు

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; కాత్యాయన సూత్రుఁడు; భరద్వాజ గోత్రుఁడు; గోపన్న అచ్చమాంబలకుఁ బుత్రుఁడు; రఘుపతికిఁబౌత్రుఁడు; నరసన్నకుఁ బ్రపౌత్రుఁడు; బొల్లాప్రెగడ యెల్లనార్య లింగమాంబలకు దౌహిత్రుఁడు.

ఈకవి రుక్మిణీపరిణయకథను మదనగోపాలచరిత్రమను పేరుతో నైదాశ్వాసముల ప్రబంధముగా రచియించి తానుకొప్పర్తిగానిర్మించిన మదనగోపాలపురమందు నూతనముగాఁ దాను ప్రతిష్ఠించిన మదనగోపాలస్వామి కంకితముచేసి నట్లీక్రింది వచనమువలనఁ దెలియుచున్నది. ఆంజనేయస్వామికవికి స్వప్నమునఁ బ్రత్యక్షమై యీకార్యమును జేయుమని ప్రేరేపించెనఁట.

వ॥ ఇట్లు మదీయస్వప్నంబున సాక్షాత్కరించి నీవు ప్రయోజనంబున సంచారంబుసల్పు కొండపల్లి మండలంబునఁ గృష్ణవేణీనద్యుత్తరభాగసార్ధయోజనస్థలంబున నోడూరనియెడి గ్రామంబు దక్షిణ జాంగలస్థలంబున నొక్క నీలప్రస్తరాంతరంబున వెలయు ప్రతిమారూపంబుగల యాంజనేయుండను. మదీయానుజ్ఞ నాస్థలంబున మదనగోపాలపురంబను నగరంబు గట్టించి యందు మదనగోపాలమూర్తిఁ బ్రతిష్ఠగావింపుము. అద్దేవునకు నంకితంబుగా నొక్క దివ్యప్రబంధంబు మదనగోపాలచరిత్రంబను నామంబునరుక్మిణీపరిణయకథానుబంధబంధురంబుగా నొక్కసుకవిసింధుర సాహాయ్యానుగ్రహంబున రచియింపుమని పలికిన నతనియాదేశంబు మదీయమనంబున సంతోషాతిశయంబు ......... మఱియుఁ దదీయస్థలంబునఁ దటాక కూపంబులు నూతనంబుగా సంఘటించి పురంబు నిర్మించి

తదుక్తకావ్యంబు రచింప సమకట్టి తత్సహాయంబున కొక్కమహాకవి సందర్శనం బపేక్షించియున్న సమయంబున నొక్కనాఁడు.

ఈగ్రంథరచనయందీతనికి రావూరి సంజీవరాయకవి సాహాయ్య మొనర్చినట్లీక్రింది గద్యపద్యములలోఁ జెప్పియున్నాఁడు. సంజీవరాయ కవిచారిత్రము నీగ్రంథమున వేఱొకచోట వ్రాసియున్నాఁడను.

సీ. శ్రీకృష్ణపదయుగాశ్రితుఁడు సాంఖ్యాయన
గోత్రుఁడు రఘుపతి పౌత్రుఁడు గురు
వకవీంద్ర పెద్దమాంబా పుత్రుఁడు రఘునా
థునకుఁ బూర్వజుఁడు మృత్యుంజయున క
నుజుఁడు రావూరి వంశజుఁడు హనుమకొండ
సంజ్ఞను గలయాదిశాఖను వెల
సినవాఁడు జాతకసిద్ధాంతముఖకళా
చతురుండు నుభయభాషావిశేష-

రసగుణాలంకృతి కవిత్వరాజితుఁడు వి
రచిత బహుకావ్య వీరనారాయణాది
శతక దండక సంస్కృత సరసపద్య
గేయపదుఁడైన సంజీవరాయ సుకవి.

వ. అమ్మహానుభావుండును మదీయభాగ్యంబునం జనుదెంచి దర్శనంబిచ్చిన నతనికి జాంబూనదాంబరాభరణంబు లొసంగి బహూకరించి నిలిపి తత్సహాయానుగ్రహంబునఁ బ్రబంధారంభంబు గావించినవాఁడనైతి.

సంజీవరాయకవియే ఈగ్రంథమును రచియించి కొప్పర్తి నరసన్న పేరఁ బ్రకటించెనని యొకప్రతీతి కలదు. ఇందెంతసత్యమున్న దియుఁ జెప్పఁజాలము. ఇతరకవిసాహాయ్యమును బొందితినని వ్రాసికొనిన ప్రతికవికి నిట్టి యపవాదమారోపింపబడుచున్నది.

ఈకవి తన వృత్తాంతము నీక్రింది పద్యములలోఁ జెప్పుకొని యున్నాఁడు.

సీ. కొప్పర్తి వంశాబ్ధి కువలయమిత్రుండు
మిత్రుండు శాత్రవ నృపతతికి
విద్వద్గజేంద్ర భారద్వాజగోత్రుండు
గోత్రుండు శ్రితపాళి గోపనమున
అగ్రశాఖేయ కాత్యాయన సూత్రుండు
సూత్రుండు గుణమణి స్తోమమునకు
సాహసౌదార్యాది సద్గుణచైత్రుండు
చైత్రుండు విఖ్యాత సచివవనికి

బొల్లప్రెగ్గడవంశభ వెల్లనార్య
లింగమాంబాతనూజాచ్చమాంగనాక
ళత్రుఁడై నిజవంశపవిత్రుఁడై మదీయ
జనకుఁ డలరారె గోపన్నసచివమౌళి.

క. ఆగోపనాహ్వాయ మహా
భోగికి నాయచ్చమకును బుత్త్రుఁడ విద్యా
భాగుఁడ రచింతు మదన మ
హాగోపాలకృతి నరస నాఖ్యుఁడ నీకున్.

కృతికర్తవంశములోనిపూర్వుఁడైన రామశౌరి యనేక ధర్మకార్యము లాచరించినట్లును కొప్పర్తిసీతారామపురము అను గ్రామములకు గరణమైనట్లును ఈక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

సీ. సుమతరాంతర్వేది నరసింహమూర్తికిఁ
గోవెలల్ కట్టించెఁ గోమును మిగుల
భావనారాయణస్వామికిఁ గల్పించె
వరగేహములు సర్వవరమునందు
రహిమీరఁ విశ్వాసరాయపురంబును
నగ్రహారముచేసె నధికలీల
నాయగ్రహారంబునందును దిగువయా
తిరుపతి గావించె నరహరికిని

గరిమ నరసాపురస్థల ధరణి తోడఁ
గాల్వ (?) సీమకుఁదా స్థలకరణమగుచు
భూతిఁ దనరె సీతారామపురమునందు
రమ్యగుణహారి కొప్పర్తి రామశౌరి.

క. సీతారామపురంబును
ఖ్యాతిగఁ గొప్పర్తియనెడు గ్రామమునకు వి
స్ఫీతస్థానరికత్వవి
భూతిని రామాఖ్యమంత్రి భువిపైఁదనరున్.

ఈసీతారామపురమును, కొప్పర్రు అను గ్రామమును, పడమరగోదావరి మండలమున నరసాపురము తాలూకాలో నున్నవి. ఈకవి నివాసముకూడ ఆగ్రామములై యుండనొప్పును.

ఈ రుక్మిణీపరిణయము ముద్రింపబడినట్లులేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునం దముద్రిత ప్రతియున్నది

ఈకవియు సంజీవరాయకవియు సమకాలికులు. ఈగ్రంథరచనా కాలమీక్రిందిపద్యములోఁ జెప్పఁబడినది.

సీ. శకమజఖర్షిందుసంఖ్యను దగు పరా
భవ రాధపూర్ణిమా భానుతిథికి
బరిపూర్ణ రుక్మిణీ పరిణయమ నెడు ప్ర
బంధంబు మదనగోపాలచరిత
భారత రణమందు పార్థున కాప్తుఁడై
కృష్ణదేవుఁడు నిర్వహించినట్లు
రావూరి సంజీవరాయ సోదరయభాష
ఘనకవి నిర్వాహకంబు సేయ
జెప్పి యాకృతి నీకు నర్పించఁ గంటి(?)
నుభయకవులకు గైనల్య మొదవఁ గోరి
సరస కొప్పర్తి గోపన్న సచివ సుతుఁడ
భువిని నరసింహ నామక కవిని నేను.

ఈసీసపద్యములో జెప్పఁబడిన కాలము క్రీ. శ. ౧౭౮౬ వ సంవత్సరమైనది.

ఈకవి పూర్వకవులను స్తుతించుచు నీ క్రిందిపద్యమునుఁ జెప్పి యున్నాఁడు.

సీ. క్షమ నాంధ్రశబ్దశాసన బిరుదాంకంబుఁ
గన్న కళాధుర్యు నన్నయార్యు
బ్రాబంధపరమేశ్వరత్వాంకుఁ
గవ్యబ్రుడనని నెఱ్ఱాప్రగ్గడాఖ్య కవిని

బాత్రిశోభయకవిమిత్రతాంక జేఁ
గన్న స్తుతిభాజి తిక్కనసోమయాజి
విశ్రుతి వివేక కృద్విబుధత
గను తపశ్చరుని సధర్వాణాఢ్య వరుని

ఆంధ్రకవితా పితామహత్వాంకధారిఁ
బెండెరము గన్న యలసానిపెద్దసూరి
నభినుతించెద నైకృత ఖ్యాత కవుల
నఖిల లక్షణ కవుల నే నహరహంబు



## 376. చదువుల సోమలింగకవి

ఇతఁ డేకులమువాఁడో తెలియదు. శైవబ్రాహ్మణుఁ డని యాంధ్రకవులచరిత్ర మనుచున్నది. ఈకవి మదనసాయకావిలాస మను నైదాశ్వాసముల శృంగారప్రబంధమును రచియించి శ్రీశైల మల్లిఖార్జునస్వామికిఁ గృతియిచ్చెను. ఈక్రింది గ్రంథాంతగద్యవలన నీతఁడు గారుత్మతద్యుతిగోత్రుఁ డనియు, గురులింగయకు నన్నమాంబకుఁ బౌత్రుఁడనియు, వెంకటచలమయాన్నపూర్ణాంబికలకుఁ బుత్త్రుఁ డనియుఁ దెలియుచున్నది.

"గద్య:- ఇది శ్రీమద్గురులింగజంగమచరణ కరుణాకవిత సదభ్యాసో చిత నవరసాలంకార కవితాధురంధర ఘనయశోబంధుర గారుత్మత ద్యుతిగోత్రపవిత్ర సకలలింగాంగసంఘ స్తుంపనీయ చదువులవంశామృత పారావారపూర్ణచంద్రోదయ గురులింగనన్నమాంబాసుపుత్త్రి వేంక టచలమయాన్నపూర్ణాంబికాగర్భశుక్తిముక్తాఫల సోమలింగాహ్వయ ప్రణీతం బైన మదనసాయకావిలాసం బను శృంగారప్రబంధంబు."

బ్రాహ్మణులలో గారుత్మతద్యుతిగోత్ర మున్నట్లు కానరాదు. ఈతఁ డేకులమువాఁడో తెలిసికొనవలసియున్నది. శ్రీశైలమల్లిఖా ర్జునుఁడు స్వప్నమునఁ బ్రత్యక్షమై.

ఉ. అందమువీూఱ నాగిరికి నబ్బుర మొప్పఁగ నేగుదెంచి నా
యందునభక్తి చేతను నయం బలరారెడునూఱుకందముల్
పొందుగఁ బుష్పమాలవలెఁ బూన్చితి వందుకుసంతసంబు నే
నొందినవాఁడ నైతిఁ దగనుర్విని వట్టులరాజవంశజా!

గీ. కావునను నీవు నొనఁగూర్చు కావ్య మధిక
భక్తితో మాకొసంగినఁ బరమహాని
గణన మగునైహికాముష్మికములు గల్గు
సురుచిరసమాఖ్య చదువులసోమయాఖ్య !

ఈకవి శ్రీశైలనాథునిపై రచించిన కందపద్యశతక మిప్పు డెచ్చటను గానవచ్చుట లేదు. మదనసాయకావిలాసమున సూర్య వంశపు రాజగు ఋతుధ్వజమహారాజు తుంబురుఁడను గంధర్వుని తనయ యగు మదనసాయకను బరిణయమాడినకథ వర్ణింపఁబడినది. ఈతని కవిత్వము మృదుమధురపాకమున వెలయుచున్నను నిర్దుష్ట మయినది కాదు. శైలిచూపుటకై ప్రతియాశ్వాసమునుండియు నొక్కొక్కపద్యమును, ఆంధ్రకవులచరిత్రమునుండి గైకొని యుదాహ రించుచున్నాఁడను.

చ. చని శశికాంత సంఘటిత చారుసువర్ణవికార సౌధమం
దును నెనలేనిగద్దెపయిఁ దోరముగాఁ గొలువుండి సాధుస
జ్జనపరివారయుక్తుఁడయి సత్యముఁ దప్పక మూఁడులోకముల్
తనదుయశంబు గప్పఁగను దద్దయు రాజ్యము చేయుచుండగన్.
౧౮

చ. అని దరిఁజేరి బాలకుని నక్కునఁ జేరిచి చెక్కుదోయి ము
ద్దొనరిచి చుంచుదువ్వియు మృదూక్తులుపల్కి కడింద్రపేమ న
మ్మనమున నల్లిబిల్లికల మాటికి నల్లుకొనంగ నక్కుమా
రునిముఖచంద్రదర్శన విలోచనకై రవుఁ డౌచు నయ్యెడన్. ౨౮

చ. తెలిపలురుమంజిమ త్తైములు తీరుగ నిల్పిన క్రేవఁ జక్కనౌ
బలువగు కెంపుగుంపుల శుభస్థితకాంతులు చల్లుమేలు క

మ్మలకునివాళులిచ్చుకను మచ్చికలున్ జెలువొందఁ దావిపు
వ్వులసర మొక్క కేల నిడి యొప్పగ నప్పురి నేగుచుండగన్. ౩౯

ఉ. ఉల్లము చల్లగాఁ గనఁనయొప్పులకుప్పయిన్ సుమాస్త్రముల్
పెల్లుగ నేసినట్టికడు పెద్దవు. నీకొకలక్ష్యమానవో
త్ఫుల్లసరోజలోచనలపొంక మడంచుట మన్మథాధరన్
తల్లికి ముక్కుగోసి పినతల్లికిఁ గమ్మలొసంగ నేర్తురే. ౪౦

ఉ. మారునిఁ గేరు పీనిసుకుమారశరీరము నవ్యచంద్రికా
సారముఁ దీరు హాసము సుసారసపారము తారకన్ను లిం
పారెడుగందుతుమ్మెదలబారుల నేల్కురు తార వీని సిం
గారము నీరజాసనునికైన నుడిం దలపంగ శక్యమే. ౪౧

ఈకవి ఎచ్చటివాఁడో ఎప్పటివాఁడో తెలియదు. పదునేని మిదవ శతాబ్దియందున్నవాఁడని తలంపవచ్చును. కవులచరిత్రకారులు నూఱుసంవత్సరముల క్రిందట నీకవియుండునని వ్రాసియున్నారు.



## 377. అడిదము బాలభాస్కరకవి

ఈకవిచారిత్రమును "విస్మృతకళింగాంధ్రకవులు" అనుగ్రంథమున, అడిదము రామారావుపంతులుగారిట్లు వ్రాసియున్నారు.

"ఎవ్వారు తమయఖండసాహితీపటిమచేతను, ఆంధ్రవాఙ్మయనిర్మాతలయ్యిరో, యెవ్వారి జీవితచరిత్రము నామమాత్రావశిష్టమై తమతరువాతివారికి విషాదకారణమయ్యెనో యట్టికవితల్లజులలోఁ జేర్పఁదగినవాఁడగు నీబాలభాస్కరకవి సుప్రసిద్ధాంధ్ర కవిశేఖరుఁడగు నడిదము సూరకవీంద్రుని జనకుఁడు. ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రి వసిష్ఠగోత్రిజుఁడు. నారసామాత్యుని పౌత్త్రుఁడు. చినలచ్చన మంత్రిపుత్త్రుఁడు. కాపురము విజయనగరమునకు సమీపముననున్న భూపాలరాజు రేఁగ (పూసపాటి రేఁగ).

౧౮ వ శతాబ్ద్యుత్తరభాగమున శ్రీవిజయనగర సంస్థానమున నాస్థానకవిగానుండిన యీతనికుమారుఁడగు సూరకవి, క్రీ.శ ౧౭౨౦ సంవత్సరప్రాంతమున జననమొందిరయుండుటచే నాతని తండ్రియగు నీబాలభాస్కరుఁ డప్పటికి ౨౫ సంవత్సరముల ప్రాయముగలవాఁడై యుండవచ్చునని మనమూహించినచో నీతఁడు ౧౬౯౦ ప్రాంతమునఁ బుట్టియుండవలయును. అట్లనుకొనినచో నీతనికాలము ౧౬౯౦–౧౭౫౦ మధ్యకాలమై యుండనగును. ఈప్రకారమూహించిచూడ నీబాలభాస్కరకవి ఉషాభ్యుదయ గ్రంథకర్తయగు శ్రీ పూసపాటి వేంకటపతిమహీపాలునకు సమకాలికుఁడుగా నుండనోపును.

సూరకవి తన "కవిసంశయవిచ్ఛేదమున" కృత్యాదియందీభాస్కరకవి నిట్లు స్తుతించి యున్నాఁడు.

క. చినలచ్చమంత్రి తనయుని
ననఘుని మజ్జనకు భాస్కరామాత్యమణిన్
గొనియాడెద శ్లాఘాలం
ఘనజాంఘికకవనధాటి గలిగిన మేటిన్.

ఈ స్తుతినిబట్టిచూడఁగా బాలభాస్కరకవి కవితావిషయమున గొప్పసామర్థ్యము కలవాఁడుగాఁ గనఁబడుచున్నాడు. ఇతని కవన ధాటిని నిదర్శనపూర్వకముగాఁ జూపుటకుఁ దగిన సాధనసామాగ్రి లేకుండుట యెంతయుఁ జింతాకరము. ఇతఁడు శుద్ధాంధ్రరామాయణ ఘటనావైదుషీధురంధరుఁడని సూరకవి తనగ్రంథములోఁ వేసికొనిన గద్య యిట్లుద్ఘోషించుచున్నది.

"ఇది శ్రీమదశేషమనీషి హృదయంగమ మృదుపదనీరంధ్ర శుద్ధాంధ్రరామాయణ ఘటనావైదుషీధురంధ రాడిదము బాలభాస్కరకవి తనూభవ" అనియున్నది.

దీని కుపబలముగా సూరకవి తన కవిసంశయవిచ్ఛేదములో "ఇడఁగఁవచ్చు నుల్యప్పపై నిత్యసంధి మాత్ర మొకొక్కచోటను మట్టుమీఱ" అను లక్షణమునకు లక్ష్యముఁ జూపుసందర్భమునఁ బ్రామాణికగ్రంథములనుండి చూపిన యుదాహరణములతోఁ బాటు "బాలభాస్కరకవికృత శుద్ధాంధ్ర రామాయణమునుండి" యని వ్రాయుచు, "నిగిడిరు వైపులన్ వెడలునేటయి సీటగు పీటికోట" అను చంపకమాలికాపాదము నుదాహరించియున్నాఁడు. మీఁదియంశ ములనుబట్టిచూడఁగాఁ గూచిమంచితిమ్మకవి యచ్చతెనుఁగు రామాయణమునకుఁ బూర్వమే యీకవిగ్రామణి తనశుద్ధాంధ్రరామాయణ

మును రచించినట్లుగఁ దెలియుచున్నది. కాని యీగ్రంథము నాకు మాత్రావశిష్టమైనదగుటచేతఁ బ్రకృతోపయోగము కాఁజాలదు.

ఇంక నీమధ్య ననఁగా రెండు మూఁడు సంవత్సరములక్రిందట శ్రీశ్రీశ్రీ విజయనగరం మహారాజావారి కాలేజీలో నాంగ్లసాహిత్యోపాధ్యాయులగు శ్రీయుత బుర్రా శేషగిరిరావు పంతులవారి యౌదార్యమున "లక్షణసారము" అను నొకఛందోగ్రంథముయొక్క రెండుప్రతులు నాకు లభించినవి. వీనిలో నొకటి శ్రీ బొబ్బిలి సంస్థానాస్థానకవిపదవి నలంకరించినవారును కీర్తిశేషులగు బ్ర.శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిలవారి పుస్తకభాండాగారములోనిది. దీని ముఖపత్రముమీఁద "అక్షరోత్పత్తిఫలాలు, గణములకు అష్టాదశ లక్షణములు, అడిదము బాలభాస్కరకవి" అనియున్నది అంతియె గాని గ్రంథమున నారంభమునఁగాని యంతమందుగాని రచయితపేరు గానరాదు. రెండు మూడుచోట్లను "అడిదము బాలభాస్కరకవి రచన" అని ప్రకరణప్రారంభమున వ్రాయబడియున్నది.

ఈవ్రాత రమారమి ౧౨౦ సంవత్సరములక్రింతటి కాలమునది తల్లేఖకుఁడు పుస్తకము చివరనిచ్చిన సమాచారమునుబట్టి తెలియవచ్చుచున్నది. "పింగళసంవత్సర భాద్రపద బ ౩౦ బుధవారంసరికి మండపాక లచ్చన్నకుమారుఁడు కామన్న అలవెల్లివారి ప్రతిచూసి పరిశీలింగా ఛందాలు సంపూర్ణగా వ్రాసుకొనెను" అనియున్నది.

ఈపుస్తకమును వ్రాసికొనిన మండపాక కామన్నగారు ౧౨౦ సంవత్సరములక్రిందటి కాలమున నున్నట్లు తద్వంశజులును త్రిలింగ

భాషాభివర్ధనీ గ్రంథమాలాసంపాదకులును నగు శ్రీ మండపాక రామ శాస్త్రిలవారు చెప్పుచున్నారు. కాఁబట్టి మీఁద నుదాహరింపఁబడిన పింగళసంవత్సర మిప్పటికి నలువదియాఱుసంవత్సరముల క్రిందటి పింగళసంవత్సరముగాక ౧౦౬ సంవత్సరముల క్రిందటి సంవత్సరమని తోఁచుచున్నది. కాన రమారమి ౧౩౦ సంవత్సరములకిందట వ్రాయఁబడిన మండపాకవారిప్రతికి మాతృకయగు నాలవెల్లివారి ప్రతి ప్రాచీనతరమని వేఱుగఁ జెప్పనక్కర లేదు.

ఇంక నీలక్షణసారముయొక్క రెండవప్రతి బాలభాస్కరకవి నివాసస్థలమగు భూపాలరాజురేగయే కాపురముగాఁ గల ఓరుగంటి రామన్నగారు వ్రాసినది. ఈరామన్నగారు ఇప్పటివారి మునిమనుమఁడగు బ్ర శ్రీ ఓరుగంటి సన్యాశయ్యగారికి నాల్గవపురుషుఁడు. తరమునకు ౩౦ సం॥ చొప్పున లెక్కించిచూచినచో లేఖకుఁడగు రామన్నగారికాలము ౧౨౦ సంవత్సరముల క్రిందటికాలమని తేలుచున్నది. కాఁబట్టి మీఁదియంశములనుబట్టి విచారింపఁగా రమారమి ౧౫౦ సంవత్సరములముందటికాలమునఁ గవిత్వాలోకమున నీలక్షణసారము ఆడిదము బాలభాస్కరకవి ప్రణీతమని ప్రచారములోనున్నట్లు మనము నిశ్చయింపవచ్చును.

ఇంక నీగ్రంథము విజయనగరసంస్థానమునకుఁ జెందియున్న శ్రీరామతీర్థక్షేత్రమున వెలసియున్న శ్రీరామచంద్రునకుఁ గృతి యీయఁబడినది. ఈదిగువ పద్యములను దిలకింపుఁడు.

క. శ్రీ మనుకులాబ్ధి సోమా
సామజ వరవరదనీజలదశ్యామా

కామారి వినుత నామా
శ్రీమందిర రామతీర్థ సీతారామా !

గీ. రఘువరా యన 'నగ' మొప్పు నఘ విదూర
రఘువర యనంగ నలము పురాణ పురుష
నలము రఘువీర యనఁగ రాజన్య తిలక
రాక్షస విరామ రామతీర్థ గిరిధామ

దీనినిబట్టి కవి విజయనగరప్రాంతము వాఁడని చెప్పుటకు వీలగుచున్నది. ఆనాఁడు శ్రీ పూసపాటి మహారాజులేమి, వారిపోష్యజనములోఁ జేరిన కవులేమి తమకృతులను రామతీర్థ శ్రీరామచంద్రునికే యర్పించుచు వచ్చినటులఁ గనఁబడుచున్నది. శ్రీ పూసపాటి వేంకటపతిమహీపాలుని యుపాభ్యుదయమునకుఁ గృతిపతి రామతీర్థస్వామియే. ఈబాలభాస్కరుని శుద్ధాంధ్రరామాయణము శ్రీరామునకుఁ గృతియనియే మావంశమందు నిలచియున్నవాడుక. ఇదిగాక చెఱువుమీఁద పద్యములు చెప్పిన అడిదము రామకవి సరోజనేత్ర రామతీర్థజానకీమనోహరా" యనుమకుటముతో "పంచచామరవృత్తము"లను రచించి యావేల్పునకే కృతినొసంగెనని ప్రబలమగు వాడుక కలదు. కాఁబట్టి శ్రీ రామతీర్థ శ్రీరామచంద్రునకు సమర్పింపఁబడిన యీలక్షణసారమును రచించినది యీప్రాంతము వాఁడగు బాలభాస్కరకవియే యని మనము ప్రస్తుతము నిశ్చయింపవచ్చునని నాయభిప్రాయము. గ్రంథస్థ నిదర్శనములు లేకపోయినను జనశ్రుతి మొదలగు బాహ్యనిదర్శనములువల్లఁ గలుగుచున్న కర్తృత్వమీకవికి నారోపించి యేతద్గ్రంథమునుగూర్చి కొంత ముచ్చటించుచున్నాఁడను.

ఈలక్షణసారములో నీక్రిందివిషయములు తొమ్మిది ప్రకరణములుగా వివరింపఁబడినది. ౧ అక్షరోత్పత్తిఫలములు ౨ అక్షరముల యష్టాదశలక్షణ పరిహారము ౩ గురులఘువులు గణప్రస్తారము ౪ చందస్సారము ౫ వృత్తనిర్ణయము ౬ కవితాదూష్యములు ౭ ప్రయోగాదులు ౮ నాయికానాయక విభాగము ౯ గ్రహమైత్రిపరిహారము.

కవి యీగ్రంథమును జేయుటలో దిగువనీయఁబడిన లక్ష్యలక్షణగ్రంథసహాయమును గైకొనినట్టుగఁ గనఁబడుచున్నది. ౧ కవితాలక్షణసారము ౨ కవిగజాంకుశము ౩ సులక్షణసారము ౪ కవిజనాశ్రయము ౫ అథర్వణఛందము ౬ శ్రీధరఛందము ౭ ఉభయభాషాకవిమనోహరము ౮ గోకర్ణఛందము ౯ నరసింహ భాగవతఛందము ౧౦ కవిజనచింతామణి ౧౧ కవికంఠపాశము ౧౨ ఉత్తమగండఛందము ౧౩ కవికుముదసుధాకరము.

౧ భారతము ౨ భాగవతము ౩ రామాయణము మున్నగునవి.

ఈలక్షణసారమునంటి లక్షణగ్రంథములు ప్రాయికముగఁ గవులకవితాధోరణిని జూప నవకాశమియ్యనట్టివి. అయినను గ్రంథాంతరములేమిచే నీగ్రంథమునుండియే రెండుమూఁడు మాదిరిపద్యములఁ జూపి యింతటితో నీవ్యాసమును ముగించుచున్నాఁడను.

శా. పద్మప్రోద్భవ సన్నిభు ల్మసజస ప్రవ్యక్తతాంగంబులన్
పద్మాస్త్రాంచిత విశ్రమంబుగ సముత్పాదింతు దుద్యన్మతిన్

పద్మాక్షాయ నిజాంఘ్రిసంశ్రిత మహాపద్మాయ యోగీంద్రహృ
త్పద్మస్థాయ నమోస్తుతే యనుచు నీశార్దూలవిక్రీడితల్.

ఉ. శ్రీరమణీముఖాంబురుహ సేవన షట్పదనాథయంచు శృం
గార రసేశయంచు ధృతకౌస్తుభయంచు భరేవ నంబులన్
బారలగంబులం గదియఁ బల్కుచు నుత్పల మాలికాకృతుల్
గారవమొప్పఁజెప్పుదురు కావ్యవిదుల్ యతితోమ్మిదింటరాన్

గీ. కరుణతోడ మముఁగాచి రక్షింపుము
ఋషముఖావతార ! జలజనేత్ర !
తరణికులలలామ ! ధారాధరశ్యామ !
దేవదేవరామ ! తీర్థధామ !



# 378. కొమరగిరి సంజీవకవి

—✳—

శతకకవులచరిత్రకారు లీకవినిగూర్చి యిట్లు వ్రాసియున్నారు.

"ఈశశాంకశేఖర శతకము, పైకవి యాశుధారలో రెండు గడియలలో వ్రాసిముగించెనఁట! ఈతఁ"డా"శుకవిత్వతాండవో దంచితమండితార్భటి నిడివ్రాసెనఁట! ఇతడు గణాధిపతి ప్రార్థనకుఁ బిమ్మట నవగ్రహములఁగూడ స్తుతించెను. ముకుందమాలాశ్లోకముల భావభాషాంతరీకరణములున్నవి. (౮—౯) కవినందవరీకుఁడు. ఆశ్వలాయనుఁడు. శేషయ, లచ్చమాంబల పుత్త్రుఁడు. వసిష్ఠ గోత్రుఁడు. ఈశతకమునకు హరిహరసంవాదమను మాఱుపేరున్నదో- అది మఱియొకగ్రంథమో - దానినిగూడ రెండుగడియలలో వ్రాసెనఁట శైలిచూపెదను. ఈకవి క్రీ.శ. ౧౭౯౦ ప్రాంతములవాఁడు కావచ్చును.

ఉ. దేవ మహీనుభావ! భవదీయ శుభాంకిత దివ్యపాద సం
సేవన తావకీయ గుణచింతన నామసుధానుపాన సం
భావనగల్గు నాకు నొక పాపములేదని నిశ్చలోజ్జ్వల
శ్రీవిభవంబుఁగల్గునని చెప్పఁగ నొప్పు శశాంక శేఖరా! ౯

చ. అలసతనైన గోపముననైన వికారముతోడనైన నిన్
దలఁచిన వారి కిష్టము లుదారత నిచ్చెదవందు రట్టినీ
లలిత పదాంబుజాతయుగళం బనయంబుఁ దలంచు నాకు ని
శ్చలమగు నీప్రసాదము నొసంగు టదెంత... ౧౮

ఉ. లోకములన్నియున్ గెరలి లుంఠనసేయఁగఁ జకనిల్వ పూ
ర్ణాకరమైన నీదుఘటనాఘటనార్థసమర్థలీల వెని
తాకి మదీయ శాత్రవుల దండనసేయఁగ నన్ను సన్నుతా
స్తోకవిలాసుసేయఁగ విశుద్ధము కాదె... ౩౧

చ. కమలభవాండభాండమునఁ గల్గిన సర్వపురాణశాస్త్రసం
ఘమును మహాసుధానిధి వికాస మనోగుణ శేముషీ నగో
త్తమమునఁ ద్రచ్చి నీవిమల తత్త్వసుధారుచిఁ గాంచునాకు చి
త్తము చిగురొత్తు నెన్న విశదంబుగ నింక... ౪౧



# 379. ఉన్నవ యోగానందుఁడు

— ※ —

ఇతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; గార్గ్యగోత్రుఁడు.

ఈకవి పద్మావతీపరిణయమను ప్రబంధమును, రాజగోపాల శతకమును రచియించెను. రాజగోపాలశతకము "సుగుచిరాకార ఉన్నవపురవిహార రాజగోపాలరాధామనోజఖేల" అనుమకుటముతో నున్న సీసపద్యశతకము. వావిళ్లవారిచే ప్రకటింపఁబడిన ముద్రిత ప్రతిలో 102 పద్యములున్నవి. శతకకర్తపేరీపద్యములలో లేదు. తక్కిన 6 పద్యములు లభించినయెడలనం దీతనిపేరుండి యుండును. పద్మావతీ పరిణయములోని యవతరణికనుబట్టి యీ శతకమును, యోగానందకవి వ్రాసినట్లు తెలియుచున్నది.

ఇందుఁజెప్పఁబడిన ఉన్నవపురము గుంటూరుమండలములోనిది. గుంటూరునకుఁ దూర్పున నిరువదిమైళ్లలో నున్నది. ఉన్నవపుర మును గవి యీక్రింది సీసపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. శ్రీరాజగోపాలశేఖర వరమహో
న్నతగోపురంబు ఉన్నవపురంబు
సర్వంసహా చక్రసంచరద్భారతీ
నాట్యరంగంబు ఉన్నవపురంబు
కామితాఖిలవస్తుకల్పనా రుచిరాభి
నవగోపురంబు ఉన్నవపురంబు

సలలితనిర్మల సలిలధారాపూర
నలినాకరంబు ఉన్నవపురంబు
నవనిధి(శ్రీ)కరంబు ఉన్నవపురంబు
నరసఖస్థావరంబు ఉన్నవపురంబు. ౧౦-౨

ఛంధోవ్యాకరణదోషము లచ్చటచ్చట నున్నను, మొత్తము మీఁద నీశతకకవిత్వము రమణీయముగానే యున్నది. కైలికై పద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

సీ. కరణంబు కాఁపులు గలహించుచుండిరా
యూరుగాధది లత్తుకోరుగాని
అర్థులు వేడిన నడియాస పెట్టినా
దాతగాఁ డాతఁడు ప్రేతగాని
ధనమిచ్చుదాతపద్యము చదువఁడయేని
వందిగాఁ డాతఁడు పందిగాని
సురుచిరసచ్ఛబ్ద శుద్ధిలేకుండెనా
సుకవి కాఁ డాతఁడు కుకవిగాని
వైరముడిగినదూరిదువాఁడె దాత
చదువుగలవాఁడెభట్టువాగ్ఝరియెసుకవి. ౭౧

సీ. సకలయోనులయందు జన్మించి జన్మించి
దినముసుపోట్లకై తిరిగి తిరిగి
యున్మత్తవృత్తిచే నుప్పొంగి యుప్పొంగి
పంచేంద్రియవ్యాప్తిఁ బరగి పరగి
కలుషజాలంబులు గావించి కావించి
మొగినిసంసారాబ్ధి మునిఁగి మునిఁగి

తనుజరాభారంబు దాలిచి తాలిచి
సరవిఁగొన్నాళ్లకుఁ జచ్చి చచ్చి
మరలఁబుట్టంగలేక నీచరణయుగళ
సేవఁగోరితి ననుఁ దయఁగావవలయు. ౯౮

ఈకవి క్రీ. శ. 1750 ప్రాంతమువాఁడని శతకకవులచరిత్రము వాకొనుచున్నది.



## 380. పట్టమట్ట సరస్వతిసోమయాజి

ఇతఁ డార్వేలనియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; హరితసగోత్రుఁడు; పెద్దిరాజు పేరమాంబలకుఁ దనయుఁడు; పోతరాజునకుఁ బౌత్రుఁడు; రఘునాథసోమయాజికిఁ దమ్ముఁడు; ఇతనినివాసము గోదావరిమండలమునందలి రాజోలుతాలూకాలో నున్న వెలవలపల్లి యనుగ్రామము. దీనినే కవి వేల్పులపల్లి యని పేర్కొనినాఁడు. సూతసంహిత, బ్రహ్మోత్తరఖండము అనుగ్రంథములను రచియించి, నిజామురాష్ట్రమందలి బిక్కనవోలు సంస్థానాధీశులయిన, కామారెడ్డి, ఎల్లారెడ్డి యను రెడ్డిభూపతులకుఁ గృతియొసంగి కీర్తిగాంచిన పట్టమట్ట సోమనాథసోమయాజి యీకవికిఁ బూర్వుఁడు ఆతని జన్మస్థానము కూడ నీవెలవలపల్లియే. ఇందునుగూర్చి యాసోమనాథసోమయాజి చరిత్రమునఁ గొంత వ్రాసియున్నాఁడను.

ఈసరస్వతి సోమయాజి పృథుచరిత్ర మనునైదాశ్వాసముల ప్రబంధమును రచించి గోదావరిమండలమందలి ద్రాక్షారామ భీమేశ్వరునకుఁ గృతి యొసంగెను. భీమేశ్వరుఁడు స్వప్నమునఁ గన్పడి కవినిగూర్చి పలికినపలుకు లీక్రిందిపద్యములలో వర్ణింపఁబడినవి.

''కలను భీమేశ్వరుఁడు కలకలన నగుచు
నిలిచి నాతోడ నిట్లని పలికె నపుడు.

సీ. నవఘంట సురధాని నామధేయమువాఁడు
తాత వేల్పులపల్లి పోతరాజు
కవిశేఖరుండనఁ గవిధూర్జటి యనంగ
బెనుపొందు జనకుండు పెద్దిరాజు
సవనదీక్షామహేశ్వరుఁడు శ్రీరఘునాథ
సోమయాజి నిజాగ్రజుండు గురుఁడు
తల్లి పాతివ్రత్యధర్మ బుద్ధికదంబ
కారుణ్యజగదంబ పేరమాంబ

నీకు మద్వరలబ్ధవాణీ ప్రసాద
మంగళవచంబు సకలవిద్యాస్థలముల
పట్టమట్టంక వేల్పులపల్లి వృషాంక
సోమయాజి సరస్వతిసోమయాజి.

ఉ. శైవులలోపలం బరమశైవుఁడు వేదపురాణవాణిచే
దైవగుఁడు నీగురుఁడు ధన్యుఁడు శ్రీశివలంక వారిలో
దేవనిభుండు భక్తశివదేవుఁడు గౌరయగారి సత్కృపన్
భావనకీర్తిఁ గాంచితివి బాలసరస్వతి దీక్షితాగ్రణీ !

క. నేవచ్చితి నీకృతికై
నీవిచ్చితి నను మెచ్చి నీకిచ్చెద నే
నీవాంఛితంబు లన్నియు
దేవాంచితయోగ భోగదీప్తిశుభంబున్.

పై పద్యమునుబట్టి యీకవికి శివలెంకగౌరయ గురువైనట్లు తెలియుచున్నది. మొత్తముమీఁద నీపట్టమట్టవారు శివభక్తులై యారాధ్యులను గురువులనుగా జేసికొనినను, వీరశైవులుమాత్రము కారు. లింగధారణ మొనర్పలేదు. వేదమతమును నిరసింపక, యజ్ఞముల నొనర్చుచు వేదవిహితకర్మానుష్ఠానపరులుగా నుండు చున్నట్లు సోమనాథకవియు, సరస్వతికవియు, రఘునాథయ్యయు యజ్ఞములనుజేసి సోమయాజులగుటయే సాక్ష్య మొసంగుచున్నది. ఈకవికి తండ్రి యగుపెద్దిరాజును, తాతయగుపోతరాజును కవులైనట్లు పై పద్యములోఁ జెప్పఁబడినది కాని వారేగ్రంథములను రచించిరో తెలియ లేదు.

ఈకవి పూర్వకవులను స్తుతించుటలో కవిత్రయమును, శ్రీనాథుని యొకపద్యములోఁ జెప్పి, బమ్మెరపోతరాజును, భీమకవిని, పింగళిసూరనార్యుని వేఱువేఱుపద్యములలో నుతించియున్నాఁడు. ఆపద్యములనిట వ్రాసెదను.

చ. పరుల కసాధ్యమై పరఁగుభాగవతంబు రహస్యమంతయున్
హరికృపచే నెఱింగి మృదులాంధ్రవచోరచనాచమత్క్రియా
కరణ మహాప్రబంధములుగా రచియించిన భానుతేజు బ
మ్మెరపురపోతరాజు ససమీకృతభోజు నుతింతు నెంతయున్.

క. భీమేశ్వరుఁ డీతఁడు మా
నామమువాఁ డనుచు వ్రాసె నాలుకతుద వా
గ్భామిని బీజాక్షర మా
భీమనఁ దలఁచినను గలవభీష్టఫలమ్ముల్.

ఉ. రాఘవపాండవీయ కృతిరత్నముఖాఖిలసత్ప్రబంధరే
ఖాఘటనామహాకవిశిఖామణి సూరపరాజు ధీమణిన్
మాఘమయూరబాణ పరిమాణగుణ ప్రవణప్రథాగ్రణిన్
మాఘవ...కీర్తిఘృణి మాఱట శేషఫణి న్నుతించెదన్.

ఇట్లే అలసాని పెద్దనను, ముక్కు తిమ్మనను, తెనాలి రామలింగ మునుగూడ వేలువేలు పద్యములలో స్తోత్రముచేసి యున్నాఁడు. కాని గ్రంథగౌరవభీతిచే వానినిట నుదాహరింపలేదు.

గ్రంథాంతమున వ్రాసికొనిన నీక్రిందిగద్యవలన నీతఁడు పంచాక్షరీమంత్రోపాసకుఁడైనట్లు తెలియుచున్నది.

"ఇది శ్రీమత్పంచాక్షరీమంత్ర ప్రసాదాసాదితైకసంథాగ్రహణ నవ్యకావ్యవిధాన షట్సాహస్రికుల ప్రధానహరితసగోత్రపవిత్ర చరిత్ర ప్రఘట్ట పట్టమట్ట పోతనామాత్యపౌత్ర పెద్దనామాత్యపుత్త్ర సార సారస్వత విభ్రాజి సరస్వతిసోమయాజి ప్రణీత మయినపృథుచరిత్ర మను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము".

ఈకవి బాల్యములో తణుకుగ్రామమునందున్నట్లును, అచ్చట నన్నయభట్టు యజ్ఞముచేసినప్రదేశ మున్నదనియు, అందొకగొప్ప దైన శమీవృక్షమున్నదనియు, నచ్చటనున్నప్పుడే భీమేశ్వరసాక్షాత్కారము తనకు లభించినదనియు, గ్రంథాంతమున భీమేశ్వరుని బ్రార్థించిన యీక్రిందిపద్యములలోఁ గవి తెలిపియున్నాఁడు.

ఉ. నన్నయభట్టుగారు యజనంబొనరించినచోట జన్మిచె
ట్టున్నది తణుకుతూర్పున సమున్నతమైనది దానినీడ నే
నున్నతతిన్ శిశుత్వమున నున్నతరీతి వరం బొసంగుచున్
నన్నుఁ గృతార్థుఁజేసితిరి నాయుమ నీవును భీమనాయకా!

మ. రసనాగ్రంబును మానసాగ్రము సమగ్రంబైన రంగంబుగా
రసవత్కావ్యవచస్సరస్వతి విహారస్ఫూర్తి నర్తింపఁగాఁ
నసమాన ప్రతిభాతినృత్తిఁ గవితావ్యాహారహారద్యుతుల్
ప్రసరింపన్ నినుఁ బ్రస్తుతించెద సదారక్షింపు భీమేశ్వరా!

శా. ద్రాక్షారామనివాస వాసవమరుద్దత్తాప్సరః కామినీ
దీక్షాలక్షవిలాసలాసక కళాదేదీప్యమాన ప్రభా
సాక్షాదిందువికాస కాసరసురేశా నాదిసంహారి ప
ద్మాక్షీ మ్రలక్షితభాస భాసమధికవ్యాసంగ గంగాప్రియా!

భాగవతచతుర్థస్కంధమున నున్న పృథుచక్రవర్తి కథనాధారముగాఁ జేసికొని యీపృథుచరిత్రమును రచించినట్లు కన్పట్టుచున్నది.

ఈసరస్వతిసోమయాజి మా మాతామహవంశమునకు మూలపురుషుఁడు. క్రీ శ. 1859 సం॥ ఫిబ్రవరినెల 13వ తేదీని మామాతామహుడు యీనాములవిచారణలో ఒకవంశవృక్షమును వ్రాసి యిచ్చియుండిరి. వారే 1854 సం॥ ఆగష్టునెల 20వ తేదీని గశర్న మెంటు గ్రామముల కరణములకు ముట్టేవసతులను గురించిన నం 1 రు తప్సీలు లెక్క యొకటి వ్రాసి దొరతనమువారికిచ్చియుండిరి. ఈరెండును నల్లూరు గ్రామమునందలి యీనాములతో సంబంధించినవి. ఈ గ్రామము మా మాతామహుల జన్మస్థానము. ఇది మానివాసమయిన కపిలేశ్వరపుర గ్రామమునకు నాలుగుమైళ్లదూరములో నున్నది. పైన చెప్పిన వంశవృక్షము నీక్రిందనిచ్చుచున్నాఁడను.

కూటస్థుఁడు
పట్టమట్ట సరస్వతిసోమయాజి
పృథుచరిత్ర కృతికర్త

- గవర్రాజు
  - కామరాజు
    - గవర్రాజు
      - ఉమ్మన్న
        - రామచంద్రుఁడు
          - వెంకట్రాజు
            వయను 40 సం॥
            నిస్సంతు
          - అనంతరామయ్య
            వయిను 30 సం॥
            - కుమార్తె
              సూరమ్మ (తెలిదేవర)
            - చినసూరమ్మ = పోతాప్రగడ
              బలరామయ్యగారిభార్య
              - సీతాపతిరావు
            - సుబ్బమ్మ = వాగంటికృష్ణయ్యగారిభార్య
        - గవర్రాజు
          గ్రంథవిస్తరభీతిచే నీయనవంశము నీయలేదు.
          ఈవంశీయులిప్పుడు నున్నారు.
- కామరాజు
  ఈయనవంశము చాలవిస్తరించినది.
  ఈవంశీయులిప్పుడు నున్నారు.
  కొందఱు విశాఖపట్నంమండలములోని
  కోనాడయందున్నారు.
  కొందఱు నెల్లూరులోనున్నారు.




1 అనంత రామచంద్రమూర్తి
2 ప్రభాకర పరబ్రహ్మమూర్తి
3 వెంకట నరసింహరావు
4 వెంకట సుందరశివరావు

a) భాస్కర అనంతరామన్
b) భాస్కరసుబ్బరాయన్

క్రీ. శ. 1859 సంవత్సరమునాటికి మా మాతామహునకు 30 సంవత్సరములవయ సున్నట్లిందు వ్రాయఁబడియున్నది. తరము నకు 30 సంవత్సరములవంతున చూచితినేని సరస్వతిసోమయాజి హూణశకము 1649 ప్రాంతమునను ఇతనితండ్రి పెద్దిరాజు 1619 ప్రాంతమునను, తాతపోతరాజు 1589 ప్రాంతమునను జననమయినట్లు తేలుచున్నది. పట్టమట్ట సోమనాథసోమయాజి క్రీ.శ. 1578 వ సంవత్సరమునాటికే సూతసంహితను రచియించియుండుటచే సరస్వతిసోమయాజికిఁ బితామహునకంటెఁ బూర్వుఁడగుట స్పష్టము. సోమనాథ సోమయాజి చిన్నతనముననే నిజాము దేశమునకుఁ బోయియుండుటచే నాతనివృత్తాంతము సరస్వతిసోమయాజికిఁ దెలిసియుండదు. అందుచేఁ గాఁబోలు సోమనాథసోమయాజినిగూర్చి యీకవి తన పృథుచరిత్ర మున నేమియు వ్రాసియుండలేదు. 1854వ సంవత్సరములో వ్రాసిన లెక్కలో, మా మాతామహునకును, దక్కినవారికిని, వెలవలపల్లి గ్రామమున 'కంచవ్వారిపంపు' 'బాడవపంపు' 'మోటమట్టిసంపు' 'మెర్కపంపు' అను పేరులతో భూములుండినట్లు వ్రాయఁబడియున్నందున నీవంశమువారికి, మొట్టమొదట వెలవలపల్లి జన్మస్థానమనియు, నచ్చటనుండి నల్లూరు మొదలగు గ్రామములకుఁ బోయి, వృత్తులను సంపాదించుకొనిరనియు నూహింపఁదగి యున్నది. మా మాతామహునకుఁ బురుషసంతానము లేనందున, నాయనయొక్క భూవసతియు, గృహమును దౌహిత్రులమయినమాకు సంక్రమించి మా భుక్తములో నున్నవి. వెలవలపల్లి భూములు మా మాతామహుని కాలములోనే యన్యాక్రాంతము చేయఁబడినవి. అవి మాకు రాలేదు.

సరస్వతిసోమయాజి, దీనినిబట్టి పదునేడవ శతాబ్దిని మధ్యభాగమునం దున్నవాఁడని స్పష్టమగుచున్నది. ఈతని కవిత్వము మృదుమధురపదసంయుతమై యనర్గళధారకలిగి మనోహరముగా నున్నది.

సరస్వతిసోమయాజికిఁ పిమ్మట పట్టమట్టవారిలోఁ గొందఱు కవులుండి రని తెలియుచున్నదికాని వారిగ్రంథములు లభింపలేదు. పట్టమట్ట వారిలో పాపయ్యయను నొకకవి "నల్లురిపురిసోమలింగ వందితురంగా" యను మకుటముతో, నల్లూరునం దున్న సోమేశ్వరునిపై నొక కంద పద్యశతకమును రచించెనఁట. మా మాతామహుఁ డైన అనంతరామ య్యగారును నాయనకుఁ గజుఁ డైన వేంకటరాజుగారును, జ్యోతిష శాస్త్రమున జాతకభాగమునందు గొప్పపండితులనియందురు. వారిని నే నెఱుంగను. సరస్వతిసోమయాజి కవిత్వశైలి తెలుపుటకై కొన్ని పద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

చ. మలయుఁ బురంబునన్ నిరుపమాన విమానసమానధామకో
మల లలనామనోరమ సమాగమభోగమదాంత తాంతతా
జలకలికానికారముఖసారసగంధ సుగంధసారముల్
మలయమరుత్కిశోరములు మారవిహారకరప్రచారముల్. ౧౮

శా. చూపుంజూపును వియ్యమయ్యె సతికిన్ క్షోణీతలస్వామికిన్
దూపుందూపును వియ్యమయ్యెరతికిన్ దోర్దర్పరతిస్వామికిన్
జాపాభ్యాసము చూడుఁడీసభ మహాచాతుర్యమన్నట్లు, త
ద్రూపాహంక్లవచేష్టలొప్పెఁదమిచూపుల్ గ్రీడ మళ్ళింపగన్. ౨౮

చ. కదలిరిపాతకోత్తములు గాముకులుం గవులు న్మహాకవుల్
మొదలిరి సత్ప్రియాణమతి మిశ్రితమిశ్రితతుల్ నిజాశ్రితుల్
పొదలిరి వాంఛితార్థ పరిపూర్ణ సువర్ణ సువర్ణ సంతతుల్
తదనుమతిం బురంబులకుఁ దత్పరదత్పరతత్వరాగతిన్. ౪౮

చ. అలసితిరమ్మలార కుసుమాపచయం బొనరించి దండమీ
యలయిక లేనడంతునని యంబురుహాకరలక్ష్మి ప్రవంపు నె
చ్చెలు లనఁ జెల్వలం దరలిచెన్ జలజోత్పల పత్రవాసనా
లలితమరాళినీ కలకలంబుల శీతలవాతపోతముల్. ౨౮

సీ. హాస్తికంకణములు హాస్తకంకణములు
పదసంపదధికసంపద లొసంగ
మఖజాతవేదంబు మఖజాతవేదంబు
స్వర్గాపవర్గరాజ్యము లొసంగఁ
గళ్యాణతత్వంబు కళ్యాణతత్వంబు
సగుణాగ్గుణవృత్తిచయ మొసంగ
సత్యానుకూల్యంబు సత్యానుకూల్యంబు
సాధ్వీశ్వరత్వంబు సంఘటింపఁ

బరఁగు దైవతకులశిరః ప్రకటకుసుమ
మంజుమకరంద ధారాసమంజసాంఘ్రి
పద్మసన్నిధిసన్నిధి ప్రభవవిభవ
శాశ్వత శ్రీకరుండు సర్వేశ్వరుండు.



# 381. పట్టమట్ట పాపయకవి

ఈకవిచారిత్రము "విస్మృతకళింగాంధ్రకవులు" అనుపుస్తకమున నిట్లు వ్రాయఁబడియున్నది:

"ఇతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; హారితసగోత్రుఁడు; కాపురము విశాఖపట్టణమండలములోని విజయనగరమునకుఁ దూర్పుగా సముద్రతీరమునందున్న కోనాడగ్రామము. "గూడపువలస" యను నూరిలోనాఖరీ యీనామభూములు కలవాఁడయ్యును కులక్రమాగతమువచ్చు కరణికము చేయక కవితావృత్తిచే జీవయాత్రగడిపిన వాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. ఇతనిబాల్యము విద్యాభ్యాసము మొదలగు వాటినిగూర్చి యేమియుఁ దెలియరాకున్నది. పాపయకవివరుని సరసకవితకు మెచ్చి యతనిఁదనముఖ్యాశ్రితునిగాఁ జేసికొని, యశస్సునార్జించిన ధన్యుఁడు వైశ్యకులసంజాతుఁడగు మగటపల్లి కామయ్యశ్రేష్ఠి. ఈవణిక్శిఖామణి సూరమవెంకనంపుత్త్రుఁడు. బాపిసెట్టి పౌత్త్రుఁడు. ఐశ్వర్యగరిమచే నభినవకుబేరుఁడని చెప్పనొప్పిన వాఁడు. దానరాధేయుఁడు సప్తసంతానములు భూమిపై నిలిపి కీర్తిఁగన్న పుణ్యాత్ముఁడు సామాన్యుఁడగు వర్తకుఁడుగాఁ గాలముగడుపుచుండిన యీతనితండ్రి వెంకన్నకును, పిదపనీతనికిని లభించిన యైశ్వర్యమునకుఁ గారణము లోకమిట్లు చెప్పుచున్నది. కోనాడగ్రామమునకు సమీపముగా సముద్రములో నొకయోడ మునిఁగిపోయినందున, అందులోని నల్లమందచ్చులు కొన్ని కోనాడరేవునకుఁ గొట్టుకొనివచ్చినవి. బేలలగు మీలవారు వాటిని పిడకలుగాభావించి, కోమటయిండ్ల నమ్మఁ జూపిరి. వెంకన్నసెట్టి

మాత్రము దాని నిజతత్త్వము గ్రహించి, స్వల్పధనమునకు నాయచ్చులనన్నింటినిఁ గొని విరివిగా వర్తకము సాగించి పదిలక్షలరూపాయల నార్జింపఁగలిగెను. వాని యనంతరము కుమారుఁడగు కామయచంద్రుఁడు వర్తకమువభివృద్ధిచేసి "శ్రీ వెంకటేశ్వర" "రామలింగేశ్వర" "ఆంజనే"యాదినామములతో బదిఓడలు సేకరించుకొని యోడ బేరముసేయఁ దొడఁగెను. ఐశ్వర్యము దిన దినాభివృద్ధినొందెను. ఇట్లుండ నొకకాలమున నీతనియోడలలోఁ గొన్ని కలకత్తాకు వెళ్లివచ్చుచుండఁగా మార్గమధ్యమున నోడసరంగునకు రెండు గుఱుతులు కానవచ్చెను. వెంటనే ఆగుఱుతులుగాఁ గానవచ్చిన వస్తువుల నోడమీఁద వేసికొని కోనాడకు వచ్చి వాటిని దనస్వామికి సమర్పించెను. కామయగారు పెట్టెలను విప్పిచూడఁగా నందొకటి బంగారుకణికలతోను, రెండవది వివిధరత్నములతోను నిండియుండుట చూచి, తనపూర్వజన్మసమార్జిత పుణ్యప్రభావమునకుఁ గడుంగడు నాశ్చర్యమును సంతోషమును జెందినవాఁడై యాయోడవర్తకముతోఁ బాటు రత్నవర్తకముఁ గూడసాగించి లక్షలకొలఁది ధనమార్జించెను. ఈరీతిగ నార్జించిన ధనమును జాలవఱకు ధర్మకార్యములకే వినియోగించి వితరణఖనియని పేరుఁగాంచి ధన్యుఁడయ్యెను. ఈ మహాదాత నూతులు కోనేరులు త్రవ్వించెను. తోటలువేయించెను. దేవాలయములు ప్రతిష్ఠించెను. అన్నసత్రముల నిలిపెను. దీనజనచింతామణియై యనేకములగు పేదకుటుంబముల కన్నవస్త్రము లిచ్చిపోషించెను. కామయచంద్రుని వితరణాదిగుణములను, పాపయకవి యిట్లు ప్రశంసించియున్నాఁడు.

క. ఏనాఁడును గోనాడను
దానము ధర్మంబు నన్నదానము గలవా?

నీనాఁడె కాక వితరణ
కానీనా మగటపల్లి కామయచంద్రా !

ఉ. ఊరూరను గోనేరుల
నోరూర సుధానుకారి నూతన వారి
స్ఫారముగఁ జేయవే శుభ
కారణ గుణ మగటపల్లి కామయచంద్రా !

క. జీనమణీ మంటప హే
మానరణ ప్రభల వెలయు వర్ద్ధాక్ష మహా
దేవ నివాస స్థలములఁ
గావింపవె మగటపల్లి కామయచంద్రా !

కారణజన్ముఁడగు నీకామయచంద్రుఁడు డెబ్బదిసంవత్సరములు జీవించి, క్రీ.శ. ౧౮౩౮ సంవత్సరములో స్వర్గస్థుఁడయ్యెనని, ఆయన పౌత్రులగు బుచ్చికామయ కవిగారు కామయచంద్ర శతకపీఠికలోఁ దెలిపియున్నారు.

కవికాశ్రయుఁడైన కామయ్యశ్రేష్ఠి కాలము క్రీ. శ. ౧౭౬౮-౧౮౩౮ మధ్యకాలమగుటచే పాపయకవీంద్రుఁడుగూడ నా కాలము వాఁడే యని మనము నిశ్చయముగాఁ జెప్పవచ్చును. పాపయకవికి సంస్కృతాంధ్రములయందుఁ జక్కని పాండిత్యముకలదు. కవిత్వము మృదుమధురమై యొంతయు మనోహరముగానున్నది. ఇతనికవిత్వము నందు సంస్కృతాంధ్ర పదజాలముసమముగాఁబడి యచులీనుచున్నది. ఈతఁడువ్రాసిన గొప్పగ్రంథము లేవియుఁ గానరావు. ఒక్క కామయ చంద్రశతకముమాత్రము అచ్చుపడి కతిపయసంవత్సరములనుండి

ప్రచారములోనికి వచ్చినది. మహిషాసురమర్దనీ శతకమొందు రచించినట్టుగా జనశ్రుతి గలదు. కాని అదియుఁగూడ సంపూర్ణముగా లభింపలేదు. చాలకష్టముపైని దానిలో నొకపద్యముమాత్రము లభ్యమైనది. ఇదిగాక శ్రీమద్రామాయణములోని సుందరకాండ కథను దండకముగాఁ జెప్పియున్నాఁడు. కామయచంద్రశతకములోని గొన్ని పద్యములు, అడిదముసూరకవి విరచితమగు పొణ్ణుపాటి వెంకట మంత్రి శతకములోని పద్యముల ననుకరించియున్నవి. ఉదాహరణముకొఱకు సూరకవిపద్యములును పాపయకవి పద్యములును గ్రంథకర్త ఉదహరించెనుగాని గ్రంథవిస్తరభీతిచే నిందుదాహరించలేదు.

కవితాశైలి తెలియుటకై యీతని పద్యములఁ గొన్నిటి నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

క. లలి సంస్కృతాంధ్రభాషా
కలితకవిత్వంబు ప్రీతికరమగు ద్రాక్షా
ఫలములలో విరితేనియఁ
గలిపిన క్రియ మగటపల్లి కామయచంద్రా!

క. తొయ్యలులు వీధులంజన
నియ్యకొనరు నీదుకీర్తి హేలావతి తా
వెయ్యేల రచ్చకెక్కెను
గయ్యాళా! మగటపల్లి కామయచంద్రా!

క. హారమునకు దారము, వ్యవ
హారమునకు నీతి, భూమికధిపతి తరికిన్

మేరయగు మారుతంబును
గారణములు మగటపల్లి కామయచంద్రా!

క. తన్నాశ్రయించు మనుజుని
మన్నించని ప్రభువుకన్న మహీపము మేలా
దున్ని ఫలంబిచ్చును ద్విజ
గన్నుత! శ్రీమగటపల్లి కామయచంద్రా!

ఉ. ఏనినునమ్మి యన్యులను నేమని వేడఁగఁబోదు నమ్మ! నా
హీనతఁ బాపి ప్రోవుమిట నేనుఁగునెక్కియు దిడ్డిదూరఁగా
లేనుగదమ్మ! కోర్కెలు ఫలింపఁగ జేయఁగదమ్మ! వేగ మీ
శానకళత్ర హైమగిరిజా! మహిషాసురమర్ధనీ! శివా!

సుందరకాండ దండకము :-

కాలారి పుత్రా! స్ఫురద్దివ్య సౌందర్య హేమాభ గాత్రా! లసద్భీక రోదార ఘోరార్ణ వోల్లంఘనోపాయ సూత్రా! లసత్ఫుల్ల కంజాత నేత్రా! భుజాటోప విస్ఫూర్తితా నేక నక్తంచరాభీల గాఢాంధకార ప్రభాకోటి కంజాత మిత్రా! సురాధీశ కుంభీంద్ర గౌరీంద్ర తారేంద్ర నీహార డిండీర కర్పూర మందార కుందప్రభా శారదోద్యద్యశస్సార...

ఓవానరాకార నే మానవాకారుఁడన్ క్రూరుఁడ న్నిమ్ముఁ బూజించి ప్రార్థించి సేవించగా నాకభూలోకనాగేశులుం జాల రే నెంతఁ వాఁడన్...

చిత్రగంభీర రత్నాంచిత స్తంభ కాంతి స్ఫురత్తోరణానీక సంశోభితాపార లావణ్యా భృచ్ఛాలికా వర్గమా, యిందిరాధాము

కైలాస భూమీధరేంద్రోపమోద్దార శృంగార సౌవర్ణ దుర్గంబు లా గేహావర్గంబులా బంధువర్గంబులా, రాజమార్గంబులా, సందులా గొందులా వాడలా నీడలా మేడలా పేటలా తోటలా బాట లేర్పాటుగా, తేటతెల్లంబుగా నీటుగా వచ్చి శోధింపవా ?

ఈ పాపయకవి మా మాతామహవంశము లోనివాఁడు. మా మాతామహునకును, ఈపాపయకవికిని మూలపురుషుఁడు పట్టమట్ట సరస్వతిసోమయాజి (పృథుచరిత్రకృతికర్త). ఈతని వంశవృక్షము నీతనిచరిత్రయందిచ్చియున్నాఁడను. అందు మా మాతామహుని శాఖమాత్రమే యివ్వఁబడినది. పాపయ్య కవి శాఖ యీక్రింది నిచ్చుచున్నాఁడను.

సరస్వతిసోమయాజి

- గవర్రాజు
  - ఈశాఖ సరస్వతిసోమయాజి చరిత్రమున నీయఁబడినది.
- కామరాజు
  - భీమరాజు
    - కామరాజు
      - భీమరాజు — ఈతని వంశము విస్తరిల్లియున్నది.
      - సోమరాజు
        - పాపయ్యకవి
          - పెదసోమరాజు
            - సాంబయ్య దత్తుఁడు 1859వ సంవత్సరమున కితనకై వేంఙ్లవయును.
      - భవానీశంకరుఁడు — ఈతని వంశము విస్తరిల్లియున్నది.

నల్లూరుగ్రామలెక్కలలో పాపయ్యకవి శాశ్వత యీనాందారు అని వ్రాయబడియున్నది అనగా క్రీ.శ. ౧౭౯౯ వ సంవత్సరము లెక్కలో నీతని పేరున్నదని యర్థము. దీనినిబట్టిచూచినచోఁ బైనఁ జెప్పిన కవికాలము సత్యమని తేలుచున్నది. గోదావరిమండలము నందలి రామచంద్రపురము తాలూకా నల్లూరుగ్రామ లెక్కలలో పాపయ్యకవివంశీయులు విశాఖపట్టణమందలి కోనాడయందున్నారని వ్రాయఁబడియున్నది. ఈపాపయ్యకవికి గోదావరిమండలమందలి అమలాపురం తాలూకాలోని వెలవలపల్లిలోను పైనఁ జెప్పిన నల్లూరులోను, భూములుండెడివి. విమర్శించి చూడఁగా పాపయ్యకవి తండ్రి సోమరాజుకాలములో వీరు కోనాడ నివాసులైనట్లు కన్పట్టుచున్నది. పాపయ్యకవి యప్పుడప్పుడు నల్లూరువచ్చుచుండెడివాఁడనియు నల్లూరునందలి సోమేశ్వర స్వామిపైని "నల్లురిపురిసోమలింగ, నందితురంగా" యనుమకుటముతో శతకమును రచియించెననియు నాతఁడు మగటపల్లి కామయశ్రేష్ఠి నాశ్రయించియుండెడివాఁడనియు నల్లూరునందలి పెద్దలు చెప్పఁగా నేనువినియున్నాఁడను. విస్మృత కళింగాంధ్రకవులచారిత్రములో నీకవియింటిపేరు "పచ్చమెట్ట" అని వ్రాయఁబడినది. అదిపొరపాటు. ఈతనిగృహనామము "పట్టమట్ట" యైయున్నది. కృష్ణామండలములో పట్టమట్ట యను గ్రామమున్నదని వినుచున్నాఁడను. పూర్వమీపట్టమట్టవారాగ్రామవాసు లయియుందురు.



# 382. గోపాలుని సింగయ్య

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; హారితస గోత్రుఁడు; భాస్కరామాత్యపౌత్రుఁడు; వీరనమంత్రికిని యోబమాంబకును బుత్రుఁడు.

ఈకవి కిరాతార్జునీయము నైదాశ్వాసముల పద్యకావ్యముగా నాంధ్రీకరించి, అహోబల నృసింహస్వామి కంకితము చేసెను. ఇతఁడు కాళిదాసాది సంస్కృతకవులను నుతించి యాంధ్రకవులలో నన్నయ తిక్కనలను భాస్కరకవిని మాత్రమే యీక్రింది రెండుపద్యములలోఁ గీర్తించియున్నాఁడు.

గీ. అరయ గీర్వాణ కవివర్యులైన కాళి
దాస భవభూతి మాఘ సత్కవిమయూర
దండిబాణాదులైనట్టి దండికవులఁ
దలఁచి కీర్తించి, మఱియు సంతసము నొంది.

గీ. శబ్దశాసన బిరుదుచే జగతి మీఁదఁ
బ్రౌఢిఁగాంచిన నన్నయభట్టుఁ గొలిచి
సోమయాజిని గీర్తించి సుస్థిరముగ
భాస్కరాహ్వయు మదిలోనఁ బ్రస్తుతించి.

భారవి మహాకవి సంస్కృతభాషలో కిరాతార్జునీయమను నొకకావ్యమును రచియించియుండెను. దానిని కవిపేరున భారవి యనియే పిలుచుచుందురు. సంస్కృతవిద్యార్థులు మొట్టమొదట

నభ్యసించెడి కావ్యపంచకములోఁ నిదినాల్గవది. దాని నీతఁడాంధ్రీక రించి నట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

క. భారవి భట్టు రచించిన
భారవి యను కావ్య మవనిఁ బ్రఖ్యాతిగ నే
నారూఢినిఁ దెనిఁగించెద
ధారుణి నాచంద్రనిత్య తారార్కముగన్.

పాండవు లరణ్యావాసము చేయుచున్నప్పు డర్జునుఁడు శివు నిఁగూర్చి తపంబొనర్చుటయు, గిరాతవేషమున నీశ్వరుఁడు ప్రత్యక్ష మై యర్జునుని తోయుద్ధ మొనరించి, యాతని పరాక్రమమునకు మెచ్చి పాశుపతాస్త్ర మొసంగుటయు, ననుకథ యిందు వర్ణింపఁబడినది. ఈకథ భారతారణ్యపర్వమందున్నది.

భారవియందలి శ్లోకమునకు మక్కీకిమక్కీగా నాంధ్రీకరింపక యీతఁడు కొంతస్వాతంత్ర్యమును గైకొని తనకావ్యరచనమును సాగించినాఁడు.

ఈకవి పింగళి సూరనార్యకవికృతమైన ప్రభావతీ ప్రద్యుమ్న మును యక్షగానముగా రచించి తన యిలువేల్పయిన అహోబల నరసింహస్వామికిఁ గృతియొసంగెను. యక్షగానములలో నిది యుత్తమమయినది. ఇందు కవి తనవంశావళి నీక్రింది ద్విపదలలోఁ జెప్పియున్నాఁడు.

"సిరులిచ్చు మమ్మేలు శ్రీమంగళాద్రి
నిలయుఁడై నూతకి నెలకొన్న వరద

రాజగోపాలుఁడై రమణీయ లీల
జనులకెల్ల... సంపద లిచ్చు
(శ్రీయోబళాద్రి) నృసింహుని పేరఁ
దద్వరభక్తుఁడై ధరలోన వెలయు
నతుల గోపాలాన్వయాంభోధి చంద్రు
డనఘు భాస్కరమంత్రి యాత్మజుఁడైన
వీరనమంత్రికి వెలఁదియోబమకుఁ
గూరిమి తనయుండు గుణరత్న రాశి
* *
నలువొప్పు సింగయ నామధేయుండు
ఘనబుద్ధితో యక్షగానంబు చేసె
* *
కరమొప్ప మున్ను పింగలి సూరసుకవి
వరుఁడు చెప్పిన ప్రభావతీప్రద్యుమ్న
మను ప్రబంధము మోదమానహితఁగను
నను నేలినట్టి శ్రీనరసింహదేవు
నకు నంకితంబుగా నానేర్పు ఫణితి
సుకవులెల్లను మెచ్చ సొంపులు హెచ్చ
వినుజనంబులకెల్ల వేడుకమించ
ఘనరీతులను యక్షగానంబుగాను
వరచిత్రశృంగార వర్ణన మీఱ
విరచింతు నంతయు విస్ఫుటంబుగను.

ఈకవి కర్నూలుమండలములోని వాఁడైనట్లు అహోబలనృసింహ స్వామి యీతని యిలువేల్పని చెప్పుటచేతఁ దెలియుచున్నది.

పై ద్విపదలో "మాతకి నెలకొన్న వరదరాజగోపాలుఁడై" అను వాక్యములవలన నీతఁడు "మాతకి" యనుగ్రామనివాసుఁడై నట్లు కన్పట్టుచున్నది. కాని కర్నూలుమండలమూలోఁగాని తత్సమీపమండలములలోఁగాని 'మాతకి' యనుగ్రామము గన్పించుటలేదు, అదియిప్పుడేపేరున నున్నదో! బ్ర.శ్రీ.వీరేశలింగముపంతులుగారు క్రి. శ. ౧౮౯౯ వసం॥మున ప్రకటించిన యాంధ్రకవులచరిత్రమున "ఈకవిపుత్రిఁడెనుబది సంవత్సరములక్రిందజీవించియుండెను, కాఁబట్టి కవి నూఱుసం॥ములక్రిందటివాఁడు" అనివ్రాసియున్నారు. ఎనుబదిసంవత్సరములక్రిందట ననఁగా, ౧౮౧౯ న సంవత్సరమునాటికి, కుమారున కేఁబదిసంవత్సరములు వయసుండెనని తలంచితిమేని యాతఁడు ౧౭౬౯ ప్రాంతమున జన్మించియుండును. అప్పటికిసింగయ్యకు ముప్పది యేండ్లుండును కావునఁసింగయకవి క్రి.శ. ౧౭౩౯ ౧౭౯౯ నడుమ నుండియుండునని తలంపవలసియున్నది.



# 382. దిట్టకవి నారాయణకవి

ఇతఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు; అచ్చనామాత్యపౌత్రుఁడు; పాపరాజకవిపుత్రుఁడు. ఈకవి రంగారాయచరిత్రమను మూఁడాశ్వాసముల వీరరసప్రబంధమును రచించి, బెల్లముకొండప్రభువగు మల్రాజు రామారాయణిం గారికి కృతియొసంగెను. ఆంధ్రదేశమున సుప్రసిద్ధమైన బొబ్బిలియుద్ధకథ యీగ్రంథమున వర్ణింపఁబడియెను.

కృతిపతి, తనను బిలిపించి యీగ్రంథమును రచింపుమని కోరినట్లీక్రిందిపద్యములలోఁ గవి చెప్పికొని యున్నాఁడు.

సీ. పురితగుడక్షోణి భృత్తిత్రమండలోచిత
పారిజ్యరాజ్యరమాధురంధరుండు
దాన ధారా ధౌత ధరణీ సుపర్వాను
సారిదారిద్ర్య రజస్తముండు
సంగీత సాహిత్య సరస విద్యారస
రసికతా మహిత సారస్వతుండు
సామంతభూపాల సంప్రేషిత ద్విప
దానకర్దమిత సద్మాంగణుండు
పద్మనాయక కుముదినీబాంధవుండు
దర్పితారాతి రాజన్యదర్పమథన
రాజితాటోపకేళి మల్రాజవంశ
పద్మవనహేళి రామనృపాలమౌళి.

మ. నను నానాపృథివీంద్రచంద్రకృతసన్మానున్ రఘూత్తంస పా
వన పాదాంబుజ సేవనా నిరతు సత్రాప్తాచీన విద్వత్కవీ
శ నికాయాదరణీయ దిట్టకవి వంశ ప్రోద్భవున్ ధీరసా
యను నారాయణుఁ జూచి యిట్లుపలికెన్ హార్దాంబుధిన్
దేల్చుచున్.

గీ. హైమభూషావిశేషవర్షాశనాగ్ర
హారముఖ్యబహుకృతుల్ గారవమున
నందుకొంటివి మాచేత నస్మదాశ్రి
తాగ్రణివి దిట్టకవిరాజ యరుణతేజ

ఉ. భారతయుద్ధమట్టు లతిభాసురతం గనుపట్టుచు న్మహా
వీరరస ప్రధానమయి వేడుకనింపెడు రావువారి దు
ర్వార రణ ప్రసంగ మతిరమ్యతరం బది గద్యపద్యసం
భారయుతంబుగా నొక ప్రబంధమొనర్పు మదంకితంబుగన్.

గ్రంథాంతమందలి యీక్రింది గద్యవలన నీతాని గోత్రాదులు తెలియఁగలవు.

"ఇది శ్రీమత్కాశ్యపగోత్ర దిట్టకవివంశ పవిత్రాచ్చనామాత్య పౌత్ర పాపరాజకవిపుత్ర శ్రీరామచంద్రచరణారవింద ధ్యానపరాయణ నారాయణాభిధాన ప్రధానమణి ప్రణీతంబైన రంగరాయ కదన రంగచరిత్రంబను మహాప్రబంధంబు"

ఈక్రిందిపద్యములో "యీపూరి పురవీరభద్రుని" నుతించి యుండుటచేత నీకవియీపూరు వాస్తవ్యుఁడని తోఁచుచున్నది.

శా. చాపంబున్ డమరు త్రిశూలశరముల్ శాతాసి ముఖ్యాయుధ
వ్యాపారంబునఁ బాణి పంక్తులఁ దలిర్పన్ శాబరోద్వేల హే
లాప్రంభావమునం జెలంగి విజయోల్లాసంబునం బొంగు న
య్యాపూరీపుర వీరభద్రుఁడు జయంబిచ్చున్ గృతి స్వామికిన్.

ఈపూరు గుంటూరుమండలమున వినుకొండతాలూకాలోను బెల్లముకొండ గుంటూరుమండలమున సత్తెనపల్లి తాలూకాలోను నున్నవి. కవి యీగ్రంథమున కృతిపతియగు మల్రాజు వారియొక్కయు బొబ్బిలిసంస్థానాధిపతులగు రావువారియొక్కయు వంశములను వర్ణించియున్నాడు. రావువారి వంశమును వర్ణించినభాగము ముద్రితమైనపిమ్మట, నందుఁ గొంతమార్చి బొబ్బిలిసంస్థానాధిపతులు తమయాస్థానపండితులచే వేరువిధమున పద్యములు వ్రాయించి, దానిపై నంటింపించినట్లు కన్పట్టుచున్నది.

ఈగ్రంథమున వర్ణింపబడిన బొబ్బిలియుద్ధపుకథ ఆంధ్రదేశమున ప్రబంధరూపకముగను నాటకరూపకముగను, గేయరూపకముగను రచింపఁబడి పండితపామర సంవేద్యమై యున్నది. ఆకథను క్లుప్తముగ చరిత్రాంశములతో, బ్రశ్రీ వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవులచారిత్రమున వ్రాసియున్నారు. గ్రంథవిస్తరభీతిచే నాకథనే నిట మరల వ్రాయఁ బూనుకొనలేదు.

భారతయుద్ధమును తిక్కన వర్ణించినట్లీకవి యుద్ధభాగమును, దాన్ముఖ్యయముగ జూచినట్లు వీరరస మొలికిపడునట్లు వ్రాసియున్నాఁడు. అచ్చటచ్చట వ్యాకరణదోషములున్నను, మొత్తముమీద నీతని కవిత్వము రసవంతమై మనోహరముగా నున్నది. బొబ్బిలియుద్ధము హూణశకము ౧౭౫౭ వ సంవత్సరము జనవరినెల ౨౪ వ తేదీని

జరిగినది. కవి యీగ్రంథమును ౧౭౫౦ వ సంవత్సర ప్రాంతమున రచియించినట్లు తెలియవచ్చుచున్నదని కవిచరిత్రకారులు వ్రాసిన మాటసత్యము కావచ్చును.

ఈతని కవిత్వశైలి తెలియుటకై కొన్నిపద్యముల నిటనుదాహరించు చున్నాఁడను.

శా. ఢిల్లీపాదుషహా నియోగమున రూఢిన్ రాజరాజా నిజా
మల్లీ పేరట మేటిసాహెబు సుబాయాత్మం గళింగంబు రా
జల్లీలన్ ఘనుఁడా ఫరాసునకు మూసాబూసి యన్వాని క
త్యుల్లాసంబున నాధిపత్యమొసఁగన్ యోజించి లాలింపుచున్.

సీ. పోలుపొంద గాకర్లపూడి జగన్నాథ
రాజుగారొక కొంతపౌఁజు తోడ
సత్యవరపుపురస్వామియౌ నలరామ
భద్రరాజొక కొంతబలము తోడ
ఘనయశోనిధి ముఖకాశిపతి క్ష్మా
ధనమూళి యొక కొంతదళముతోడ
నలఘు విక్రముఁడు జింతలపాటి నీలాద్రి
రాజుగారొక కొంత పౌజుతోఁడ
విజయరామరాజ క్ష్మావిభుని మోల్ల
నేత్రిపర్వంబొనర్చిరి నిజభుజాభు
జంగరసనాయమాన ప్రచండనిశిత
మండలాగ్రప్రభానళుల్ మెండుకొనఁగ. ౧౮

ఉ. ఖండనభీముఁ డార్యజనబంధుసముద్రుఁడు భాగ్యవైభవా
ఖండలతుల్యుఁ డర్థిజనకల్పమహీజము భూపలోక మా

ర్తాండుఁడు వైరివీరభటదర్పవిదారణ బాహువిక్రమో
ద్దండుఁడు రావు రంగవసుధావరుఁ డాతని నెన్నశక్యమే ౨ఆ

చ. పొగలుచు మీరలిల్వెడలి పొమ్మను సుద్దులు కోటలోన మా
పగతురఁదెచ్చిడింతుమను భాషణము ల్వివరించి చూడఁగాఁ
దగవులుగావు నూర్జితపథమ్ములు గావవి మీకునిట్టి వి
య్యగణితపౌరుషాధికులమా మముబోంట్లకు గావునర్హముల్.

సీ. కోటపేరిటిశక్తి గ్రుడ్లెఱ్ఱగావింపఁ
బోరిఁబోరిరాలు నిప్పులాయనంగ
రణదుర్గ మీఁదనీరంధ్రంబుగాఁ జల్ల
రాజిల్లునాచార లాజ లనఁగ
గడిదుర్గమనియెడి కాలాహి గ్రక్కిన
క్రొవ్వేడిమి విసంపు గుళికలనఁగ
రంగరాయక్షమారమణాభ్రమునఁ బుట్టి
తోరఁగెడు పిడుగుక్కుతునక లనఁగ
లెక్కకెక్కుడుగాఁ దూగు రేకలాలు
గుంటికోపులు జబురుజంగులు ఫిరంగు
లొక్కమొగిగాలు గావింపనుక్కు మెఱసి
గుండ్లగుంపులు జడివాన గురిసినట్లు. 3 ఆ

తే. గీ. మరియు నారాయమన్నని మానవతియుఁ
బాణితలమున శాతకృపాణిఁ బూని
దానిచే మేను దొరఁగె మద్వైరి వంశ
మకట నిర్వంశమగుఁ గాకయని శపించి. 3 ఆ

మ. అప్పుడాతాంధ్ర కులాభిమాననిధి యాహా! రాజదేవేంద్ర! నీ
విపుల ప్రాభవశక్తి నీ నిఖిల పృథ్వీభారధారేయతా
నిపుణత్వంబును భాగ్యము న్నలభచన న్నీ చేయు దుశ్చేష్ట ని
ట్లుపభోగింపఁగ నయ్యెనిట్టిదెతయంచు న్వాత్రివర్త్తిల్లఁగన్. 3ఆ



# 383. దిట్టకవి రామచంద్రకవి

—***—

ఇతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; కాశ్యపసగోత్రుఁడు; ఇతనితండ్రి రంగారాయచరిత్రమును రచించిన దిట్టకవి నారాయణకవి; శకుంతలా పరిణయము, సేతుమాహాత్మ్యము, రామకథాసారము, అను గ్రంథములను రచించిన దిట్టకవి పాపరాజుగారీకవికిఁ బితామహుఁడు.

ఈకవిరచించిన ఉద్దండరాయశతకము, రఘుకులతిలకశతకము, రాజగోపాలశతకము, మహిషాసురమర్దనిశతకము అను నాల్గుశతకము లను వావిళ్లవారు ముద్రింపించి ప్రకటించియున్నారు ఆశతకపీఠికలలో కవిచారిత్రమును శతావధానులు శేషాద్రిరమణకవులు వ్రాసియు న్నారు. ఈకవి రచించిన హేలావతిదండకము, ఒకప్రబంధములోని వాసిరెడ్డివారి వంశచారిత్రమును వర్ణించిన కృత్యాది. అనునవి

శేషాద్రిరమణకవులయొద్దనున్నవి. ఈకృత్యాదిచే నుద్దేశింపఁబడిన ప్రబంధము లభ్యముకాలేదు. దీనినిబట్టి యీకవి కొన్ని ప్రబంధము లనుగూడ రచియించియుండునని యూహింపవలసియున్నది.

ఈకవి నివాసము కృష్ణామండలములోని నందిగామతాలూకా గొట్టుముక్కల. ఈతఁడు అమరావతిరాజధానిగాఁ బెద్దదేశమును పరిపాలించిన కమ్మప్రభువులగు వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడుగారి సంస్థానమున నాస్థానకవిగానుండి వాసిఁగాంచినవాఁడు. ఇతఁడు నిగ్రహానుగ్రహసమర్థుఁడును బిండిప్రోలి లక్ష్మణకవివలెఁ, దిట్టుచు దీవించుచు, గవితఁజెప్పి ధనార్జనముచేసిన ప్రతిభాశాలి. ఈతనిని గూర్చిన చాటుపద్యమొకటి యీక్రింద నుదాహరించుచున్నాఁడను.

క. దిట్టకవి రామచంద్రుఁడు
దిట్టిన ఱాయైనఁబగులు దీవించిన యా
చెట్టైనఁ జిగురుఁ బెట్టును
గట్టిగఁ దొల్లింటి భీమకవి కాఁబోలున్.

ఈతనకవిత్వము ధారాశుద్ధికలిగి భావసంయుతమై రమణీయముగా నుండును. కవి తననుగూర్చి ఆయాశతకములయందు వ్రాసికొనిన పద్యముల నిటవ్రాయుచున్నాఁడను.

క. ప్రాచుర్యసమధికమనీ
షాచణ దిట్టకవి రామచంద్రుని కతకం
బాచరణ సేయునగు భ
ద్రాచల రఘుతిలక నిటల తటనటదలకా...

—రఘుకులతిలకశతకము.

ఉ. శ్రీరమణీ విశేషగుణ చిహ్నిత పీవు భవత్కృపాప్తిచే
ధీరుఁడ కశ్యపాన్వయుఁడ దిట్టకపీందుఁడ రామచంద్రుఁడన్
గారవమొప్ప వృత్తశతకంబు రచించితి దీని సమ్మణీ
హారముగా గ్రహింపు మహిషాసురమర్దని పుణ్యవర్ధనీ.
—మహిషాసురమర్దనీ శతకము.

మ. ద్విజరాడ్వాహన నేను దిట్టకవిసూతిన్ గశ్యపర్షీంద్ర గో
త్రజుఁడన్ నామము రామచంద్రుఁడు భవద్దాసుండ
నాయందుఁ బ్రే
మ జిగుర్పన్ శతకంబు గైకొనుము శ్రీమద్దాలి యుద్దండ రా
య జయ! శ్రీ సువిధేయ! భక్తజనగేయా! నిత్యభాగ్యోదయా!
—ఉద్దండరాయశతకము.

చా. శ్రీమత్కాశ్యపగోత్ర దిట్టకవి వంశీయాఢ్యుడన్ రామచం
ద్రామాత్యాంకుఁడ నీకథల్ శతకపద్యాగ్రూఢి వాకుచ్చితిన్
స్వామీ! యీశతకంబు గైకొనుము నీసామర్ధ్య మత్యంతమూ
గామతోద్భవక ! గొట్టుముక్కలపురాకా ! రాజగోపాలకా !

శ్రీ వాసిరెడ్డి వెంకటాద్రిప్రభువు క్రీ. శ. 1751 లో జన్మించి 1816 వ సంవత్సరమున కీర్తిశేషులైరి. కావున తదాస్థానముననున్న రామచంద్రకవి యాకాలములో నున్నవాఁడనుటస్పష్టము. శేషాద్రి రమణకవులు మహిషాసురమర్దని శతకపీఠికలో మఱియొక నిదర్శనమును జూపించియున్నారు. నూజివీటి సంస్థానోద్యోగి రామచంద్రకవి మాన్యము ఫలసాయము విషయములో కాణేదారుకు వ్రాయించిన యాజ్ఞాపత్రి మొకటి కవివంశీయులయొద్ద నుండగా తెప్పించిరఁట దాని నకలిది:—

శ్రీమత్సకలగుణసంపన్నులయ్ని శ్రీమహామ్మేరు సమానాధీరు లయిన దేవరాజు వెంకటాచలంకు నారయ్యగారు దండం. స్న ౧౧౭౯ ఫసలీ మ॥ పెదమద్దాలి॥ వ॥ వుయ్యూరు తాలూకు దిట్టకవి రామచంద్రుడిగారిమాన్యము హా॥ సా॥ పట్లంకు సాలాబాదు చొప్పున సర్వదుంబాలా శెలవు యిచ్చినాము. మహాస్సులు కమామిషు చేయించ్చాకుని కొంచపోనియ్యవలెను. వికృతినా॥ సం॥ జ్యేష్ఠ శు ౨. నారయ్యవ్రాలు" ఇట్టి యాజ్ఞాపత్రములు ౧౧౬౮, ౧౧౬౯, ౧౧౭౦ ఫసలీలవికూడ వంశీయులవద్దనున్నవఁట.

ఫసలీ ౧౧౬౮ అనగా క్రీ. శ. ౧౭౫౮ వ సంవత్సరము. ఈకాలము పై కాలముతో సరిపోవుచున్నది.

రఘుకులతిలకశతకము:— "రఘుతిలకనిటలతటనటదలకా" అను మకుటముతో 101 కందపద్యములుగల యీశతకమునందు భక్తిరసము చక్కఁగాఁ జూపఁబడినది. సులభమైన పదములతో బాలురు స్త్రీలు కూడ పఠించుటకు యోగ్యముగానున్నది.

క. మునుపటి తనువున నినుఁ గొ
ల్వని దోసముచే జనింపవలసె నిపుడు గొ
ల్చినవాఁడన్గాతి నీకృపఁ
దనువుము ... ... ... 30

క. బాఁపఁడు గొట్టిన శునకము
వాపోవుచు మొఱలుబెట్ట వాత్సల్యముచేఁ
బాపితివి నివిరి మానస
తాపము ... ... ... ౬౪

క. జాల్ముఁడ నిన్నుఁ దలంపన్
ప్రాల్మాలితి నిన్న నేఁడు బలికెదఁ నీకేఁద
ప్పాల్మఱచి కరుణ సేయుము
తాల్మిన్ ... ... ౯౧

మహిషాసురమర్దనీ శతకము:— "అమరావతిలోని యమరేశ్వరాలయమునందలి మహిషాసురమర్దనినిగూర్చి యీశతకమును గవిరచించెనని వంశీయులు చెప్పుచున్నారు. మహిషాసురమర్దని పుణ్యావర్ధనీ" యనుమకుటముతోఁ జంపకోత్పలమాలలలో 101 పద్యములుకలవు. ఇందలి కవిత్వము సమసంస్కృతాంధ్రపద సంయుతమై ప్రౌఢముగా నున్నది.

ఉ. ఔనని యాజగజ్జనకుఁడైన మహేశునకంటె లెస్సగాఁ
బూని సమస్తలోకములు పోషణ జేసెడి తల్లివౌ కదా
జానుగ నన్ను షణ్ముఖుని చాడ్పున మన్ననసేయ వమ్మ నీ
కానతి సేతునమ్మ ... ... ౨

ఉ. మందుఁడ భావిదర్శనసమర్థుఁడఁగాను భవత్ప్రభావముల్
పొందుగ సంస్మరించుటకు బుద్ధి దలిర్పదు జ్ఞానహీనుఁడన్
నందనుపట్ల తల్లికొక నాఁడును నేరము లగ్గమౌనె నా
యందును నట్లనీవు ... ... ౭౪

ఉ. పొందుగ స్తన్యపానపరిపూరితుఁడై గుహుఁడుచ్చి ముందఱన్
జిందులు ద్రొక్కఁ దన్ముఖశశింగని ముద్దొనరించి మానసా
నందముతోడఁ గన్గొనెడి నాఁటి దయాదృతి నాపయిన్ విని
ష్పంద మొనర్పవమ్మ... ... ౧౬

ఉద్దండరాయశతకము:— "మద్దాలియుద్దండరాయ జయశ్రీ సువిధేయ! భక్తజనగేయా! నిత్యభాగ్యోదయా!" అను మకుటముతో, శతకమంతయు మత్తేభవృత్తములతో, జకారప్రాసతో, రచింపఁబడినది. ఏకాక్షరప్రాస శతకమైనను ప్రాసకొఱకు వ్యర్థపదములను బ్రయోగింపకుండ రమ్యములగు పదములతోఁ గవిశతకమును బూరించినాఁడు. ఇందు చెప్పఁబడిన మద్దాలియనుగ్రామము నూజివీడు సంస్థానములోనిది.

మ. గజమెట్లట్లుగ నేను కర్మఫలనక్రిగ్రిసతన్ బొంది యా
ధిజ బాధంబడి యున్నవాఁడఁ గరుణాధీనుండవై భావిజ
న్మజగుప్సాతదవస్థ బాపఁగదె శ్రీమద్దాలి ... ౬౧

మ. యజురాదిశ్రుతులెల్ల నిన్ బొగడు నాహాయండ్రి నీకీర్తి క
య్యజుఁడున్ భారతి నీదుతారకము జిహ్వాగ్రంబులన్ మేనకా
త్మజయున్ శంభుఁడు దాల్చి పొంగుదురు శ్రీమద్దాలి... ౭౩

మ. ధ్వజినీసంగ్రహ మెంతయున్న బహువిత్తంబున్న దివ్యాళుగ
వ్రిజమున్నన్ దనవెంటరాదు యమునోర్వన్ రాదు నీదివ్యనా
మజపం బిచ్చిన దాన సర్వసుఖమే శ్రీ మద్దాలి... ౯౫

గొట్టుముక్కల రాజశతకము:— కవినివాసమైన గొట్టుముక్కలలో విచ్చేసియున్న రాజగోపాలునిపై "గొట్టుముక్కలపురాకా రాజగోపాలకా" యను మకుటముతో 102 మత్తేభశార్దూల విక్రీడిత వృత్తములను గూర్చిన శతకము. ఇందు శ్రీకృష్ణావతారమందలి లీలలు వర్ణింపఁబడినవి.

శా. హేలాసమ్మిళిత త్రిమూర్తిరుచియా హేరంబుఁ బ్రార్థించుచున్
గాళీదాన మయూర మాఘ ముఖులం గైవారముల్ చేసి నిన్

వాలాయంబుగఁ బూజసేతుఁ గవన వ్యాపార విస్తార వా
గ్జాలాబ్జంబుల... ... ౨

శా. కుంజాగారములందు గోపవనితల్ గోపాలకుల్ మీఱలున్
బుంజంబై వసియించి చల్దికబళంబుల్ ప్రేమ నన్యోన్య హ
స్తాంజల్యంతర భుక్తి గైకొనుటలయ్యా వేడ్కఁగా నా కర
త్కంజాతాంబక ... ... ౨౫

మ. చెలువొప్పారఁగ నీకుఁ జేరెఁడటుకుల్ చిక్కొ్రడభక్తిక్రియా
కలనన్ దెచ్చి కుచేలుఁ డర్పణ మొసంగన్ వానికీ నేర్చితౌ
పొలుపొందన్ గృపచే సమస్తవిభవంబుల్ దేవకీగర్భకం
బలసన్మౌక్తిక ... ... ౮౬

మ. పరగం గ్రిందటిజన్మజన్మముల నిన్ బ్రార్థింపలేనైతి ని
న్నరరూపంబునఁ గొల్వఁగంటి నిటతో నాకబ్బె సన్ముక్తి సు
స్థిరమై యర్జున సాహసార్థ భగవద్గీతారహస్యప్రియం
కరవాచాలక ... ౧౦౨



## 384. ఆతుకూరి పాపయారాధ్యుఁడు

ఇతఁడు శైవాచారవిశిష్టుఁడైన నియోగిబ్రాహ్మణుఁడు; పరాశరగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; అయ్యనారాధ్యపౌత్రుఁడు; ఆదిమూర్తినామ సత్కవిపుత్రుఁడు. ఇతని తల్లి సావిత్రమాంబ.

ఈకవి లలితాంబోపాఖ్యానమను నైమిశాశ్వాసముల పద్యకావ్యమును రచించి, ధాన్యవాటియందలి యమరేశ్వరునకుఁ గృతి యొసంగెను ఈధాన్యవాటి యిప్పుడు అమరావతియను పేరుతో గుంటూరుమండలమునందున్నది. ఈయమరేశ్వరాలయము శిథిలముకాగా పందొమ్మిదవ శతాబ్దిప్రారంభమున, గుంటూరుమండలమునందలి చాలప్రదేశమును అమరావతి రాజధానిగా పరిపాలించిన శమ్మప్రభునగు వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడుగారు పునరుద్ధరించియుండిరి.

ఈపాపయారాధ్యకవి తనునుగూర్చి గ్రంథాంతమున నీక్రింది సీసపద్యమును గద్యమును మాత్రమే వ్రాసికొని యుండెను.

సీ. సకల కల్యాణ దాయకమయి సర్వపా
పఘ్నమై యత్యంత పావనమయి
ద్వైపాయన ప్రణీతంబయి తనరి బ్ర
హ్మాండపురాణస్థమైన యట్టి
శ్రీలలితాంబచరితంబు ధాన్యవా
ట్యమరేశ్వరస్వామి కర్పితముగఁ
దెలుఁగున రచియించె నిల బ్రసిద్ధంబుగా
బార్వతీ శంకర పాదభక్తుఁ

గీ. డాతుకూరి కులోద్భవుం డయ్యనార్య
పౌత్రుఁ డుభయభాషాకవిమిత్రుఁడైన
యాదిమూర్తికి సావిత్రమాంబికకును
సుతుఁడు పాపన సుకవి సన్నుతులు మెచ్చ.

గద్య:- ఇది శ్రీభవానీశంకర కరుణాకటాక్ష వీక్షాసుధా రసాసార ప్రసారణ సులబ్ధ కవితావైభ వాపస్తంబ సూత్ర పరాశరగోత్ర విలస దాతుకూరి వంశ సంభ వాయ్య నామాత్యపౌత్రాదిమూర్తి నామ సత్కవిపుత్ర సకల సుకవి జన విధేయ పాపయ నామధేయ ప్రణీతంబైన లలితాంబోపాఖ్యానంబను మహా ప్రబంధంబు".

కవితండ్రియైన నాదిమూర్తి యుభయభాషాకవిమిత్రులైనట్లు పైపద్యములోఁ జెప్పియున్నాఁడు. ఇతఁడు రచించిన గ్రంథము లేవియో కానరావు.

ఇంతకుమించి, యీకవిని గూర్చిన విషయము లేవియును గ్రంథమును బట్టి తెలియ రాలేదు. ఈగ్రంథమునం దాశ్వాసాద్యంత పద్యముల యందెచ్చటఁజూచినను "ధాన్యవాటి" యనియే చెప్పఁబడియుండుటచే నీగ్రంథరచనమునాటికిఁ బట్టణమునకు, అమరావతియను నామమేర్పడ లేదని తోఁచుచున్నది. అమరావతియను నామమును వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడుగారి కాలముననే వచ్చినదని ప్రతీతి కలదు. కావున నీగ్రంథము వెంకటాద్రినాయుఁడుగారికి పూర్వము రచించిన ట్లూహింపనగును. వెంకటాద్రినాయునివారితో సమకాలికులును, ఆంధ్రదేవీభాగవతాది కృతికర్తలు నగు ములుగు పాపయారాధ్యుఁ డీకవికిశిష్యుఁడని యొక వాడుకకలదు. అది సత్య

మయ్యో నేని యీతని పదునెనిమిదవ శతాబ్దిమధ్యమునం దున్న వాఁడని చెప్పవచ్చును.

ఈ లలితాంబోపాఖ్యానము బ్రహ్మాండపురాణాంతర్గతమయి నట్లును దానిని తానాంధ్రీకరించినట్లును గవి యీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

క. ముఖ్యంబగు బ్రహ్మాండా
భిఖ్య పురాణంబులోనఁ బెంపొంది జగ
త్ప్రఖ్యాతము లలితాంబో
పాఖ్యానము వెలయు సరస పండిత సభలన్.

గీ. అయ్యుపాఖ్యానరాజంబు నంధ్రభాష
సుప్రబంధంబుగాఁ జేసి సూరిజనము
మది ముదమునొందఁ జేయుఁదు సదయ హృదయ
సాంబ శివకరుణాకటాక్షంబు వలన.

క. విశ్వంభరలో మత్కృతి
శాశ్వతముగ వెలయఁ జేయ సమకట్టిన ని
త్తైశ్వర్య ధాన్యవాట్యమ
రేశ్వరుఁడుండంగ నాకు నిఁక వెఱపేలా.

ఈయుపాఖ్యాన మగస్త్యునకు హయగ్రీవునిచేఁ జెప్పబడినది. "ఇందు సతీదేవి దక్షునియాగమునకుఁ బోయి పరాభూతయై చిదగ్ని యందు దేహము చాలించి హిమవంతుని సుతయై పుట్టుటయు, వీరభద్రుఁడుద్భవించి దక్షాధ్వరధ్వంస మొనర్చుటయు, దేవతలు

తారకాసుర బాధకోర్వఁజాలక తద్భంజన సమర్థుండగు కుమారుని శివునివలనఁ బార్వతియందుఁ బడయఁగోరి మన్మథునిఁ బురికొల్పి పంపుటయు, సమాధినిష్ఠుండగు శివునకుఁ బరిచర్యసేయు పార్వతిపై ననురాగముఁ గల్పింప మన్మథుండు కుసుమశరములు నటపి శివుని కోపంబునకుఁ బాత్రుండై దగ్ధుఁడగుటయు, ఆభస్మమునుండి భండా సురుం డుద్భవించి లోకంబులఁ బీడించుచుండఁ దద్వధార్థము దేవతల ప్రార్థనంబునఁ బరమశివుండు మహాయాగము చేయుటయుఁ, జిదగ్ని యందు శ్రీలలితామహాదేవి యావిర్భవించి ఘోరయుద్ధంబున భండా సురుని బరిమార్చుటయు, లలితాంబానుగ్రహంబున మన్మథుం డుజ్జీవి తుండై పార్వతీపరమేశ్వరులను బరస్పరరాగబద్ధులఁ జేయుటయు, వారిపరిణయంబును గుమారస్వామి జననంబును దారకాసురవధయును మొదలగు విషయములు వర్ణింపఁబడియున్నవి.”

ధాన్యవాటి యమరేశ్వరస్వామి కీగ్రంథమును గృతియిచ్చు టచేఁ గవి యాపట్టణవాసుఁడో తత్పరిసరప్రాంత నివాసుఁడో యైయుండునని యూహింపఁదగియున్నది. ఈతనికవిత్వము నందచ్చటచ్చటఁ గొన్ని నెరసులున్నను, మృదుమధురపదసంయుతమై, సంస్కృతపదబహుళమై ద్రాక్షాపాకమున మనోహరముగా నున్నదని చెప్పవచ్చును. కవిత్వశైలి తెలియుటకై కొన్నిపద్యముల నుదాహ రించుచున్నాఁడను.

చ. క్రమమున నగ్గిరిప్రవరకన్యక శైశవముజ్జగించి పెం
పమరఁ బ్రసూనబాణుని యహంకృతి కెల్లను మూలకందమై
కొమరు వహించు యౌవనము గొబ్బునఁదాల్చె మణీశలాకచా
రు మహిత శాణ సంస్కృతినిరూఢి వహించిన మాడ్కినత్తటిన్.

ఆ. ఎంతదుష్టుఁడైన నెంతధూర్తుండైన
నెంతకఠినుఁడైన నెంతకపట
వంతుఁడైన మఱియు నెంత శఠుండైనఁ
దగదు తాని పెంచి తాని చెఱుప. ౨౯

మ. అతిధూర్తు ల్పరవంచనాపరులు మాయాచంచరుల్ మానద
ర్పిత చిత్తు ల్కుటిలు ల్దురాత్మకులు పాపిష్ఠుల్ మదాంధుల్ శత
క్రతు ముఖ్యామరులెల్ల ప్రోద్ధమనకున్ ప్రత్యర్థులీవిష్టప [౩౯
త్రితయం బింద్రుని రాజ్యమట్లగుట బాధింపం దగున్ వారలన్.

శా. ఆదేవేశ్వరి కప్పుడంచిత తపస్యానిష్ఠితాత్ముల్ వసి [౪౯
ష్ఠాదుల్ సప్తమహాఋషుల్ విజయవ్యాఘ్యాశంసకంబౌ చతు
ర్వేద ప్రస్ఫుట మంత్రజాలమున సంవృద్ధిం బ్రకల్పించి రా
మోదంబొప్ప గృశాను కీలకు మహాభూర్యాజ్యధారన్ బలెన్.

ఉ. అంచిత శౌర్యుఁడైన వికటాననుఁడన్ బలితంపు జోదు రా [౫౯
త్రించర సైన్యపాలన ధురీణుఁడు పట్టసహస్తుఁడై వియ
త్సంచరణోగ్రమై యధిక సత్వర యాన విశేషవైఖరిన్
మించిన తామ్రచూడము నమేయబలాఢ్యము నెక్కిలీలతో.

ఉ. ఏనుఁగుమోముసామి యిటు లిచ్చఁదలంచిన మాత్రలోనఁ బె
క్కేనుగు మోముసాము లుదయించి సదా స్వకపోల నిర్గళ
ద్దానజల ప్రలుబ్ధ సమదభ్రమర వ్రజగీయమానులై
సానుమదాభులై దనుజ సంహరణ ప్రవణస్వభావులై. ౬౯

చ. వెఱఁగున శక్తులున్నతఱి వేగమ యామహితానుభావ య
త్తెఱఁగునఁ బొంగివచ్చు జలధింగని దక్షిణహస్తతర్జనిన్

మెఱయు నఖంబులీల మెయి మీఁటిన మాత్ర జనించెదానఁ జూ
పఱులనుదంది కన్గొనఁగఁ బద్మదళాక్షుఁడు కచ్ఛపాకృతిన్. ౨౮

మ. తనహాళిన్ గిరిరాజపుత్రి వెసముక్తాస్తోమముల్ నింప న
ల్లన తానున్ శుభహాక్తిత ప్రతతి వేడ్కం గన్య చే మించకుం
డ నిడంబూని తదంచితావయవసౌందర్యంబు వీక్షించు శం
భుని విస్మేరత తత్సఖీ మణులకున్ బుట్టించె సుస్మేరతన్. ౩౮

లలితాంబోపాఖ్యానము నాధునిక సుప్రసిద్ధ కవిశేఖరులగు జనమంచి శేషాద్రిశర్మగారు వాంధ్రీకరించియున్నారు.



# 385. కృష్ణకవి



ఇతఁడు నారసింహగురుని పుత్త్రుఁడు; మైత్రేయసగోత్రుఁడు; సింగరగురుని శిష్యుఁడు. ఈకవి శకుంతలాపరిణయమను మూఁడాశ్వాసముల ప్రబంధమును, చిరుమామిళ్ల పాపయప్రభువను కమ్మనాయకుని ప్రోత్సాహముచే రచియించి శ్రీ వెంకటేశ్వరున కంకితము చేసెను. ఈకవి తనకులగోత్రములనుగాని తుదకు గృహనామమును గాని గ్రంథమున జెప్పుకొని యుండలేదు. శకుంతలాపరిణయము లోని యీక్రింది పద్యములను బట్టి యీతఁడు వైష్ణవబ్రాహ్మణుఁడని యూహింపఁ దగియున్నది.

మ. ఘను రామానుజ పాదపద్మయుగళీ నవ్యాన్వయధ్యాన పా
వన వ్యాద్భాగవతావతంస పరసేవాసక్త చిత్తున్మరు
త్తనయారాధనలబ్ధ చారుకవితాధారున్ సదారూఢభా
వను నాస్థానకవిన్ నిజాశ్రితుని, బిల్వంబంచి పల్కెం గృపన్.

క. మిత్రుఁడవై మైత్రేయస
గోత్రుఁడవై నారసింహగురునర్యునకుం
బుత్త్రుఁడవై వెలయుదు వి
ద్ధాత్రిన్ మాపనుపుసేయఁదగుఁ గృష్ణకవీ!

ఇతఁడు తనగురువైన సింగరగురు నిట్లు నుతించియున్నాఁడు.

క. భాసుర సూరిగ్రామణి
భూసుర ముఖపంకరుహ నభోమణి వినమ

ద్దాస నిచయ చింతామణి
నే సింగరిగురు శిఖామణిన్ గణుతింతున్.

ఈకవి కాశ్రయుఁడును గృతిపతియుఁ నైన పాపయప్రభువు పైఁడికులగోత్రుఁడు. వాసిరెడ్డివారితో సంబంధబాంధవ్యములను నెరపిన కమ్మప్రభువు. ఈతని వంశమునకు మూలపురుషుఁడైన చినమామిళ్ల పెద్దన్న యను నాతఁడు శ్రీకృష్ణదేవరాయలచే నేనుగులను బహుమానము లందినట్లును, ఏటూరి యిమ్మడితిరుమలకుమార సింగరార్యుల శిష్యుఁడైనట్లును శకుంతలాపరిణయమందలి యీక్రింది పద్యముల వలనఁ దెలియుచున్నది.

ఉ. సన్నుత కృష్ణరాయనృపసత్తము చిత్తము రాఁజరించుచున్
మన్ననమీఱి భూరిబహుమానముగా గజరాజిఁ గైకొన్న ఘనుండు పైడికులగోత్ర పవిత్రచరిత్రుఁ డౌర పె
ద్దన్న సురల్నరుల్పొగడ నక్కడ నిక్కడ నెక్కుడై తగున్.

సీ. మహిమ నేటూరియిమ్మడి తిర్మలకుమార
సింగరార్యుల ప్రియశిష్యుఁ డగుచు
నాచార్యపదభక్తి యాశ్రితావనరక్తి
గలిగి శౌర్యౌదార్యకలితుఁ డగుచు
రాయలరాజకార్యమునందు నిరతుఁడై
ప్రాజ్యసామ్రాజ్యసంభరితుఁ డగుచు
ధనధాన్యకటకమై తనయిల్లువర్ధిల్ల
ధాత్రిసురత్రాణ దక్షుఁడగుచు
వనని తవళించె తవణిమ్మాద్యాన వద్య
పద్యగద్యావళీస్తవ్యభవ్య నవ్య

కావ్యసంభావ్య భీమ సంగ్రామవిజయ
బిరుదుఁడగు చిరుమామిళ్ల పెద్దశౌరి.

ఈపెద్దశౌరి మొదలు తనకాశ్రయుఁడైన పాపయవఱకునుగల వంశావళిని గవి డెబ్బదిమైన పద్యములలో వర్ణించియున్నాఁడు. కాని యందు చరిత్రకుపయోగించు నంశములంతగా లేనందున వాని నిట వ్రాయలేదు. కృతిపతికాశ్రయుఁడైన పాపయప్రభువు వాసిరెడ్డి రామలింగముగారికుమార్తె మీనాంబను బరిణయమైనట్లు తెలుపుచు నాదంపతుల గుణగణములను వర్ణించిన రెండు సీసపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

సీ. ఆదిగర్భేశ్వరియని బుధుల్ వినుతింపఁ
బుట్టుభోగములతోఁ బొలుపుమీఱి
యనుకూలదాంపత్య మనుచులోకులు మెచ్చఁ
దనప్రాణనాథు చిత్తమున మెలఁగి
పరమపావనియంచు బంధువుల్ తోషింప
నిత్యవ్రతాచారి నిరతిఁబూని
భాగ్యశాలినియంచు భామినుల్ గణుతింపఁ
గూఁతులఁ గొడుకులఁ గూర్మిగాంచి

తే. కీర్తిఁదనరారెఁ బద్మాక్షి దేవికధిక
వైభవమ్ములభాసిల్లు వాసిరెడ్డి
రామలింగేంద్రునకును గారాబుపట్టి
మృదుల గుణమణినికురాంబ మీనమాంబ.

సీ. విలసద్దదంకి తిర్మల తిర్మలాచార్య
సంఘపల్లవయుగంబాశ్రయించి

హరివాసర శ్రీసదాచారకలనంబు
నిత్యవ్రతంబుగా నిర్వహించి
సత్రతటాకవనాది సప్తసంతానముల్
సమధికోత్సాహుఁడై సంఘటించి
హితపురోహిత సమాహిత సమాహితముగాఁ
బురుషోహాఁజయటంచు భూరిబంచి

తే. ధనకనకవస్తువాహన ధాన్య పుత్త్రి
పౌత్త్రి దీర్ఘాయురారోగ్య భాగ్యమహిమ
కీర్తిఁదనరారు మీనాక్షి దేవితోడ
మహితతేజుండు పాపయ క్ష్మావిభుండు.

గ్రంథరచనాకాలమును గవిచెప్పియుండలేదు. కృతిప్రేరకుని వంశమునకు మూలపురుషుఁడైన పెద్దనకును, ప్రేరకుఁడైన పాపయకును, గ్రంథకర్త యిచ్చిన వంశావళినిబట్టి చూచినచో, నడుమ, నైదుతరములున్నవి. పెద్దశౌరి క్రీ.శ. 1525 సంవత్సర ప్రాంతమందున్నవాఁడని తలంతుమేని, (శ్రీకృష్ణదేవరాయల రాజ్యకాలము క్రీ. శ. 1509 మొదలు 1530 వఱకు) అయిదుతరములకు తరమునకు ముప్పదిసంవత్సరములనంతునన్నైన నూటయేబదిసంవత్సరము లందుఁగలపిన యెడల పాపయప్రభువు క్రీ శ. 1700 సంవత్సరప్రాంతముననున్నవాఁడని నిశ్చయింపవచ్చును. కావున కవి కావ్యరచనాకాలము పదునేడవశతాబ్ది యందుఁ దుదిభాగమగును.

ఇంక నొకవిధముగాఁగూడ నీకవికాలమును నిర్ణయింపవచ్చును. పైనచెప్పిన పాపయప్రభుని మామగారగు రామలింగము, వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడుగారి పితామహుఁడగు రామలింగమగునెడల,

వెంకటాద్రినాయుఁడుగారి కాలము క్రీ. శ. 1761-1816. కావున నాయనకుఁ బితామహుఁడైన రామలింగప్రభువు క్రీ శ. 1700 సంవత్సరమున కించుకపూర్వమందుండియుండును. అల్లుఁడు మామలిరువురును క్రీ. శ. 1700 సంవత్సరప్రాంతమందున్నారని చెప్పవచ్చును. కావున నీవిధముగాఁ జూచినను, పై కాలము సరియగుచున్నది. ఆపక్షములో గంధవహమును రచించిన మంచెళ్ల వాసుదేవకవియు, నీతండును సమకాలికులై అల్లుండు మామలిరువురికడ చెరియొకరునుండియుండిరని తలంపవచ్చును. కాని, యిందుకొక బాధకము కన్పట్టుచున్నది. ఆరామలింగప్రభునిభార్య రంగమ్మయని గంధవహమునందున్నది. ఇచ్చట రామలింగముగారిభార్య పద్మాక్షమ్మయనియున్నది. ఈవిషయమింకను విచారణీయము.

శ్రీమహాభారతమందలి దుష్యంతచరిత్రము నాధారముగాఁ గొని, కొంతవఱకు కాళిదాసుని శాకుంతల నాటకమందలి యితివృత్తమునుకొని యీకవి స్వతంత్రముగా నీప్రబంధమును రచించెను.

కణ్వాశ్రమమున దుష్యంతుఁడు పొదరింటిలోనుండగా శకుంతల, తుమ్మెదలబాధనపనయింపుమని చెలికత్తెనుగోరినట్లును, అందుకొఱకు సకలభూపరిపాలకుఁడైన దుష్యంతుని ప్రార్థింపుమని చెలికత్తె లుత్తరంబీయ నా నెపమున దుష్యంతుఁడీవలకునచ్చి శకుంతలాపరిచయమును గల్గించుకొనినట్లును గాళిదాసు కల్పించియుండెను. ఈకవి, దానిమ్మపండునొకచిలుక కొరుకుచుండ దానిని బెదరించుటకై శకుంతల దానిపై బూలచెండును విసరినట్లును, నది గురితప్పి జారి దుష్యంతుని వక్షమునకుఁదగుల నది నెపముగా దుష్యంతుఁడు పొదరిల్లు వెలువడివచ్చి శకుంతలాపరిచయభాగ్యము నందినటును గల్పించినాఁడు. దూర్వాసశాపవృత్తాంతము నీకవి చెప్పనేలేదు.

ఈతని కవిత్వము సరసమై ద్రాక్షాపాకమున రమ్యముగా నున్నది. కవిత్వశైలి తెలియుటకై, కాళిదాసుని శ్లోకముల నాంధ్రీకరించిన పద్యములఁ గొన్నిఁటి నీక్రిందనిచ్చుచున్నాఁడను.

వాసిరెడ్డివారియొక్కయు, చిలుమామిళ్లవారియొక్కయు నివాసము గుంటూరుమండలమగుటచేఁ గవినివాసముకూడ గుంటూరు మండలమై యుండునని యూహింపఁదగియున్నది.

ఉ. ఈరము చెంత మేయు నొక యేణము నేసినఁజూచి తత్ప్రియ
స్త్రీరహిఁబాసి వల్లభుని సేమముఁగోరుచు నడ్డమయ్యెఁ ద
ద్దారుణహృద్వ్యథం దెలిసి తానడరించు శరంబు క్రమ్మఱన్
మారట తూపునన్ మునిమె మానవభర్త దయాసమగ్రుడై.

ఉ. అంకిలిగాదు నాదుహృదయంబు తమోరహితంబుసూవె నీ
కుంకుమబొమ్మపై మరులుగొన్నవిధంబు దలంచి చూచినన్
శంకిల నేటికీ వెలఁది క్షత్రపరిగ్రహపాత్రమై తగున్
మంకుఁదనంబు లేని ఘనమానసవర్తనముల్ ప్రమాణముల్.

(శ్లో. అసంశయం క్షత్రపరిగ్రహక్షమా
యదార్య మస్యామభిలాషి మే మనః
సతాం హి సన్దేహపదేషు వస్తుషు
ప్రమాణమన్తః కరణప్రవృత్తయః)

చ. పొలతుక దానపానకము పూరుషుఁడాజ్యఘటంబటన్న ప్రాఁ
బలుకు నిజంబుగా మనుజపాలుఁడు క్రొవ్విరిచెండు సోకినన్
గులుకుమిటారి గబ్బి చనుగుబ్బ నురమ్మునఁ గ్రుమ్మినట్లు మి
న్నలమికొనుం బ్రమోదకృత హాసవచారు ముఖారవిందుడై.

మ. చతురంభోనిధి మధ్యభూవలయ పూజ్య ప్రాజ్య సామ్రాజ్య శా
శ్వత దివ్యాన్వయ నవ్యభవ్యముల నశ్రాంతంబు విశ్రాంతుడన్
బతిగా వన్ను వరించి యుంచిత మహాభాగ్యమ్ముఁ గైకొమ్ము ర
మ్మతివా! నామదివాంఛదీర్తువది మేలాలించి లాలించవే.

మ. గురుపత్నీరతుఁ డాసుధాకరుఁడు మీకూటస్థుఁడౌ నొబలీ!
సరసాగణ్యులు మీరు మీకిదికులాచారంబు పారంపరీ
పరిపాటిన్ బలుకన్ విడంబనముగా భావించితిన్ మేలు మే
ల్గురుకన్యాపరిరంభణంబునకు సంకోచంబు మీకెట్లగున్.

చ. కనుగవభాష్పపూరములు గ్రమ్మెడు గద్గదభిన్నమై యెలుం
గనువునరాదుసూహృదయమాకులమయ్యెడు మేనువ్రాన్పడుం
బెనిచినవానికింతనగ బిమ్మటిగ్రమ్మెడు కన్నవారలుం
దనయనుబంపలేక పరితాపభరంబున నెట్లు సైఁతురో!

(శ్లో. యాస్యత్యద్య శకున్తలేతి హృదయా
సంస్పృష్టముత్కణ్ఠయా
కణ్ఠస్తమ్భిత భాష్పవృత్తి కలుష
శ్చిన్తా జడం దర్శనమ్
వైక్లబ్యం మమ తావదీదృశ
మహో స్నేహాదరణ్యౌకసః
పీడ్యన్తే గృహిణః కథంను తన
యావిశ్లేష దుఃఖైర్నవైః)

సీ. తోయంబుగాఁ మీకు దోయమెత్తకకాని
తోయంబుఁ ద్రావ దీతోయజాక్షి

చివురొ_త్త వేడ్కమై చివురుగ్గ సేయు మీ
చివురందఁగోర దీచివురుఁబోణి
కుసుమాపచితి నన్యకుసుమంబకాని మీ
కుసుమంబుఁగోయు దీకుసుమగాత్రి)
ఫలదానములకైన ఫలియించియున్న మీ
ఫలమంట దీమహోత్పలగంధి

తే. యట్లుమిముఁబ్రోది లాలించి యరయుచున్న
మనశకుంతల దనదు కుమారుతోడ
న_త్తవారింటికేగెడు నాదరమున
నాజ్ఞయీఁదగు వనభూరుహంబులార.

(శ్లో. పాతుంనప్రథమం వ్యవస్యతిజలం
యుష్మాస్వపీతేషు యా
నాద_త్తే ప్రియమణ్డనాపి భవతాం
స్నేహేనయా పల్లవమ్
ఆద్యేవః కుసుమ ప్రసూతిసమయే
యస్యాభవత్యుత్సవః
సేయంయాతి శకున్తలా పతిగృహం
సర్వైరనుజ్ఞాయతామ్)



# 386. పోడూరి పెదరామామాత్యుఁడు

ఇతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; శివరామమంత్రికిని సీతమాంబకును బుత్త్రుఁడు; బాపయమంత్రికిఁ బౌత్త్రుఁడు; వేంకటమంత్రికిఁ బ్రపౌత్త్రుఁడు. ఈకవి నివాసము పశ్చిమగోదావరిమండలమందలి యాచంటగ్రామ సమీపముననున్న పోడూరు, అనుగ్రామము. ఈకవి పూర్వులు గుంటూరుమండలమందలి సింగంపల్లియను నూరనుండెడి వారనియు, నచ్చటనుండి పోడూరున కరమైలులోనున్న విల్లూరను గ్రామమునకు వచ్చిరనియు, వారు గొప్పపండితులగుటచే వారినిబట్టి విల్లూరునకుఁ బండితవిల్లూరని నామముగలిగెననియు, నటుపిమ్మట గొంతకాలమున కందు ముఖ్యులు కొందఱు పోడూరు జేరిరనియు, నంతవఱకు వారి గృహనామము సింగంపల్లివారనియే వాడఁబడుచుండి, పోడూరు నివాసముస్థిరమయిన పిమ్మటఁ గ్రమక్రమముగా పోడూరివారైరనియు, మొగల్తుఱ్ఱుసంస్థాన ప్రభువులయిన కలిదిండివారు, విల్లూరుగ్రామకరణికమును, పోడూరుగ్రామకరణికమును వీరికిచ్చి రెండుగ్రామముల లోను విశేషభూవసతులనొసంగి రనియు, వీరివంశీయు లొకరివలనఁ దెలియవచ్చినది. వీరివంశీయులే యిప్పటికిని విల్లూరు పోడూరు గ్రామములకుఁ గరణములు గానున్నారు.

కవి శివరామాభ్యుదయమను ద్వ్యర్థికావ్యమును రచియించి, గురజాల పేరయామాత్యుని ప్రేరణముచే నాచంటయందలి రామేశ్వరస్వామి కంకితమొనర్చెను. పేరకుఁడు తననుగూర్చి పలికినటుగా నీక్రింది రెండుపద్యములను గవి శివరామాభ్యుదయమున రచియించి యున్నాఁడు.

సీ. అనఘు భారద్వాజ మునిగోత్రజాతు నా
పస్తంబసూత్రుఁ బ్రశస్తచరితు
ఘనునిఁ బోడూరి వేంకటమంత్రివరు సత్త
మహితధీ బాపయ మంత్రిపౌత్రు
శివరామమంత్రికి సీతమాంబకు సూను
లై మించు బాపార్యరామరామ
ఘనులు ముగ్గురిలోన గణనకెక్కిన పెద
రామకవీంద్రు శ్రీరమ్యచరితుఁ

జిత్రయమకాంధ్ర సంస్కృతశ్లేషకవిత
రచనసేయంగ నేర్చి భారతికరుణను
రాజవిద్వత్సభ యందుఁ బూజితుఁడగు
నన్నుఁ బిలిపించి పలికెఁ బ్రసన్నఫణితి.

సీ. నీవంశపూర్వధీనిధి కొండకవి చెప్పె
భార్గవాభ్యుదయ ప్రబంధమెలమి
నీయన్న బాపమంత్రి రచించె నొగి నుషా
కన్యకాపరిణయ కావ్యమెసఁగ
నీతమ్ముఁడసమునందె నిరోష్ఠ్యజానకీ
కళ్యాణకృతి రామకవివరుండు
నీవుప్రౌఢోక్తిని నిర్మించినావు కా
సల్యాపరిణయాది సరసకృతుల

గీ. మఱియు దాహరణాది చమత్కృతులను
సంస్కృతాంధ్రకవితఁ జెప్పఁజాలినట్టి

ప్రౌఢసత్కవి వీవె ధరాతలమునఁ
గవిత గుణగణ్య పెదరామకవివరేణ్య!

ఈపద్యములనుబట్టి కవి, శివరామాభ్యుదయమే కాకుండ కౌసల్యాపరిణయాది కృతులను, ఉదాహరణాదులను రచించినట్లును, గవి సంస్కృతాంధ్రములయందు కవిత్వము చెప్పంగల సమర్థుడనియుఁ దెలియుచున్నది. శివరామాభ్యుదయమునందుఁ గృత్యాదిని సంస్కృతాంధ్రకవులను నుతించినపిదప, శ్లేషకావ్యములకు మార్గదర్శియైన పింగళి సూరనార్యుని యీక్రిందిపద్యములలో స్తుతించి యున్నాఁడు.

ఉ. శ్లిష్టకవిత్వవైఖరి విచిత్రత రాఘవపాండవీయము
త్కృష్టముగా రచించి జగదేకనుతుల్గని ధాత్రిలో నవ
సృష్టియనంగఁ బద్మభవసన్నిభుఁడైన మహాకవీశ్వరా
భీష్టతమప్రభావుఁడగు పింగళి సూరకవీంద్రుఁ గొల్చెదన్.

శివకథయు రామకథయుఁ గలిసి రెండర్థములుగల కావ్యమగుటచే దీనికి శివరామాభ్యుదయమని పేరువచ్చినది. ఈగ్రంథ మింకను ముద్రితముకాలేదు. ఈతని తక్కినరచనములు కాలగర్భమునఁ బడిపోయినవి. శివరామాభ్యుదయకృతి ప్రేరకుఁడగు గురుజాల పేరయామాత్యుని యీక్రిందిపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. ఏమంత్రికులపూర్వుఁ డిలజమత్కార భా
రతమందె శ్రీరంగరాజనాముఁ
డేమంత్రిముత్తాత యామల్లయజ్వ
దాక్షాయణీపరిణయ గ్రంథమందె
నేమంత్రితాత యజ్ఞామాత్యుఁ డొనరించె
సప్తసంతానముల సరవి తోడ

నేమంత్రిపిత పార్వతీశ్వరుఁ డాదిమ
దాతయై పద్యగద్యంబులందె

నట్టి గురుజాల కులకలశాబ్ధి విధుఁడు
రసికుఁ డినటూరి మల్లనారాధ్య శిష్యు
డభవ పూజాధురంధరుఁడైన పేర
ఘనుఁడు సాంఖ్యాయనసగోత్రుఁ డెనయ సిరుల.

ఇతనియన్నయైన బాపిరాజునకు మనుమని మనుమఁడగు వెంకట రాజకవి రామలీలావిలాసమను నొక కావ్యమును విజయనగరప్రభువగు పూసపాటి విజయరామగజపతి పట్టాభిషేకమహోత్సవ సందర్భమున రచియించి యుండెను. ఆగ్రంథము, ఆనందసంవత్సర చైత్ర శు ౧౫ గురువారమునకు వ్రాసినట్లందుఁ గవి వ్రాసియున్నాఁడు. ఆదినము క్రీ. శ. ౧౮౫౪ వ సంవత్సరము ఏప్రియల్ ౧౩ వ తేదీ అయినది. విజయరామగజపతి ప్రభువు క్రీ. శ. ౧౮౪౫ మొదలు ౧౮౭౯ వఱకు ప్రభుత్వము నెరపిన వారగుటచే నాకాలము సరియైనదియే యని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. రామలీలావిలాసమును గూర్చి వ్రాయుచు దొరతనమువారి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగార పరిపాలకులు, గ్రంథపట్టికలో (సం. ౪ భా. ౩ తెలుఁగు పుట ౬౧౨) నీపోతూరి వారివంశవృక్షము నిచ్చి, యీపెదరామామాత్యునికాలము క్రీ. శ. ౧౬౫౦ అనివ్రాసి యున్నారు. కాని యది పొరపాటు. అది శివరామాభ్యుదయ రచనాకాలమయినచో, నాతనియొక్కయు నాతనికగ్రజుఁడైన బాపిరాజుయొక్కయు జననకాలము ౧౬౨౦ ప్రాంతమగును. ఆపక్షములో బాపిరాజునకును, అతనిమనుమని మనుమనికిని నడుమ రెండువందలసంవత్సరముల వ్యవధి యుండును.

అది యసంభవము. ఆ ౧౬౫౦ వ సంవత్సరము పెదరామామాత్యుని జననకాలమని భావించినను నావ్యవధి ౧౭౦ సంవత్సరములగును. అదియు నసంభవమే. కావున నాకాలము వాస్తవమయినదిగాఁ దలంపరాదు.

పెదరామామాత్యుఁడు, శివరామాభ్యుదయకృతి పేరికుఁడగు గురజాల పేంమంత్రికి, బమ్మెర కేసకవి మల్లకవులు రచియించి, పేంమంత్రిపూర్వుఁడైన చినమల్లనసోమయాజికిఁ గృతియిచ్చిన దాక్షాయణీపరిణయమునకుఁ బ్రతి వ్రాసి యిచ్చుచు నందు ధాత సంవత్సర ఆశ్వయుజ బహుళ దశమీ సోమవారమునాఁటి కాప్రతి పూర్తియయ్యెనని చెప్పియున్నాఁడు. ధాతసంవత్సరము క్రీ. శ. ౧౭౫౬ వ సంవత్సరమయినది. పెదరామామాత్యుని జననము క్రీ.శ. ౧౭౧౬ ప్రాంతమనుకొనినచో నాతని ౪౦ వ యేట నాప్రతి వ్రాసియిచ్చెనని తలంపవచ్చును. ఆపక్షములో ౧౭౧౦ ప్రాంతమున బాపిరాజును, ౧౭౭౦ ప్రాంతమున నాతనిమనుమఁడును, ౧౮౩౫ ప్రాంతమున రామలీలావిలాసకర్తయగు వెంకటరాజును జన్మించి యుందురని చెప్పవచ్చును. విజయరామగజపతి పట్టాభిషేకకాలమునాఁటికి వెంకటరాజునకు ముప్పదేండ్ల వయసుగల వాఁడై రామలీలావిలాసమును వ్రాసియుండును. అట్లుగాక క్రీ.శ. ౧౬౯౬ వ సంవత్సరమున వచ్చినధాత యని యందుమేని పెదరామామాత్యుని జననము ౧౬౬౬ వ సంవత్సరమై, బాపిరాజు జననము ౧౬౬౦ కాఁగా, నాతని మనుమఁడు ౧౭౩౦ వ సంవత్సరమును, వెంకటరాజు జననము ౧౭౮౦ వ సంవత్సరమునునై పట్టాభిషేకకాలమునాఁటి కితఁడు దాదాపెనిమిది సంవత్సరములు వయసు

గలవాఁడగును. ఇట్లు భావించుట సమంజసముకాదు. కావున పెదరామామాత్యునికాలము క్రీ.శ. ౧౭౨౦-౧౭౮౦ అని భావింప వలసియున్నది. ఇందుల కణుమాత్రమును సంశయింపఁబనిలేదు.



## 387. ఎఱ్ఱ భూపాలుఁడు

ఇతఁడు యువజనహృదయానంద మనుపేరుతో తారాశశాంక విజయకథను ప్రబంధముగా రచియించినవాఁడు. ఇతని తండ్రి కృష్ణభూపాలుఁడు. ఈక్రింద నుదహరించిన గద్యవలన నీతనిచారిత్రము తెలియఁగలదు.

"ఇది శ్రీమద్రామభద్ర పాదారవింద సుందరమకరందపాన తుందిలేందిందిరాయమాన మానస నిత్యసమారాధిత ప్రభాకరచరణ సారస నిరంతరావార్యశౌర్య మహౌదార్యసముపార్జిత సంగ్రామార్జున జగనొబ్బగండ గండరగండ నిశ్శంఖమల్ల బాహత్తమల్ల దోహత్తనారాయణ గుజ్జరిదళవిదారణ సుకవిజనస్తుత్య పల్లవాదిత్య కలియుగ బేతాళ గాయగోవాళ జాళియామాళియాబందీకార చంచుమలచూరకార బసవశంకర కేతనాంక సమరనిశ్శంక బలాత్కారాపహృత పాండ్య రాజసప్తాంగ త్రిభువనరాయ వేశ్యాభుజంగ ధనకనకమణిగణప్రపూరిత బుధజననికేతన పరభయదగరుడకేతన కేళాదిరాయకనక కర్పూర వసంతరాయాది మహనీయబిరుదవిచక్షణ శ్రితజనసంరక్షణ పంటవాంశ

పయుః పారావారతారకాకశ్రీ కృష్ణమహీమహేంద్ర దినేశసంకాశ ప్రకాశ మధురదేశాధీశ విజయరంగచొక్కనాథ ధరానాథవితీర్ణ సువర్ణదండ ప్రకీర్ణ ధ్వజచ్ఛత్రపల్యంకికాప్రముఖ బహువిధరాజలక్షణానుసంగ బుధవిధేయాంతరంగ బద్వపూఁడి పురవరాధ్యక్ష యెఱ్ఱ భూపాలహర్యక్ష ప్రణీతంబైన యువజనహృదయానందంబను శృంగార ప్రబంధము.''

ఈగద్యమునుబట్టి కవి విజయరంగచొక్కనాథుని కాలములోనివాఁ డని తెలియుచున్నది. కావున ఇతఁడు 18వ శతాబ్ది ప్రథమ భాగములోనుండెను. గద్యలోఁ దనది ''పంటవంశ'' మని చెప్పుకొనియున్నాఁడు. కావున నీతఁడు పంటరెడ్లకులమునకుఁ జెందినవాఁడని చెప్పవచ్చును. లేదా 'పంట' గృహనామ మేనికావచ్చును. ఈతనినివాస మగుబద్వపూఁడి మధురమండలములోనిదై యుండును. ఇతఁడు కృత్యాదియందు రేవూరి అనంతయజ్వ నీక్రిందిపద్యములో నుతించియున్నాఁడు.

ఉ పాయనిభక్తి మద్గురుల పాదసరోరుహయుగ్మమున్న పా
ధ్యాయతనొప్పు నప్పురధరామరవర్యుఁ దలంచి భారతీ
నాయకతుల్యు రేవురి యనంతకవీంద్రునిఁ గొల్చి భూరితే
జోయుతు లైనసత్కవుల సొంపుదలిర్ప నుతింతు నెప్పుడున్.

ఈ రేవూరి యనంతకవి, గాధేయోపాఖ్యానాది ప్రబంధములను రచించినవాఁడు. ఆతని చరిత్రమును వేఱొకచో వ్రాసియున్నాఁడను. ఈతని నెఱ్ఱభూపాలకవి ప్రత్యేకముగా నుతించియుండుటచే నాతనిసమకాలికుఁ డనియూహింపవచ్చును.

ఈ గ్రంథము బహుశః మూఁడాశ్వాసములను కలిగియుండును. రెండాశ్వాసములుగల వ్రాఁతప్రతి యొకటి ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమున నున్నది.

ప్రథమాశ్వాసము నవతారికనుండి యీక్రింది విశేషములు తెలియుచున్నవి.

క. శ్రీరమ్యసారవైభవ
గౌరాణ్ణిభుకలువకొండ గోత్ర పవిత్రున్
సూరిజన స్తుతి పాత్రుని
భూరిగుణు ... పోతన నెంతున్,

క. ... .... ... ...
... మూర్తి పార్థివధుర్యున్
శ్రీవరపాద సరోరుహ
సేవానిధి రిపుమదేభసింహుని దలతున్.

గీ. ... ... ... ...
అతుల ఘనకీర్తిసమిత శౌర్యాష్టమూర్తి
మూర్తి నృపవర్యు నుతియింతు ముదముమీఱ.

గీ. ... ... ... ...
... ఎఱ్ఱభూవరుతనూజు
మజ్జనకు కృష్ణమణికాంతు మదిదలంతు.

క. వినుతింతు మీనమాంబన్
జనసన్నుత శుభచరిత్ర ... ...

ఈతఁడు చతుర్థకులజుఁడు. కలువకొండ గోత్రుడు.




ఈ గ్రంథమంతయు లభ్యముకాలేదు. కాని యుపలబ్ధమైన దానినిబట్టిచూడ కవిత్వము జాతీయమై, జటిలత్వము కలిగియుండును. శైలి తెలియుటకై రెండు పద్యములఁ గ్రిందనిచ్చుచున్నాఁడను.

ఉ. అక్కజమైన ధైర్యమహిమాతిశయంబులుకల్గు నింద్రునిం
గుక్కుటమై యహల్యకడఁ గూయఁగఁజేసె బ్రతాపశాలియై
మిక్కిలి నొక్కదర్పకుఁడు మెత్తనివాని సుధీంశువేడ్క నా
ప్రక్కనుజొక్కి పావురపుఁ బల్కులు పల్కఁగఁ జేయజాలఁడే.

చ. వనితయుఁ దానుసేఁగి హిమవత్ ప్రముఖాఖిలభూధరంబులన్
వినుతసరస్తటంబులను విష్ణుపదీముఖ పుణ్యనిమగ్నగా
ఘనపులినంబులన్ బదరికాగహనాది మహావనంబులన్
మునులరుదందునట్టి తపముల్ సలిపెన్ గడు నిష్ఠమీఱఁగన్.

—దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము.



# 388. వెలిదిండ్ల అళఘరికవి

ఇతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కౌశికగోత్రుఁడు; పెదరాఘవార్యకనకాంబలకుఁ బుత్త్రుఁడు; ఇతని తాత తిరువెంగళార్యుఁడు; రాధామాధవసంవాదమును రచించిన వెలిదిండ్ల వెంకటపతి యీకవికిఁ బెదతండ్రి; ఈకవికి ముద్దళఘరియని నామాంతరము.

ఇతఁడు సుదంతాపరిణయమను నాల్గాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. ఇందు తనపితామహుని, తనతండ్రి, పెదతండ్రి, పినతండ్రులను, ఈక్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు.

చ. అల తిరువెంగళార్యుఁడు మహాద్భుతచర్యుఁడు కీర్తిధుర్యుఁడై
యలరి ప్రసూనమార్దవశుభాంగిని గోనమ యన్వధూమణిన్
లలితగతి న్వరించి కమలాసతిఁ జేకొనినట్టి చుట్టువా
ల్బలియుని కైవడిన్ బరఁగె బంధువులందఱు సంతసింపగన్.

సీ. శృంగార రసముఖోచిత సితాంధ్రోక్తి
పద్ధతి పోషి వెంకటపతిమనీషి
సకలదేశాధీశ సమ్మతపేశల
కవనుండు పెద్దరాఘవ ఘనుండు
జనమనోరంజన సరససల్లాప ధా
రల వన్నెగన్న చిన్నాఘవ ఘనుండు
మధురవాక్యప్రౌఢిమ నిరస్తభారతి
నఖముఖరితతంత్రి నరసమంత్రి

గీ. లలిత వార్తాచమత్కృతి లక్ష్మిపతియు
ననఁగ నేవురు గల్గిరి వినయులైన
తనయులై తిరువేంగళార్యునకు జగతిఁ
దనువులందిన పంచతత్త్వము లనంగ

క. అందగ్రజుఁ డర్చితగో
విందపదుండచ్చ తెనుఁగు వేంగన వెలసెన్
... ... ... ...
... ... ... ...

సీ. ఆమేరు రామేశ్వరావని విఖ్యాతమే
నేత శుద్ధాంధ్రకృతి సహస్రి
... ... ...
... ... ...

అతఁడు చెలువొందుఁ దిరువెంగళార్య గర్భ
జలధి కమలారి దుష్కవిస్మయ విదారి
యనవరతతోషి గానవిద్యాభిలాషి
బంధుపరిపోషి వేంకటపతి మనీషి.

ఈ వేంకటపతియే రాధామాధవసంవాదమును రచియించినకవి. ఇతనిచారిత్రము నీగ్రంథమున నింతకుముందు వ్రాసియున్నాఁడను. ఈ వేంకటపతి యనేకాంధ్రగ్రంథములను రచియించి యచ్చ తెలుఁగు వేంగనయని బిరుదము నందినట్లు కవి వ్రాసియున్నాఁడు. కాని యాగ్రంథముల పేరులు చెప్పలేదు. ఈ వెంకటపతి యీకవికిఁ బెద తండ్రి. పైపద్యమునుబట్టి యీతనితండ్రియుఁ బినతండ్రులు కూడ

పండితులైనట్లు కన్పట్టుచున్నది. మొత్తముమీఁద వీరిది పండిత కుటుంబము. కవి తనతండ్రియైన పెదరాఘవమంత్రిని యీక్రింది పద్యములలోఁ వర్ణించియున్నాఁడు.

సీ. పాండ్యేశ పరమాప్త పాలిమద్యనకుండు
గోపాలచరణ సేవాపరుండు
నిఖిల దిక్తటవర్తి నిజకీర్తి విస్ఫూర్తి
పట్సహస్రకులీన చక్రవర్తి
మధురాంధ్ర కవనగుంఫన కళాచతురుండు
సాధు రక్షణ విచక్షణ కరుండు
జ్ఞాతిబంధు సుహృన్నిరాతంక శుభకారి
సత్యోక్తి నూతనాజాతవైరి

గీ. సకల ధని కొఘకర్ణ భూషాయమాన
లలిత నిరవద్య నిజగుణాకలిత పద్య
శతసహస్రనుండనఁగ సన్నుతి వహించె
ఘనుండు వెలిదిండ్ల పెద్దరాఘవ విభుండు.

ఇంవలి పాండ్యేశుఁడు విజయరంగచొక్కభూపాలుఁ డయినట్లే క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది. కవితండ్రియైన పెద్దరాఘవ మంత్రి యాభూపాలునొద్ద మంత్రియై యున్నవాఁడు. అతఁడు, ఆంధ్రకవిత్వము చెప్పసమర్థుఁడని మాత్రమే యుందున్నది. కాని యీతఁడు గ్రంథరచనమును జేసినట్లు చెప్పలేను.

సీ. అద్య స్వయం వ్యక్తమైన రంగ
స్థలంబే నృపతికి రాజధాని యయ్యె

నధిక చంచలయైన యలమహాక్ష్మి యే
విభుని పూజల కిలు వేలుపయ్యెఁ
బ్రత్యక్ష విరజయై పరఁగ కావేరి యే
ప్రభునికోటకు మహాపరిఘయయ్యె
రాజార్హమైన చిరత్నరత్నంబు లే
దంటసీమకు మిట్టపంటయయ్యె

గీ. నట్టి నృపపాలిత ... సమిద్ధ
పంచతిరువట రాజసప్తాంగపాలి
శాత్రవీకంత సూత్రశాసన ... శాలి
శ్రీవిజయరంగ చొక్క ధాత్రీపమౌళి

ఈభూపతియే యీకవిని, సుదంతాపరిణయమును రచించి, శ్రీరంగేశ్వరునకుఁ గృతియిమ్మని కోరిన ట్లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

గీ. నాకు నారోగ్యభాగ్యముల్ నీకుఁ బ్రతిథ
విన్నవారికి హర్షంబు విస్తరిల్లఁ
గృతి యొనర్పుము శ్రీరంగపతికి ననిన
నాఁటి నెమ్మది నొకహాయి నాటిరేయి.

శ్రీకృష్ణుని యష్టమహిషలలో నొకతెయగు సుదంతను శ్రీకృష్ణుఁడు పరిణయమాడిన కథ యిందువర్ణితమైనది. విజయ రంగ చొక్కభూపాలుఁడు క్రీ. శ. ౧౭౦౪ మొదలు ౧౭౩౧ వఱకు మధురను పాలించినవాఁడు. కావున నీకవియు నాకాలము వాఁడనుట స్పష్టము. ఈకవికాలమున మధురరాజ్యమునకు శ్రీరంగము రాజ.

ధాని కావునఁ గవియు శ్రీరంగమునందుండె ననిచెప్పవచ్చును. వెలిదిండ్ల కడప మండలములో నున్నది. పూర్వమొకప్పుడు కవి వంశీయులగు పూర్వుల కాగ్రామము నివాసమైనను, ఈతని పితామహుని కాలముననో తండ్రులకాలముననో దక్షిణదేశమునకుఁబోయి యచ్చట నివాసముల నేర్పచుకొని యుందురు.



# 389. అత్తలూరి పాపకవి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; కౌశికగోత్రుఁడు; ఇవటూరి బసవేశ్వరుని శిష్యుఁడు; వీరమాహేశ్వరాచార సంపన్నుఁడు; అక్కరాజునకుఁ బౌత్రుఁడు; శ్రీగిరిమంత్రికిని సుందరాంబకును బుత్త్రుఁడు బసవనమంత్రి కనుజన్ముఁడు.

ఇతఁడు చెన్నబసవపురాణ మను నాల్గాశ్వాసముల పద్యకావ్యమును కందుకూరి యమృతలింగమంత్రికిని, శ్రీశైలఖండ మను నాల్గాశ్వాసముల కావ్యమును కందుకూరి వీరేశలింగమంత్రి ప్రోత్సాహముచే నాతనియగ్రసోదరుఁడైన మూర్తిరాజునకును, శివలీలయను గ్రంథమును కందుకూరి బసవనామాత్యునకును గృతియొసంగెను. ఈతఁడు రచించినవానిలోఁ జెన్నబసవపురాణము ముద్రితమై ప్రచారములో నున్నది. శ్రీశైలఖండముయొక్క యముద్రితప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్నది. శివలీల యిపు డెచ్చటను దొరకుట లేదు. ఈకవి శరభాదిశతకములు కొన్ని

చెప్పినటులఁ దెలియుచున్నది. కాని యవియు నిపు డెచ్చటను లభించుట లేదు.

కందుకూరి అమృతలింగమంత్రి తనను గూర్చి యనినట్లు కవి చెప్పికొనిన చెన్నబసవపురాణమందలి యీ క్రింది పద్యములవలన కవి వృత్తాంతము కొంత తెలియవచ్చుచున్నది.

చ. అనవుఁడు మందహాసవదనాంబుజుఁడై యప్పు డత్తలూరి పా
వనకుల జాక్కరాజునకుఁ బౌత్రుఁడ శ్రీగిరిమంత్రి పూళికిన్
ఘనమతిసుందరాంబికకు నందనుఁ డబ్బసవేశుఁడేయనం
జనుబసవేశుమంత్రి కనుజన్ముని బాపయసత్కవీంద్రుసన్.

క. ననుఁ బిల్వఁ బంచి తగు తెఱఁ
గునఁ బూజ లొనర్చి యిష్టగోష్ఠివినోదం
బునఁ గొంత ప్రొద్దు గడిపి వి
నయమునఁ బోగరిమ ననియె వేడుక నాతోన్.

చ. శివకరుణాకటాక్షమునఁ జేకుఱెఁ దక్కినయట్టిసంతతుల్
కవిజనహృద్యమున్ భువనగణ్యము భక్తిరసోల్బణక్రియా
భవనము కిల్బిషప్రకరపాటనమై తగునొక్కసత్కృతిన్
దవిలె మదీప్సితం బిపుడు దానమనోరథపూర్తిఁ జెందెడిన్.

క. సంతాన భూజములలో
సంతానంబై నయట్టిసత్కృతి నీచేఁ
గాంతు నని కోర్కిఁ జెందితి
సంతసమున నొసఁగవలయు సరసకవీంద్రా!

మ. అని జాంబూనదనిర్మితాంబర మణీహారాగ్రహారాశ్వచం
దనవీటీచతురంతయాన సుమనోధామాదివస్తువ్రజం
బున నన్వేక్ష బహూకరించుటయునేఁ బూర్ణానుమోదంబుతో
ననఘం బయినతదీయవంశకథనం బాసక్తి వర్ణించెదన్.

కందుకూరివారి కీయత్తలూరి పాపకవి బంధువుఁ డయినట్లును, వారికే తనగ్రంథములను గృతియిచ్చినట్లును, శ్రీశైలఖండమునందలి యీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

చ. సిరులకుఁ దానకంబయిన శ్రీగిరిఖండము నాంధ్రభాషచే
నరుదని యార్యులెల్ల నొనియాడ రచించి మదగ్రజుండు భూ
సురగణపోషకుండు పరిశుద్ధయశుండు జగత్ప్రతాప భా
స్కరుఁడగు మూర్తిరాజునకు సత్కృతిగాఁగ నొసంగు మర్మిలిన్.

సీ. శివలీల యాదియౌ ప్రవిమల కృతులిచ్చి
మాతండ్రి బసవనామాత్యుచేత
ఘోటకశాటికాహాటక భూషణా
ద్యనుపమవస్తుసంతతులు గొంటి
వెసకంబుతోఁ జెన్నబసవపురాణ
మిచ్చితివి మాయమ్మతన్న కతులితముగ
మున్ను మామూర్తిరాజన్న జెప్పించిన
శరభాది శతకముల్ చాలఁజెప్పి

గీ. తీవు పూర్వాశ్రితుఁడవు హితుఁడవాప్త
బంధుఁడవు మాకుఁ గావున భవ్యకృతి మ
దగ్రజునకిప్పుడిచ్చి సద్యశముఁ బుణ్య
మందఁజేయఁగవలయుఁ బాపయ కవీంద్ర.

కృతిపతులైన కందుకూరివారు నియోగిబ్రాహ్మణులు లోహితసగోత్రులు. వీరుపూర్వము దేశపాండ్యాలై యుండి మిగులఁ బ్రసిద్ధిగాంచి, గోలకొండ ప్రభువులకడ, మంత్రులై, దండనాయకులై యనేకదుర్గములను బరిపాలించుచు, ననేకాగ్రహారముల నొసంగి యనేకకావ్యములను గృతినొంది కీర్తినిగాంచి యున్నారు. గ్రంథవిస్తరభీతియున్నను, నట్టిమహనీయులనుగూర్చి యొక్కింత నిట వ్రాయకుండ నుండఁజాలను.

ఈవంశమునకు మూలపురుషుల నామములు అప్పయమంత్రి వీరనామాత్యుఁడు, రామకృష్ణమంత్రి అనియుండుటచే కందుకూరివారు మొదట నుండియు శైవులు గారనియు, నాంధ్రదేశమున శైవమతవ్యాప్తి యధికమైన పిమ్మట వీరు శైవమతమును గ్రహించి లింగధారులైరనియుఁ దేటపడుచున్నది. వీరిలో రామకృష్ణమంత్రి గోలకొండప్రభువుచే బిరుదులును బహుమానములను బడిసి వేలూరుసర్కారును బరిపాలించి, కానూరు మొదలగు నగ్రహారములను బ్రాహ్మణులకొసంగి నట్లీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

చ. ఘనుఁడగు రామకృష్ణుని వికాసమనీషకు మెచ్చి సంతసం
బునఁ ద్రిజగత్ప్రతాపకులభూషణరాయుఁడనంగ మేటి పే
రును మణిభూషణంబులు హరుల్ గజదంతపుఁబల్లకీలఁ గొ
మ్మని దయ గోలకొండవసుధాధిపుఁ డాతనికిచ్చె హెచ్చుగన్.

సీ. భూనుతకీర్తియా భూషణరాయండు
హేలానగరరాజ్య మేలుచుండి
నిడుదవోల్సీమలో నిరుపమ వాసిష్ఠ
తటినీతలంబున ధరణిసురుల

క్రగహారములు కల్పాంతరస్థాయిగా
నొసఁగి వనీపకవిసరములకు
వాంచితార్థంబు లవ్వారిగా నొసఁగుచు
బంధుల నరయుచు బహుళపుత్ర

తే. పౌత్రకల్యాణవృద్ధిచేఁ బరిఢవిల్లెఁ
గాంతిజితహేళి శివపాదకమలజాళి
దళిత దురితాళి నిరుపమ దానకేళి
రమ్యగుణపాళి భూషణారాయ మౌళి.

—చెన్నబసవపురాణము.

సీ. అతఁడు గోలకొండాధీశుచే దంత
పల్యంకికాంబరభద్రదంతి
హయభర్మరత్నభూషాళీ జగత్ప్రతా
పకులభూషణరాయభవ్యనామ
ఘనబిరుదములంది కానూరు మున్నుగా
నగ్రహారములు బ్రాహ్మణుల కొసఁగి
హేలానగర రాజ్య మేలుచు శిష్ట ర
క్షణమును దుష్టశిక్షణము బంధు

గీ. పోషణంబును బరిపంధి శోషణంబు
సత్యవాక్యంబు తనకు నైజములు గాఁగ
వినుతిఁ జెన్నొందె సత్ప్రభా విజితహేళి
రమ్యగుణపాళి భూషణరాయమౌళి.

— శ్రీశైలఖండము.

కందుకూరి యమృతలింగమనునాయన ఏలూరు నరసాపురరాజ్యములను బరిపాలింపుచు, శరభపురము మొదలగు నగ్రహారములనిచ్చి, నసేకాలయములను నిర్మించి నట్లీక్రిందిపద్యములవలనఁ దెలియనగును.

క. ఆయిరువురి యందగ్రిజుఁ
డై యలరిన యమృతలింగ మహితావని భృ
న్నాయక భయదాయక వా
క్నాయకుఁడై యేలెను నరసాపుర మెల్లన్.

సీ. అతిధార్మికుండైన యమ్మంత్రివర్యుఁడ
శేష దిగంత ప్రసిద్ధి గాఁగ
మేటియౌ తన పేర పేటమా దేపల్లె
కాట్రేనిపల్లెయన్ గ్రామములను
రహిగుడుల్ కట్టించి రామలింగేశ
మల్లేశ్వర శరభ మల్లేశ్వరాఖ్య
శర్వలింగ ప్రతిష్ఠలు సేసి శర్వపు
రాద్యగ్రహారము లవని దివిజ

తే. వారములకిచ్చి సర్వాధికారి దత్త
దంతపల్యంకికావాహ ధవళచామ
రాతపత్రాది బిరుదచిహ్నములు మెఱయఁ
బూజ్య సామ్రాజ్యభోజ్య విస్ఫూర్తిఁ దనరి.

—చెన్నబసవపురాణము.

సీ. అందగ్రజుండగు నమృతలింగాఖ్యుండు
దంతపల్యంకికాధవళచామ

రాతపత్ర ధ్వజ హయముఖ్య బిరుదముల్
సర్వాధికారిచేఁ జాలనంది
శైలానగర రాజ్యపాలుఁడై శరభభు
రప్రభృత్యగ్రహారము లొనర్చి
మేటియౌ తనపేరి పేట మాదేపల్లె
కాట్రేనిపల్లె యన్ గ్రామములను

గీ. మహితరామలింగ మల్లేశ శరభ మ
ల్లేశ్వరాలయంబు లెలమి నిలిపి
వనతటాకనిధులు వరుసఁ బ్రతిష్ఠించి
కీర్తనీయుఁ డగుచుఁ గీర్తిఁ బ్రబలె.

కందుకూరి మల్లికార్జున మంత్రి వేలూరు, కొండపల్లి రాజమహేంద్రవరదుర్గములను బరిపాలింపుచు, కొత్తపల్లి ఏలేటిపాడు అగ్రహారముల నొసంగినట్లును కువలయాశ్వచరిత్రకుఁ గృతిపతియై నట్లును నీక్రిందపద్యములలో వర్ణింపఁబడియున్నాఁడు

సీ. నేర్చినాఁడే జాణ నిషధ కాశ్మీరాది
బహుళ దేశామేయ భాషణములు
చేర్చినాఁడే మేటిశీతాచలాత్మజా
వరపాదయుగళి హృత్సరసిజమునఁ
దీర్చినాఁడే మంత్రి ద్విజవరాధీశాది
సకలవర్ణాశ్రమాచారసరణి
కూర్చినాఁడే దానికుంభినీవ్యోమాష్ట
హరిదంతరాళ సంభరితకీర్తి

తే. యతఁడు పొగడొందుఁ గందుకూర్యన్వవాయ
కలశ వారాశి పూర్ణిమా కైరవాప్త
పేరయామాత్య తల్లజ వీరమాంబి
కాబ్జవదనాత్మజుఁడు మల్లిఖార్జునుండు

ఉ. ఆతతకీర్తికై కువలయాశ్వచరిత్ర కృతిం గ్రహించి ప్ర
స్ఫీతములైన క్రొత్తపలి యేలెటిపాడను నగ్రహారముల్
ఖ్యాతిగఁ జేసి బంధులకు గ్రాస సమృద్ధులొసంగి శాంభవ
వ్రాతము కోర్కులిచ్చి విభవంబున మల్లనమంత్రి వర్ధిలెన్.

సీ. అతఁడు శాంత్యాదిగుణాఢ్యుఁడై యేలూరు
రాజమహేంద్రవరంబు కొండ
పల్లయున్ దుర్గముల్ పాలింపుచుండి కో
మరవోలుమూర్తి కుమార్తె సద్గు
ణాలంబ దుష్కలుషావనీధరశంబ
యగు గురువాంబఁ బెండ్లాడి శోభ
నాంగులఁ బేరయలింగంబు నమృతలిం
గంబు వీరేశలింగంబు సాళ్వ

ఆ. పతియు మూర్తిరాజు బసవరాజున నొప్పు
సుతుల సుజనహితుల సుఖసహితుల
నతుల విభవయుతుల నార్వురఁ గనియె నం
దగ్రజుండు పేరయామాత్యుండు.

—చెన్నబసవపురాణము.

ఈమల్లిఖార్జునమంత్రి కృతినందిన కువలయాశ్వచరిత్ర మిప్పు డెచ్చటను గానరాదు. ఆగ్రంథమును రచియించిన కవిపేరును

దెలియరాలేదు. ఈ మల్లికార్జునమంత్రి యైదవ కుమారుఁడైన మూర్తిరాజు సింగవరమను నగ్రహారము నాతని గురువునకొసంగి నట్లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు,

సీ. బిరుదముల్ నృపతిచేఁ బెదతండ్రివలెఁ గాంచి
 నత్యున్నతమగు స్వాస్త్యము ధరించి
గురువరులకు సింగవరమను పురమిచ్చి
 వరనియోగులకెల్ల వన్నెదెచ్చి
నగణిత భక్తగణార్చనములఁ జేసి
 యవనిభారము భుజమందు మోఁపి
లింగాంగసమరససంగతి నుతికెక్కి
 ప్రమథకథాశ్రవణమునఁ జొక్కి

తే. సప్తసంతతులొనరించి శాంతి మించి
యరులఁ బరిమార్చి పౌరులసికులకోర్చి
కుజనసంగతిమాని సద్గుణము పూని
కీర్తిఁగనె వాక్యగోగోజు మూర్తిరాజు.

ఈ మూర్తిరాజుతమ్ముఁడైన, బసవరాజు సత్యవతీ పరిణయమును గృతినందినట్లును నైతమపూఁడి మినిమించిలపాడు అగ్రహారముల నిచ్చినట్లును, అనేకాలయములను నిర్మించినట్లును, నీక్రిందిపద్యములలో వర్ణింపఁబడియున్నాఁడు.

క. ఘనముగ నైతమపూఁడియు
మినిమించిలిపాఁడు సిరులుమించఁగ నొసం
గెను గురుచరవరులకు బస
వనితో నెనయైనమంత్రి వసుధంగలఁడే.

క. తనమేనయల్లుఁడాన్వృత
వినయుండగు బుద్ధిరాజు వీరన చేతన్
గొనె సత్యవతీపరిణయ
మనుకృతి శ్రీబసవమంత్రి యతిసంప్రీతిన్.

సీ. శరభమల్లేశ్వరస్వామిఁ బ్రతిష్ఠించె
నైతమపూఁడియం దధికభక్తి
నారామనిధితటాకాదులై తగు
సప్తసంతతు లొనరించె శాశ్వతముగ
రెండవ బసవేశ్వరుండన లక్షల
సంఖ్య గణార్చనల్ సలిపెనిష్ఠ
సాంబుశ్వేర కృపాసంలబ్ధ ఘనతర
భోగభాగ్యముల విస్ఫూర్తి నలరె

తే. నీతఁడని యెన్నఁదగియె ధరాతలమున
నతిఫలద సోమవాసరవ్రత యుతుండు
మల్లికార్జునగురువమాంబాత్మజుండు
శరణసమధాని బసవరాజప్రధాని.

ఈబసవమంత్రి కృతిపొందిన సత్యవతీపరిణయము ఇప్పుడు లభించుటలేదు. ఈబసవనకుమారుఁడైన మూర్తిరాజే శివరహస్య ఖండకృతిపతి. ఈయనతమ్ముఁడె వీరేశలింగమంత్రి. ఈవీరేశలింగ మంత్రిని, కృతిపతియైన మూర్తిరాజును గవి యీక్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు.

సీ. అతులిత శుభశాలి యతఁడు హేలాపురి
రాజమహేంద్రవరంబు కొండ

వీడు బెల్లముకొండ వినుకొండ కొండపల్లి
యనంగ ధరణి చేరయిన దుర్గ
సముదయం బేలుచు జనులెల్లఁ గొనియాడ
సర్వాధికారిచే శాశ్వతముగ
ప్రకట జగ త్ప్రతాపకులభూషణరాయఁ
డనెడు నామము ధవళాతపత్ర

తే. చామరధ్వజమణిరథ సామజాశ్వ
దంతిచతురంతయానాది కాంతబిరుద
చిహ్నములఁ గొని సిరులచేఁ జెన్నుమీఱె
నంగజవిభుండు వీరేశలింగవిభుఁడు.

మ. వినయంబొప్ప నిజానుజన్ముఁడగు నవ్వీరేశలింగంబు స
జ్జనులెల్లంగొనియాడ నిచ్చఁ దనయాజ్ఞావర్తియై భక్తి స
ల్ప నియోగాగ్రణి మూర్తిరాజమణి హేలాపట్టణాధీశుఁడై
ఘనతన్ వర్తిలె సర్వభూప్రజకు సౌఖ్యస్ఫూర్తి నందింపుచున్.

—శివరహస్యఖండము.

ఈమూర్తిరాజునకుఁ అన్నకుమారుఁడైన చిన్నబసవరాజు కాశీయందు తపస్సుచేసి యనేకధర్మకార్యములను గావించి నట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. అతఁడు కాశీక్షేత్రయాత్రలు రెండుమా
ఱులు చేసి యాపుణ్యతలమునందు
నిరశన సువ్రత నిష్ఠుఁడై రెండు వ
త్సరము లుగ్రతపంబుసలిపి విశ్వ

నాయకునకు నిత్యనై వేద్యదీపముల్
సార్వకాలికమును జరుగునట్లు
కట్టడగావించి ఘనతచే భూసుర
సంతర్పణంబులు సకలదాన
గీ. ములు నొనర్చి వచ్చి ముదముతో నిజరాజ్య
భూతినలరి ప్రజలఁదోఁచెఁ గరుణ
బసవదేశికేంద్రపాదపాథోరుహ
బంభరుండు చిన్నబసవరాజు.

చెన్నబసవపురాణ కృతిపతియైన అమృతలింగమంత్రిని గవి యనేకపద్యములలోఁ గీర్తించియున్నాఁడు. అందొక్కపద్యము నిట నుదాహరించెదను.

సీ. సర్వముఖోదిత షట్స్థలాచార మా
ర్గప్రతిష్ఠాపన ప్రాజ్ఞుఁడితఁడె
యనుపమ వేదవేదాంత శాస్త్రపురాణ
సంగీతముఖకళాశాలి యితఁడె
వననిధిరూప శేవధిశివాగారాది
సంతానకరణప్రశస్తుఁడితఁడె
సర్వంసహానాథ సర్వకార్యక్రియా
విఘటనాఘటన ప్రవీణుఁడితఁడె
తే. తీర్థయాత్రపరాయణాతిథి సమర్చ
నాన్నపానీయదానగుణాఢ్యుఁడితఁడె
యనుచు సకలజనంబులు వినుతి సేయ
నవని వర్ధిల్లె నమృతలింగాహ్వయుండు.

కందుకూరివారిలో కృతిపతులయినవారి నామములను కవి శ్రీశైలఖండమునం దీక్రిందిపద్యములోఁ బేర్కొనియున్నాఁడు.

సీ. మెచ్చుగాఁగృతియందె మీతండ్రిమల్లికా
ర్జునమంత్రి కువలయాశ్వునిచరిత్ర
వేడ్క మీపెదతండ్రి వీరేశలింగము
కృతియందెఁ బంచాక్షరీమహత్త్వ
మతిదాత మీతండ్రియగు బసవామాత్యుఁ
డందె శంతనువిలాసాది కృతులు
కొనియె మీపెదతండ్రికొడుకగు నమృతలిం
గము చెన్నబసవన్నకథను కృతిగ
తే. నిట్టివారలందఱు నెలమిఁ గృతులు
గొనిరి యట్టులు గావున ననఘ మీరు
కోర్కె మీఱంగఁ గృతియందుకొనుట మేలు
రంగదాచార్య వీరేశలింగవర్య......

ఈకవినివాసము స్పష్టముగాఁ దెలియఁదగిన యాధారములు లేవు. కృతిపతులందఱును గోదావరిమండలవాసులగుటచే వారికి బంధువుఁడగు నీకవియుఁ గోదావరిమండలవాసుఁడేయని తలంపనలసి యున్నది. ఈకవికిఁ దాడికొండనందీశ్వరుఁడు గురువైనట్లీక్రిందిపద్య మువలనఁ దెలియుచున్నది.

ఉ. విశ్వకళాప్రవీణపరివీరుఁడ నీకుఁ గృపాణవైనతే
యాశ్వశిలీముఖాంఘ్రి కమలామలభక్తధురీణసత్కృపా
శశ్వదురీక్షకోణయని సారెకునామదిఁ దాడికొండ నం
దీశ్వరు మద్గురుం దలఁతు నెప్పుడు జ్ఞానుపదేశికాత్మజున్.

చెన్నబసవపురాణ మైదాశ్వాసములు కలది. చెన్నబసవని కథ ప్రధానముగాను, మఱికొందరు శివభక్తులచరిత్రము లుపకథలుగాను, నిందువర్ణింపఁబడినవి. చెన్నబసవఁడు వీరశైవమతోద్ధారకుఁడగు బసవనకు మేనల్లుఁడు. కక్కయ్యయను నొక మహాశివభక్తుని ప్రసాదమును స్వీకరించవలయునని బసవన చాలకాలము ప్రయత్నించినను లభ్యముకాలేదఁట. ఒకప్పుడు బసవనారాధ్యుఁడు కక్కయ్యగారింటికిపోఁగాఁ నొకచీమ యొక మెతుకును నోటగరచుకొని వచ్చుచు నాతనికిఁ గన్పడగా నామెతుకు కక్కయగారి ప్రసాదమేయని నిశ్చయించుకొని బసవన్న యటనున్న యినుక నాచీమసమీపమునఁ జల్లగా నది పంచదార యయ్యెనఁట. ఆచీమ తననోటనున్న యన్నకణమును విడచి యాపంచదారను గ్రహింప బసవన్న యామెతుకును దన యుపవస్త్రమున ముడిచికొని కక్కయ్యగారి దర్శనము చేసి, చిరకాలమున కీవిధముగా నాయన ప్రసాదము లభించినదని చెప్పి యాతని యనుజ్ఞనొంది యింటికేఁగి లింగార్చనమైన పిమ్మట నాప్రసాదమును గైకొన నెంచి నాయుత్తరీయము నొకచో నుంచి స్నానమున కేఁగెను. ఇంతలో బసవన్న సోదరియగు నాగాంబిక యచ్చటకు వచ్చి యెన్నఁడు నేదియును మూటగట్టి యెఱుంగని తనయన్న యీనాఁడు త్తరీయమున నేదియొ ముడిచికొనివచ్చుట కాశ్చర్యమొంది దానిని విప్పి యందొక్క మెతుకుండుటనుగాంచి యది కక్కయ్యగారి ప్రసాదమై యుండునని భావించి, తత్క్షణమే స్నానమొనర్చి లింగార్చన మొనర్చి యాకణమును భక్షించెనఁట! పిమ్మట బసవన్న లింగార్చనానంతరము సోదరినిఁ బిలిచి, యుత్తరీయమున కక్కయ్యగారి ప్రసాదమున్నది తీసికొనిరమ్మని చెప్పగా నామె జరిగిన వృత్తాంతము నన్నకెఱింగించెను. చిరకాలాపేక్షితమగు నామహా

ప్రసాదము లభించియుఁ దనకుఁ బ్రాప్తము లేకపోయినందులకు బసవన్న చింతాక్రాంతుఁడయ్యెను. కాని యది దుర్వినియోగము గానందులకు సంతసించెను. కక్కయ్యగారి ప్రసాద మాహాత్మ్యమున నవివాహితయై పురుషసంపర్కమెఱుంగని నాగాంబిక గర్భవతి యైనది. ఈవృత్తాంతము రాజయిన బిజ్జలునకుఁ దెలియవచ్చెను. బసవన బిజ్జలునియొద్ద మంత్రి. బిజ్జలుఁడు మంత్రినిబిలిచి నాగాంబిక గర్భవృత్తాంతమడిగెను. ఆమెనే పిలిచి యడుగుఁడని బసవన ప్రత్యుత్తరమీయ రాజామెను బిల్పించి యవనికాభ్యంతరమున నునిచి యుచితరీతి నామె నడుగఁగా, నామె "నాకేమియుఁ దెలియదు" గర్భస్థుండగు శిశువునే యడుగుఁడని విన్నవించెను. రాజును గర్భస్థ శిశువును బ్రశ్నింపఁ దాను కుమారస్వామి యంశమునఁ గక్కయ్యగారి ప్రసాదమహిమచే నీమె గర్భమందుఁ బండ్రెండేండ్లయి ప్రవేశించితినని యుత్తరంబొసంగి రాజు ప్రార్థింప యామెకర్ణమునుండి సూక్ష్మాకృతిచే బయలువెడలి పండ్రెండేండ్ల బాలుఁడై నిలువఁ బడియెనఁట! ఇది చెన్నబసవని జన్మవృత్తాంతము. ఇతఁడు బసవనచే ప్రారంభింపఁ బడిన శైవమతప్రచారమును గొనసాగించి బొందితో కైలాసమున కేగెను.

ఈగ్రంథమునఁ బ్రసక్తానుప్రసక్తిగా ముప్పదియైదుగురు శివభక్తుల చారిత్రములు వర్ణింపబడినవి. బిజ్జలుడు, బసవనారాధ్యుఁడు; చెన్నబసవఁడు చారిత్రక పురుషులుగాని కల్పితపురుషులు కారు. ఆకాలమున జైనశైవమతస్థులొండొరులతోఁ గలహించుచు, వీలయినచో నొకరినొకరు వధించుకొనుచుండిరి. బిజ్జలుఁడు జైనుఁడని యీగ్రంథమున నీక్రిందిపద్యములో వర్ణింపఁబడినది.

ఉ. జైనకులప్రవర్ధనుఁడు శాశ్వతకీర్తియుతుండు నిర్మలా
నూనగుణాభిరాముఁడు ధనుర్గుణటాంకరణౌరి మండలీ
మానససాధ్వసప్రదుఁడు మన్మథమాధవరూపశాలి నా
నానరనాథసన్నుతసనాథుఁడు తత్త్రితినేత వర్ధితన్.

ఈకథలలో నొక నీతివిరహితమైనకథ యొకటికలదు. బిజ్జలుని సోదరియగు చిత్రకన్య కామోద్రిక్తయై బిజ్జలుని యశ్వపాలకునితో వ్యభిచరించెనఁట !. ఆవృత్తాంతమును విని బిజ్జలు డామెను, అసియుం త్రిమున బడవేయుఁడని యారెకుల కాజ్ఞచేయ వారట్లొనర్చిరట! ఆమెదేహము తుండతుండములుగాఁ దెగిపోన నందొక హస్తఖండము మిండజంగములకు లభింప దానిని బసవేశ్వరునికడనుంచి యామెను బ్రతికింపుఁడని కోరిరట; జంగము లేదికోరిన దాని నీయవ్రతముబట్టి యున్న బసవేశ్వరుఁ డామెదేహఖండములెల్ల తెప్పించి మంత్రోదకముచే నామెను బునర్జీవింపఁజేయ నామె యత్యంతసౌందర్యమును గాంచి మోహించి యాజంగము లామెను దమకు భోగవనితగా నిమ్మని బసవనిఁ గోర నాతఁడట్లేచేయుఁడని యాజ్ఞయొసంగెనఁట ! ఇందఱు మిండజంగములతో దానొక్కతె నెట్లుండగలననియుఁ దన నీకార్యమునుండి తప్పించి నీకడదాసిగానుంచుకొనుమనియు బసవేశ్వరు నామె వేఁడుకొనినను, మిండజంగములుకొఱకామెను బునరుజ్జీవింపఁ జేసితిననియు, నందఱితో నుండుటకుఁ దగినసత్త్వము తనప్రభావముచేఁ గలుగుననియుఁ జెప్పి బసవేశ్వరుఁడామెను సమ్మతింపఁజేసెనఁట.

ఆకాలమున జైనులు శైవులమీఁదను శైవులు జైనులు మీఁదను నిట్టికథలు కల్పించి నిందించుకొనుచున్నట్లు కనఁబట్టుచున్నది.

ఇట్టి యపాత్రపుకథను వ్రాయుటకు బాపకవిలేఖిని యేలజంకలేదో తెలియకున్నది.

ఈతనికవిత్వ మనర్గళధారకలిగి మృదుపదసంయుతమై మనోహారముగా నున్నది. కవిత్వశైలి తెలియుటకై కొన్నిపద్యముల నుదాహరించుచున్నాఁడను.

చెన్నబసవపురాణము:—

చ. పరమపవిత్రయైన సతిభావమెఱుంగక కానిచేష్టలం
బరగెను నాగమాంబయని పల్కితిమయ్యయొ! మున్ను నిందగా
దురితమువచ్చె నీయఘము ద్రొల్లఁగఁ జేసెడు మార్గమెయ్యదో
హరహర! తెల్విమాలిన జనావళి కెక్కడి సత్యవాక్యముల్. ౧ఆ

మ. అతిథీ! మద్గురుభావసంభవము వేదాతీత మత్యుత్తమం
బతులం బవ్యయ మప్రమేయ మగమం బానందకందంబు న
క్షత మాద్యంతవిహీనమై పరగు లింగంబున్ మహాభక్తి సం
గతుఁడై దాల్చిన వాఁడు ముక్తివనితాకాముండు గాకుండునే.

ఉ. ప్రొద్దునఁ జద్దిబువ్వదిని పుస్తకముల్ పడకింటఁ జాటుగా
మిద్దియమీఁద డాఁచి కడిమిన్ బడికేఁగక యొక్కరుండ నే
నిద్దెస కేఁగుదెంచితి నిఁకేమియుఁ బల్కక యప్ప నీవుసన్
ముద్దొనరించి రండిపుడ మోదముతోడుత మల్లికార్జునా! ౩ఆ

చ. గడుసుదనంబొ! కోడిగమొ! కల్మిగొ! చూడఁగ నీస్వభావమో!
గడెగడెకొక్కమాట పలుకందగవే! మును నీకు నీవ యి
క్కడవసియింప భూతిఁగొని క్రమ్మఱఁబోయెద నన్న నిన్ను నే
విడుతునే! యేల నీభ్రమలు! విశ్వము మెచ్చునె? బాసదప్పినన్. ౪ఆ

ఉ. భక్తవరేణ్యులార! నను భవ్యకృపారతి మీ ప్రసాదనం
యుక్తునిజేసి యేకొఱంతయున్ ఘటియింపఁగనీక యేలుటన్
వ్యక్తిగ సర్వవాంఛిత సుఖానుభవంబులఁ జెందితింక నే
ముక్తిపదంబుఁ జెందెద నమోఘముగా సెలవిచ్చి పంపరే. ౧౮

శ్రీశైలఖండము :—

ఉ. దేవ! మహానుభావ! భవదీయపదాంబుజసేవ సర్వవాం
ఛావలిఁ జెందె నైన నొకఁడాత్మ వసించెడు విన్నవించెదన్
భూవలయంబులోన నొకభూధరరూపముదాల్చి నీవు మ
త్పావనమూర్ధ్న దేశమున పార్వతిఁగూడి ప్రియంబెలర్పఁగన్.

చ. అనుపమభక్తి చందమతి యానతి తొల్లి గిరీశుమాళిఁ బూ
నిన నవమల్లికాకుసుమ నిర్మితదామ మరందధారచే
ననిశము బూర్ణమా శతన యువ్వరకుండము నామ మట్టులై
యొనరెనటంచుఁ బల్కి మఱియున్ వచియించె కపర్ది
యింతితోన్. ౨౮

ఉ. సాగరమట్లు దేవదితిజాతులచే దరపించి లక్ష్మీసర
యోగముఁ గాంచి కృత్రిమపయోరుహలోచనయై సుధారసం
బాగగ నాధ్వగాళికిఁ బ్రియంబున నిచ్చి పలాశబృందమున్
వేగజయించె వారిరుహనేత్రుఁడు లోకము సన్నుతింపఁగన్. ౩౮

చ. అనఘుఁడు రాముఁడొక్కసమయంబున కౌశికువెంటనేఁగి యా
ఘనుని మఖంబుగాచి జనకక్షితినాథునియింటనున్న పెన్
ధనువుఁ దృణీకరించి వసుధాసుతదానును దద్ధరేంద్రనం
దనల సహోదరుల్ క్రమముదప్పక పెండిలియై క్రమంబునన్.

# ఆంధ్ర కవితరంగిణి



## 1300 తెలుగు కవులచరిత్ర

రచయిత: శ్రీ చాగంటి శేషయ్యగారు

పదమూఁడు వందల తెలుగుకవుల చరిత్ర విశేషముగ పరిశోధించి శులభశైలిలో వ్రాయబడినది. ఇరువదియైదు సంపుటములలో ప్రచురింపబడుచున్నది. సుమారు ఆరువేల పుటలగును ఇంచుక చదువనేర్చిన ప్రతివ్యక్తి చదువవలసిన గ్రంథము. ప్రతిగ్రంథాలయమున నుండతగినది. లైబ్రరీలు ఉపయోగించుటకొరకు డైరక్టరు ఆఫ్ పబ్లిక్ లైబ్రరీలువారిచే అప్రూవుకాబడినది. పలువురు పండితులీగ్రంథావశ్యకమునుగూర్చి కొనియాడియున్నారు. మొదటి 14 సంపుటములు ప్రచురించియున్నాము. ఆంధ్రుల మన్ననలను బడిసిన గ్రంథము. రు. 10–00 లు చెల్లించి మీరుకూడ చందాదారులుగా చేర గోరుచున్నాము.

మంచి తెల్లకాగితములు ! చక్కని అచ్చు !!

వెల ఒక్కొక్క సంపుటము రు. 4—00 లు.

(చందాదారులకు తపాలాచార్జీ ఉచితము)

**1 సంపుటము :** డెమ్మీసైజు : 278 పుటలు

1. నన్నయభట్టు
2. నారాయణభట్టు
3. భోజరాజు
4. క్షేమేంద్రుడు
5. అమృతనాధుడు
6. నన్నిచోడుడు
7. పావులూరి మల్లన్న
8. వేములవాడ భీమకవి

**2 సంపుటము :** డెమ్మీసైజు : 264 పుటలు

9 జయదేవకవి
10. వాదీంద్ర చూడామణి
11. రేచన
12. ఉదయాదిత్యుడు
13. గోకర్ణుడు
14. శ్రీపతి పండితుడు
15. దేసటి పండడు
16. మల్లికార్జున పండితారాధ్యులు
17 రుద్రదేవమహారాజు
18. మంత్రిభాస్కరుడు
19. కేతనప్రగ్గడ
20. తిక్కనసోమయాజి

**3 సంపుటము :** డెమ్మీసైజు : 266 పుటలు

21. యథావాక్కులఅన్నమయ్య
22. బద్దెన
23. విశ్వేశ్వర దేశికులు
24. శివదేవయ్య
25. మూలఘటిక కేతన
26. అధర్వణాచార్యులు
27. పాలకురికిసోమనాథకవి
28. చక్రపాణి రంగనాథుడు
29. కవిరాక్షసుడు
30. మారన
31. నండూరి కేతనమంత్రి
32. మంచనకవి
33. కమలనాభామాత్యుడు
34. శరభాంకుడు
35. హుళక్కి భాస్కరుడు
36. మల్లికార్జునభట్టు
37. కుమారరుద్రదేవుడు
38. కవిభల్లటుడు
39. కృష్ణమాచార్యుడు

**4 సంపుటము :** డెమ్మీసైజు : 282 పుటలు

40. రంగనాథుడు
41. గోనబుద్ధభూపతి
42. గోనకాచ భూపతివిఠలరాజు
43. రావిపాటి తిప్పన్న
44. గణపనారాధ్యుడు
45. ఎఱ్ఱాప్రగడ
46. నాచన సోముడు
47. అప్పన మంత్రి
48. చిమ్మపూడి అమరేశ్వరుడు
49. దోనయామాత్యుడు
50. పశుపతి నాగనాథుడు
51. భవదూరుడు

52. కొరవి సత్యనారన
53. శ్రీగిరికవి
54. శాకల్య అయ్యనార్యుడు
55. ప్రకాశభారతీయోగి
56. మడికి సింగన
57. మడికి అనంతయ్య
58. కందనామాత్యుడు
59. జక్కయ కవి
60. చిన్నకోట పెద్దన్న
61. పె. జన్నమంత్రి
62. గౌరనమంత్రి

5 సంపుటము : డెమ్మీ సైజు : 286 పుటలు

63. శ్రీనాథుడు
64. వినుకొండ వల్లభరాయుడు
65. నిశ్శంక కొమ్మన్న
66. భైరవ కవి
67. కొలని గణపతిదేవుడు
68. అనంతామాత్యుడు
69. పెన్నలకంటి అన్నమయ్య

6 సంపుటము : డెమ్మీ సైజు : 278 పుటలు

70. శ్రీధరుడు
71. అ. త్రిపురాంతకుడు
72. తా. అన్నయాచార్యులు
73. పి. నిమ్మయార్యుడు
74. పిడుపర్తి బసవకవి 1
75. బల్లలమఱ్ఱి పినవీరన్న
76. పోలిలుగంటి చెన్నశౌరి
77. పి. సోమనాథకవి
78. దూ. నారాయణకవి
79. దగ్గుబల్లి దుగ్గనకవి
80. మనుమంచిభట్టు
81. నందిమల్లయ్య
ఘంటసింగయ్య
82. కొఱవి గోపరాజు
83. పోతన
84. వెలిగందల నారయ
85. గంగనార్యుడు
86. వెర్బూరి సింగన
87. ఈశ్వర ఫణిభట్టు
88. సదానందయోగి
89. పెనుమత్స వెంకటాద్రి
90. పెనుమత్స గోపరాజు
91. అడిదము నీలాద్రికవి
92. మాడయకవి
93. పిడుపర్తి బసవకవి 2
94. వేమన
95. తిరుమల కొండయార్యుడు

7 సంపుటము : డెమ్మీ సైజు : 264 పుటలు

96. కృష్ణదేవరాయలు
97. పెద్దన్న
98. మాదయగారి మల్లన్న
99. గోపమంత్రి
100. ముక్కుతిమ్మన్న
101. ధూర్జటి

8 సంపుటము : డెమ్మీ సైజు : 256 పుటలు

102. తెనాలి రామకృష్ణ
103. తెనాలి శ్రీగిరికవి
104. పూసపాటి రాచిరాజు
105. గౌరరాజు
106 వెల్లంకి తాతంభట్టు
107. కాచిరాజు బసవన
108. యాదవామాత్యకవి
109. చంద్రమౌళి
110 దేవరాజభట్టు
111. ప్రౌఢకవి మల్లన
112. సారంగు తమ్మయ్య
113. చరికొండధర్మనామాత్యుడు
114. చరికొండ నరసింహకవి
115. కాకుమాని గంగాధరుడు
116. తాళ్ళపాక తిమ్మక్క
117. తాళ్లపాక పెదతిరుమలాచార్యులు
118. తాళ్లపాక చిన్నన్న
119. తాళ్లపాక చినతిరుమలాచార్యులు
120. రేవణూరి వెంకటార్యుడు
121. వెలగపూడి వెంగయామాత్యుడు
122. హరిభట్టు
123. రాచమల్లు కవులు
124. మలయమారుతముసర్వన్న
125. ఎజ్జన్న
126. వెన్నెలకంటి సూరనార్యుడు
127. పెదపాటి సోమయ్య
128. ఆంధ్రకవిరామయ్య
129. వాసిరాజు రామయ్య
130. సంకుసాల నృసింహకవి
131. భానుకవి

9 సంపుటము : డెమ్మీ సైజు : 256 పుటలు

132. రాధామాధవకవి (చింతలపూడి ఎల్లనార్యుడు)
133. కుడిచెర్ల తిప్పరాజు
134. నాగలూటి శేవనాథార్యుడు
135. ఘటశాసి మల్లుభట్టు
136. కానుకొలను అన్నమరాజు
137. ఎడపాటి యెఱ్ఱనకవి
138. బొడ్డపాటి పేరయకవి

139. బొడ్డపాటి కొండయ
140. తెనాలి అన్నయకవి
141. రెడ్డిపల్లె ముద్దమరాజు
142 ఒడ్డెపూడి పెద్దయకవి
143. గంగరాజు చౌడయ్య
144. నారన సూరన
145. పలకలూరి గోపన
146. పోతరాజు వీరయ్య [కవి
147. పచ్చకప్పూరపు తిరువెంగళ
148. తెల్లపూడి కసవరాజు
149. కోట శివరామకవి
150. చిత్రకవి పెద్దనకవి
151. పోతరాజు
152. సిద్ధరాజు తిమ్మరాజు
153. ఫణిభవు మాధవుఁడు
154. బైచరాజు వేంకటనాథకవి
155. సర్వదేవుఁడు
156. పొన్నతోట యాబళకవి
157. పొన్నాడ పెద్దిరాజు [కవి
158. కోటికెలపూఁడి సోమనాథ
159. తులసి బసువయ్య
160. కలిదిండి భావనారాయణకవి
161. ఎలకుర్తి రామరాజు
162. కైతరాజు ముమ్మయ
163. చెందలూరి చిక్కయ్య
164. భద్రకవి లింగకవి
165. పెమ్మన బాపన [కవి
166. కుంటముక్కల తిరుమలనాథ
167. కంచిరాజు సూరయ్య
168. లింగమకుంట రామకవి
169. చినమూరి గంగరాజు
170. లింగమకుంట తిమ్మకవి
171. నెల్లూరి ముత్తరాజు
172. కాసె సర్వప్ప
173. పెద్దిరాజు రామరాజు
174. శంకరకవి
175. భాస్కరాచార్యులు
176. పద్మకవి
177. మొల్ల
178. రావరిది దేచిరాజు
179. పోశెట్టి లింగకవి
180. గార్లపాటి లక్ష్మణకవి
181. 'తా॥ తిరువెంగళనాథుఁడు
182. నైషధము తిమ్మయమంత్రి
183. కావూరి యెల్లయకవి
184. అంగద బసవయ్య
185. కోడూరి వల్లభసూరి
186. మద్దికాయల మల్లయ
187. నామయోగి
188. గౌడయకవి
189. విశ్వేశ్వరకవి
190. ఎడపల్లి పర్వతన్న

10 సంపుటము : డెమ్మీసైజు : 250 పుటలు :

191. అయ్యలరాజు రామభద్రకవి
192. ఘోలమరాజు
193. కంచర్ల అయ్యనకవి
194. కోనూరి కోనేరుకవి
195. రాయసం గణపయ్య
196 రామరాజు రంగపరాజు
197. తామరపల్లి శరణమంత్రి
198. నండూరి మల్లయకవి
199. చినమల్లు శ్రీగిరన్న
200. తెనాలి రామభద్రకవి
201. దామెరల వెంగళభూపాలుండు
202. గౌరనకవి
203. చెదలువాడ మల్లయకవి
204. ముకుందయోగి
205. కాకమాని మూర్తికవి
206. ఆమడూరి నరసింహభట్టు
207. వటమూలుండు
208. నూతనకవి సూరన్న
209. పాలకుర్తి సోమేశ్వరుండు
210. రామరాజు సోమయ్య
211. సిద్ధనప్రెగడ
212. రామాప్రెగడజగన్నాథకవి
213. పింగళి సూరనార్యుండు
214. రామరాజభూషణుండు
215. కందుకూరి రుద్రయ్య
216. చిత్రకవి అనంతకవి
217. తామరపల్లి తిమ్మయ్య
218. పరమానందయతి
219. తరిగొప్పుల మల్లన్న
220. ముమ్మడి మల్లనకవి
221. కంభంపాటి నారపామాత్యుండు
222. యోగానందావధూత
223. సచ్చిదానందావధూత
224 శాంతానందయోగి
225. వెలుతుర్ల ఒడ్డెయ్యకవి
226. ఎలుగంటి పెద్దనకవి
227. జక్కరాజు రామకృష్ణకవి
228. అయ్యలరాజు అయ్యలకవి భాస్కరకవి
229. అద్దంకి గంగాధరకవి

11 సంపుటము : డెమ్మీసైజు : 258 పుటలు :

230. పట్టమట్ట సోమనాథసోమయాజి
231. కామినేని ఎల్లారెడ్డి
232. కామినేని మల్లారెడ్డి
233. పొన్నగంటి తెలగనార్యుడు
234. రాయసము వెంకటపతి
235. తురగా రాజకవి - అయ్యంకి బాలసరస్వతి

236. ఢిల్లి వెంకటాఖ్యకవి
237. మారేపల్లి వెంకటయోగి
238. మట్లి అనంతభూపాలుడు
239. కవి చౌడప్ప
240. ఉప్పుగుండూరి పెరియన్నకవి
241. కంచి వీరశరభకవి
242. బమ్మెర కేసకవి – మల్లకవి
243. అర్జరపు పేరయలింగము
245. బిజ్జల తిమ్మభూపాలుఁడు
246. సవరము చిననారాయణ
247. మల్లారెడ్డి దేశాయి
248. కుందుర్తి గోవిందమంత్రి
249. కేటూరి భావనామాత్యుడు
250. ఎలకూచి బాలసరస్వతి
251. సురభి మాధవరాయకవి
252. వేగినాటి (బళ్లపల్లి) కొండనార్యుఁడు
253. కేటూరి రంగరాజు
254. పొట్లూరి గోపన్న
255. పింగళి ఎల్లనార్యుఁడు
256. రాజవోలు సుబ్బరాయకవి
257. నెప్పల్లె అప్పనార్యుఁడు
258. సింహాద్రి వెంకటాచార్యుడు
259. పైడిమర్రి వెంకటపతి
260. దామెర అంకభూపాలుఁడు
261. అందుగుల వెంకయ్య
262. చెంగల్వ వెంకయ్య
263. ముద్దరాజు భద్రుఁడు
264. ముడియం వెంకటరమణకవి
265. మల్లవరపు వాలేశ్వరుఁడు
266. మోచర్ల నన్నయకవి
267. వణుకూరి గుర్వరాజు
268. రంగరాజు లింగయ్య
269. కట్టా వరదరాజు
270. చెన్నమరాజు చెన్నమరాజు
271. గూళికల్లు వేంకటరమణకవి
272. రాజలింగకవి

12 సంపుటము : డెమ్మీసైజు : 256 పుటలు :

273. రఘునాథ భూపాలుఁడు
274. కృష్ణాధ్వరి
275. చేమకూర వెంకటకవి
276. ధరణిదేవుల రామమంత్రి
277. పుష్పగిరి తిమ్మనకవి
278. కంకంటి పాపరాజు
279. కంకంటి నరసింహకవి
280. చేకుమళ్ల రంగశాయి
281. రాచపూఁడి వెంకటయ్య
282. కుమార ధూర్జటి

283. చిత్రకవి వెంకటరమణకవి
284. సోమనాథకవి
285 మట్లి కుమారానంత భూపాలుఁడు
286. కాకునూరి అప్పకవి
287. ఎలకూచి పినయాదిత్యుఁడు
288. విజయరాఘవ భూపాలుఁడు
289. పసుపులేటి రంగాజమ్మ
290. కామరుసు వెంకటపతి సోమయాజి
291. కోనేటి దీక్షితచంద్రుఁడు
292. పురుషోత్తమ దీక్షితుఁడు
293. చెంగల్వ కాళయకవి
294. కాండ్రవేటి రామానుజాచార్యులు
295. కవి సింగరన్న
296. పోడూరి కొండకవి
297. నత్నవాయ బలభద్రరాజకవి
298. వెణుతురుబల్లి విశ్వనాథకవి
299. ఏనుఁగు లక్ష్మకవి
300. చల్ల గురవయ్యమంత్రి
301. దిట్టకవి వెంకటామాత్యకవి
302. లింగనమఖి శ్రీ కామేశ్వర [కవి
303. అంగర నృసింహకవి
304. చక్రపురి రాఘవాచార్యుడు
305. నిమ్మల లక్ష్మణాచార్యుఁడు
306. చింతలపల్లి గోపాలమంత్రి
307. చింతలపల్లి వీరరాఘవకవి
308. చింతలపల్లి ఛాయాపతి
309. చింతలపల్లి సంజీవకవి
310. రోసనూరి వెంకటపతి
311. పానుగోటి జగన్నాథరాయ [కవి
312. ఈదులపల్లి భవానీశంకరకవి
313. మన్నారు దేవుఁడు
314. చరిగొండ హొన్నయ్య
315. గణపవరపు వేంకటకవి
316 పుసులూరు సోమరాజకవి
317. గద్దె రామలింగకవి
318. శ్రీపతి భాస్కరకవి
319. ధూర్జటి లింగరాజు
320. తాళ్ళపాక శ్రీనివాసుఁడు
321. వేదాంతాచార్యులు కవితార్కిక
322 కర్పూరము కృష్ణమాచార్యులు
323. లక్ష్మీనరసింహము
324. నెల్లుట్ల నారాయణకవి
325. తిరువగరి వేంకటాచార్యులు
326. గోపమంత్రి
327. మల్లికార్జున సిద్ధయోగి

13 సంపుటము :   డెమ్మీసైజు :   258 పుటలు :

328. విజయరంగ చొక్కనాథ భూపాలుఁడు
329. మఱింగంటిసింగరాచార్యులు
330. ముత్తరాజు వేంకటకృష్ణకవి
331. శేషము వెంకటపతి
332. వంగల సీనయార్యుఁడు
333. పాలవేకరి కదిరీపతి
334. బచ్చలి వీరవెంకకవి
335. రాపాక లక్ష్మీపతి
336. రేకపల్లి సోమనాథకవి
337. నెల్లూరి వీరరాఘవకవి
338. మంగళగిరి ఆనందకవి
339. సముఖం వెంకటకృష్ణప్ప నాయకుడు
340. తుపాకుల అనంతభూపాలుడు
341. కళువె వీరరాజు
342. ఋగ్వేది వేంకటాచలకవి
343. శాహా మహారాజు
344. తెనాలి రామలింగకవి
345. శేషాచలపతి
346. బాలకవి సుబ్బన్న
347. సత్యవోలు భగవత్కవి
348. రేవూరి అనంతనార్యుఁడు
349 మాచవరం పావనార్యుఁడు
350. కూచిమంచి తిమ్మకవి [కవి
351. పైడిపాటి వేంకటనృసింహ
352. అయ్యలరాజు నారాయణామాత్యుఁడు
353. తాడేపల్లి పానకాలరాయ కవి
354. తాడిపల్లి పానకాలరాయకవి
355. దర్భా గిరిరాజకవి

